Entered

# చతుర

అక్టోబరు 2006

రూ. 7/-



జయకాంతన్ నవల

## అనుబంధాలు



## టక్కరి తెలివి

అబ్బో, ఈ ఆఫ్రికన్ కొంగగారిదెంత టక్కరి తెలివో! రెక్కలు విప్పి గుడ్లు పొదుగుతున్న ఫోజులో కూర్చున్నా నిజానికది వేట పనిలో నిమగ్నమై ఉంది. ఆ కొంగ గొడుగులా విప్పార్చిన రెక్కలతో నీటి మీద నీడను పరుస్తుంది. సూర్య కాంతి సోకని ఆ నీడను చూసి అది ఏ రాయివల్లో మరి దేని వల్లో ఏర్పడిందని భ్రమించి అటుగా వచ్చే చేపల్ని చటుక్కున ముక్కున కరిచి గుటుక్కున మింగేస్తుంది.

సంపుటి - 29
సంచిక : 9
అక్టోబరు : 2006
345వ సంచిక



నవ నవలా వేదిక

# చతుర



హెల్త్ బిట్స్:
**ఎం. వెంకటేశ్వరరావు**

**ఈ నెల నవల**

తండ్రీ కొడుకుల అనుబంధాన్ని
అపురూపంగా చిత్రించిన

**జయకాంతన్**
తమిళ నవల

# అనుబంధాలు

అనువాదం: జిల్లేళ్ళ బాలాజీ

10 వ పేజీలో

బొమ్మలు: పినిశెట్టి



2007 ఫిబ్రవరిలో

# చతుర 30 ఏళ్ల పండుగ! సందర్భంగా

# నవలల పోటీ




తెలుగు పత్రికా చరిత్రలో ఒక వినూత్న ప్రయోగం "**చతుర**"
కేవలం నవలల ప్రచురణకే ప్రత్యేకించిన మాసపత్రిక "**చతుర**"
ప్రచురించే నవలలన్నీ ఉత్తమాభిరుచులుగలవిగా ప్రశంసలనందుకున్న నవలా మాసపత్రిక "**చతుర**"
1978 ఫిబ్రవరిలో ప్రారంభమైన "**చతుర**" గతంలో 100వ సంచిక, 200వ సంచికలు వెలువడిన సందర్భంగా నిర్వహించినట్లే 2007 ఫిబ్రవరిలో 30 వసంతంలోకి అడుగిడుతున్న సందర్భంగా మళ్ళీ నవలల పోటీ నిర్వహిస్తోంది.

| | |
|---|---|
| ప్రథమ బహుమతి రూ. 30,000 | తృతీయ బహుమతి రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి రూ. 20,000 | రూ. 8,000 చొప్పున 5 ప్రోత్సాహక బహుమతులు రూ. 40,000 |

- తెలుగువారి సామాజిక జీవితమే ఇతివృత్తమై ఉండాలి. సరికొత్త ఆలోచనలకీ, నూతన ప్రయోగాలకీ, కథనంలో నైపుణ్యానికీ ప్రాధాన్యం.
- చతురలో నవలలు అచ్చులో 90 పేజీలు దాకా ఉంటాయి. సాధారణంగా 32,000పదాలున్న నవలలు 90 పేజీలకు సరిపోతాయి. అందరూ అరఠావుల మీదే రాస్తున్నా, రకరకాల దస్తూరీల వలన అచ్చులో హెచ్చు తగ్గులు వస్తుంటాయి. కనుక రాతప్రతిలో ఒకరి దస్తూరీలో, ఒక పేజీలో ఎన్ని పదాలు వస్తున్నాయనే దానినిబట్టి నవల 32,000 పదాలకు తక్కువగాకుండా ఉండేలా జాగ్రత్తపడటం అవసరం.
- నిడివి విషయంలో ప్రత్యేకంగా ఈ సూచనలను దృష్టిలో ఉంచుకుని రాసిన నవలలే పరిశీలనార్హాలవుతాయి. నవల సైజు కావలసిన దాని కన్నా పెద్దదిగా ఉండవచ్చుగానీ, చిన్నదిగా మాత్రం ఉండరాదు.
- అవసరాన్ని బట్టి నవలను కుదించడానికీ, సరిచేయడానికీ సంపాదకులకు హక్కు ఉంది. బహుమతులకు అర్హంకాని నవలలను సాధారణ ప్రచురణకు స్వీకరించే అవకాశం ఉంది.
- ఎంపిక కాని నవలలు కావాలనుకునేవారు తగినన్ని స్టాంపులంటించిన కవరు జతచేయక తప్పదు.
- కవరు మీద 'నవలల పోటీకి' అని తప్పనిసరిగా పేర్కొనాలి.
- మొదటి పేజీలోనే మీ పేరు, చిరునామా, నవల స్వంతమనీ, అనువాదం అనుసరణ కాదనీ, మరే పత్రిక పరిశీలనలో లేదనీ, అముద్రితమనీ స్పష్టమైన హామీ ఇవ్వాలి.
- నవల రాత ప్రతిలో మరెక్కడా రచయిత పేరుగానీ, చిరునామాగానీ రాయకూడదు.
- నవలల ఎంపిక, బహుమతుల నిర్ణయం వంటి అంశాలలో సంపాదకులదే తుదినిర్ణయం. ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలకూ అవకాశం లేదు.

నవలలు మాకు చేరవలసిన
ఆఖరి తేదీ: **అక్టోబర్ 31**

ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082

2007 ఫిబ్రవరిలో

# విపుల 30 ఏళ్ల పండుగ!

సందర్భంగా

# తెలుగు కథల పోటీ




మరే భారతీయ భాషా పత్రికారంగంలోనూ లేని విశిష్ట ప్రయోగం **"విపుల"**.
పూర్తిగా కథాసాహిత్యానికే అంకితమైన ఏకైక పత్రిక **"విపుల"**.
తెలుగు కథలతోపాటు వివిధ భారతీయ భాషలు,
విదేశీ భాషలనుండి ఎన్నిక చేసిన ఉత్తమ కథలకు వేదిక **"విపుల"**.
1978 ఫిబ్రవరిలో ప్రారంభమైన **విపుల** గతంలో 100వ సంచిక, 200వ సంచికలు వెలువడిన సందర్భంగా నిర్వహించినట్లే 2007 ఫిబ్రవరిలో 30 వసంతంలోకి అడుగిడుతున్న సందర్భంగా మళ్ళీ తెలుగు కథల పోటీ నిర్వహిస్తోంది.

ప్రథమ బహుమతి రూ. 15,000 తృతీయ బహుమతి రూ. 6,000
ద్వితీయ బహుమతి రూ. 10,000 రూ. 3,000 చొప్పున 23 ప్రోత్సాహక బహుమతులు రూ. 69,000

- తెలుగువారి సామాజిక జీవితమే ఇతివృత్తమై ఉండాలి. సరికొత్త ఆలోచనలకీ, నూతన ప్రయోగాలకీ, కథనంలో నైపుణ్యానికీ ప్రాధాన్యం.
- కథల నిడివికి పరిమితులు లేవు. కానీ, 15 అరఠావులకు మించకుండా వుంటే మంచిది.
- అనువాదాలు, అనుసరణలు, జిరాక్స్ కాపీలు పరిశీలనార్హం కాదు.
- ఎంపిక కాని కథలు కావాలనుకునేవారు తగినన్ని స్టాంపులంటించిన కవరు జతచేయక తప్పదు.
- కలంపేరు ప్రచురణ కొరకే. పూర్తిపేరు, వివరాలు తెలియజేయాలి.
- కవరు మీద 'కథల పోటీకి' అని తప్పనిసరిగా పేర్కొనాలి.
- మొదటి పేజీలోనే మీ పేరు, చిరునామా, కథ స్వంతమనీ, అనువాదం అనుసరణ కాదనీ, మరే పత్రిక పరిశీలనలో లేదనీ, అముద్రితమనీ స్పష్టమైన హామీ ఇవ్వాలి.
- కథ రాత ప్రతిలో మరెక్కడా రచయిత పేరుగానీ, చిరునామాగానీ రాయకూడదు.
- కథల ఎంపిక, బహుమతుల నిర్ణయం వంటి అన్ని విషయాల్లో సంపాదకులదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకూ అవకాశం లేదు.

కథలు మాకు చేరవలసిన
ఆఖరి తేదీ: **అక్టోబర్ 14**

ఎడిటర్, విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082

# ది మిల్ ఆన్ ది ఫ్లాస్

1860

కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

గ్రామాల్లో ప్రశాంతత ఉంటుందనుకోవటం ఒక ఊహ మాత్రమే. చిన్న చిన్న తగాదాలు, పంతాలు పట్టింపులతో చితికిపోయిన జీవితాలు అక్కడే ఎక్కువ. ఉద్వేగభరితమైన ఈ నవల నేపథ్యం ఇదే.

ఫ్లాస్ నది మీద ఎర్రటి ఇటుకలతో కట్టిన పాక ఒకటుంది. అదే డార్ల్‌కాట్ మిల్లు. టలివర్ అనేక సంవత్సరాలపాటు కష్టపడి సంపాదించుకున్న ఆస్తి అది. అదే అతడి జీవనాధారం. భార్యా ఇద్దరు పిల్లలతో సంసారం సాఫీగానే సాగిపోతోంది. కొడుకు పేరు టామ్. వాడికి పదమూడేళ్ళే. పెరిగి ప్రయోజకుడు కాడేమోనని తండ్రి బెంగ. కూతురు మాగీకి తొమ్మిది. ఆ పిల్లకు ఉంగరాల జుత్తు లేదని తల్లి రోజూ తెగ బాధపడిపోతుంటుంది.

కోర్టు కీడుస్తా"నంటాడు. పైగా దుబారా మనిషి. అవసరం పడినప్పుడల్లా అక్కల దగ్గరా, చెల్లెళ్ల దగ్గరా చేబదుళ్లు తీసుకోవటం అతడి అలవాటు. తనలాగే టామ్ కూడా మాగీ దగ్గర చేతులు జాస్తాడేమోనని బాధ పడుతుంటాడు. పశ్చాత్తాపంతో అందరి అప్పులూ తక్షణమే తీర్చేయ్యాలని కూడా నిశ్చయించుకుంటాడు. కాని అది అసాధ్యం.

మాగీది కలలు కనే స్వభావం. ఒకనాడు ఇంటికి రాదు. నదిలో పడి మునిగిపోయిందనుకుంటారందరూ. కాని ఆ పిల్ల జిప్సీ (ఒక సంచార తెగ)ల వద్దకెళ్లింది. వాళ్లకు రాణి కావాలని ఆమె కోరిక. బంధువుల వద్ద చేసిన అప్పులు తీర్చే క్రమంలో టలివర్ లాయర్ వాకెమ్ వద్ద ప్రోనోటు రాసి అయిదు



జార్జ్ ఎలియట్

ఏడాదికి వంద పౌండ్ల ఫీజుతో కొడుకును ప్రైవేటు ట్యూటర్ వద్దకు పంపించాడు తండ్రి. అన్న లేకపోతే మాగీకి ఒక్కరోజు కూడా గడవదు. సెలవులకు వచ్చిన టామ్ చెల్లెల్ని చెడామడా తిట్టి తన మిత్రుడు బాబ్ జేకిన్‌తో ఆడుకోవటానికి వెళ్ళిపోయాడు.

"కొద్దిరోజులకే టామ్ ఇలా మారిపోయాడు. తనను పట్టించుకోవడమే మానేశాడు" అనుకుని మాగీ వెక్కివెక్కి ఏడుస్తుంది.

టలివర్ మంచివాడే గాని కోపమెక్కువ. మాట్లాడితే చాలు ఎవరి మీదైనా "కేసుపెట్టి

వందల పౌండ్లు తీసుకుంటాడు.

* * *

క్రిస్మస్ సెలవులకు ఇంటికొచ్చిన టామ్‌కు వాతావరణం మారిపోయినట్టుగా కనిపిస్తుంది. తండ్రి కోపం మరీ పెరిగింది. పైవార్ట్ అనబడే తోటి రైతు ఫ్లాస్‌కు కాలవ తీసి నీళ్లు మళ్లించుకున్నందుకు అతడి మీద కేసు పెడతాడు. కాని పైవార్ట్‌కు లాయర్ వాకెమ్ మంచి మిత్రుడు. మరికొన్నాళ్లకు వాకెమ్ కొడుకు ఫిలిఫ్ కూడా ట్యూషన్ కోసం వచ్చి చేరతాడు. టామ్ అంటే అతడికి మరీ ఇష్టం. అప్పుడప్పుడూ ఇంటిక్కూడా

మిల్లు అమ్మినా ఫరవాలేదుగాని ఒకరి ముందర చేతులు చాచగూడదని అతడి భావన. టామ్ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తాడు. డీన్ అనే ఒకాయిన దయతలిచి తన గిడ్డంగిలో పనిచ్చి, బుక్‌కీపింగ్ కూడా నేర్పిస్తాడు.

లాయర్ వాకెమ్ మిల్లును కొని, టలివర్‌కు అదే మిల్లులో మేనేజర్‌గా ఉద్యోగం కూడా ఇస్తానంటాడు. ఇది పుండుమీద కారం చల్లటమే. అయితే టలివర్‌కు మిగిలిన ఒకే ఒక కోరిక పుట్టిన ఊళ్లోనే చావటం. అందువల్ల అవమానాన్ని దిగమింగుకుని ఉద్యోగానికి అంగీకరిస్తాడు. తన శత్రువు వాకెమ్ మీద ప్రతీకారం తీర్చుకోవాలని కొడుకు చేత వాగ్దానం చేయిస్తాడు.

వస్తుంటాడు. పిల్లలు ఎదుగుతున్నారు. మాగీని ఆకర్షిస్తాడు ఫిలిప్. టామ్‌కు గాయమై కదలలేకుండా ఇంట్లో వున్నప్పుడు తరచూ వచ్చి పలకరించాడు. అసలు కారణం మాగీని చూడాలని కూడా కావచ్చు.

* * *

టలివర్ ఊళ్లో తలెత్తుకుని తిరగలేనంత పని జరిగిందొకనాడు. కోర్టు బంట్రోతు కోర్టు ఆర్డర్లతో వస్తాడు. మిల్లులో, పొలాల్లో ఆడుకుని వచ్చిన అన్నా, చెల్లెళ్లు ఈ దృశ్యం చూసి నిర్ఘాంతపోతారు. వాకెమ్ దగ్గర తీసుకున్న అప్పు తీర్చలేనందుకు ఆస్తి వేలం వేస్తారట. నగలూ, వెండి సామాన్లూ మూట గట్టుకుని గదిలో రోదిస్తుంటుంది తల్లి. అప్పటిదాకా ఎంతో గర్వంగా బతికిన టలివర్ జీవచ్ఛవంలా



"వ్యక్తులకూ, సమాజానికీ, అవినాభావ సంబంధముంటుంది. సామాజిక శక్తులు అనివార్యంగా వ్యక్తుల జీవితాలను ప్రభావితం చేస్తాయి. ఇంగ్లాండులోని దిగువ మధ్యతరగతి ప్రజలు అంటే చిన్న దుకాణదార్లు, వృత్తి పనివాళ్లు, మిల్లర్లు, రైతుల జీవన పరిస్థితులను ఈ కోణం నుండి అధ్యయనం చెయ్యటమే నా లక్ష్యం". –జార్జ్ ఎలియట్

మంచం మీద ముడుచుకుని పడుకుంటాడు.

తను ఉద్యోగం సంపాదిస్తానని బెంగపడవద్దని ధైర్యం చెప్పే ప్రయత్నం చేస్తాడు టామ్.

టలివర్ పరిస్థితిని వాకబు చెయ్యటానికి అక్కా-చెల్లెళ్లు, బంధువులు వస్తారు. వాళ్ల ఓదార్పు మాటలు, సానుభూతితో అవమానభారం రెట్టింపవుతుంది. వీలయిన సాయం చేస్తామంటారు టామ్ మేనత్తలు. "నిజంగా చేసే ఉద్దేశమే ఉంటే, అదేదో ఇప్పుడే వెంటనే చెయ్యచ్చు గదా. మీ వీలునామాల్లో నా పేర ఎంతో కొంత రాస్తారు. నా వాటా ఇప్పుడే యిస్తే మమ్మల్ని ఆదుకున్నట్టవుతుంది" అంటూ ప్రాధేయపడతాడు టామ్.

సాయం అర్థించటం టలివర్‌కు గిట్టదు.

* * *

టలివర్‌కు పేదరికమంటే ఏమిటో తెలిసి వచ్చింది. వీధిలో నడుస్తుంటే అందరూ తనను చూసి నవ్వుతున్నట్టుగా అనిపిస్తుంది. మాగీ పరిస్థితి వేరు. బాబ్ జేకిన్స్, ఫిలిప్ వాకెమ్‌లనిద్దర్నీ ఆమె ఆకర్షించింది. ఒకనాడు, చెల్లెలు, ఫిలిప్‌తో మాట్లాడటం టామ్ కంటపడింది. తమనీస్థితికి దిగజార్చిన శత్రువుతో స్నేహమా? మళ్లీ ఎప్పుడూ అతణ్ణి కలుసుకోనని మాగీతో ఒట్టేయించుకుంటాడు.

ఆ సాయంత్రం అప్పులు మొత్తం ఎన్నున్నాయో తెలుసుకోవాలని ప్రోనోట్లన్నీ లెక్కవేస్తాడు టామ్. తెలియకుండా చాలా చేశానని, క్షమించమని అంటాడు టలివర్.

## జార్జి ఎలియట్ (1819-1880)

జార్జి ఎలియట్ అసలు పేరు మేరీ ఆన్ ఎవాన్స్. ఆమె జన్మస్థలం ఇంగ్లాండులోని వార్విక్ షైర్. తండ్రి వడ్రంగి. అతడు కొంత కాలం రాజకీయాల్లో కూడా చురుగ్గా పాల్గొన్నాడు. బాల్యంలోనే మేరీ ఎవాన్స్ సాహిత్యంతో పాటు, మత విషయాలలో కూడా ఆసక్తి పెంచుకుంది. 1836లో తల్లి మరణంతో ఇంటి బాధ్యతలన్నీ ఆమె మీద పడ్డాయి. స్కూలు చదువు ముగిసింది. సోదరుడు రాబర్ట్, వివాహం చేసుకుని ఇంటి యజమానిగా మారాడు. ప్రైవేట్ టీచర్ల సాయంతో మేరీ ఆన్ గ్రీక్, జర్మన్, ఇటాలియన్, లాటిన్ భాషలూ, సంగీతం నేర్చుకుంది. ఆ రోజుల్లో విరివిగా వచ్చిన రొమాంటిక్ సాహిత్యం మీదా వర్డ్స్‌వర్త్ కవిత్వం మీదా మక్కువ పెంచుకుంది. శాస్త్ర విషయాలు కూడా ఆమెకు ఇష్టమే. గణితం, ఖగోళశాస్త్రం, కెమిస్ట్రీ, జియాలజీ, ఎంటమాలజీ (కీటకశాస్త్రం), ఫ్రెనాలజీ (బౌద్ధిక భౌతికశాస్త్రం) అధ్యయనం చేసింది.

తన ఆంటీ మెథడిస్ట్ ప్రచార సంఘటనలు ఆధారంగా చేసుకుని తొలి నవల 'ఆడాం బీడ్ (1859) రాసింది. తత్కాలీన సామాజిక సమస్యల పరిష్కారం కోసం కూడా కృషి చేసింది. క్రిస్టియన్ మతంలోని మౌఢ్యాలను నిరసించి 'అవిశ్వాసిగా' విమర్శలు ఎదుర్కొంది. ఆనాటి ప్రముఖ మేధావులు ఎమర్సన్, చార్ల్స్ హెనేక, జార్జ్‌కొరెబ్ లాంటి

"అప్పులన్నీ తీర్చి మన కుటుంబ గౌరవం నిలబెట్టే బాధ్యత నాదంటూ తండ్రికి భరోసా ఇస్తాడు టామ్. అప్పటిదాకా మంచానికతుక్కుపోయిన టలివర్‌కు కొడుకు మాటలతో ఉత్సాహం వస్తుంది. అందరూ వారిస్తున్నా వినక గుర్రపుస్వారీకి బయల్దేరతాడు. దార్లో కనిపించిన లాయర్‌తో పేచీ పెట్టుకుని, తిట్టి, కొట్టి రొప్పుతూ ఇంటి కొచ్చి పడిపోతాడు. ఆ రాత్రే మరణిస్తాడు.

* * *

ఇంటి పెద్ద పోవటంతో కుటుంబం చెల్లాచెదురైపోతుంది. బాబ్ జేకిన్ ఇప్పుడు బోట్ల యజమాని. అతడి వద్దకు వెళిపోతాడు టామ్. మాగీ టీచర్‌గా చేరుతుంది. మిసెస్ టలివర్ బంధువుల ఇంట్లో ఆయాగా పనికి కుదురుతుంది.

మాగీకి తరచుగా ఫిలిప్ కనిపిస్తుంటాడు. కాని అన్నకు చేసిన వాగ్దానం గుర్తుకొచ్చి అడుగు ముందుకెయ్యదు. ఈ పట్టింపులతో ఎన్నాళ్లిలా బతకటం? ఇష్టం వచ్చిన వ్యక్తితో స్నేహం చేసే స్వేచ్ఛ కూడా తనకు లేదా? "అన్న చచ్చిపోయ్యాడనుకో"అని టామ్ సమాధానం. ఫిలిప్ కూడా ఆమె ప్రేమలో కాలిపోతున్నాడు. కాని పెళ్లి జరగటం అసాధ్యం.

ఇది తెలిసి, స్టీఫెన్ గెస్ట్ అనే ఒక కజిన్ ఆమెతో తన ప్రేమను వ్యక్తపరుస్తాడు. తను ఫిలిప్‌ను ప్రేమించానని పెళ్లి చేసుకునే అవకాశం లేకపోయినా అతడే భర్తని అంటుంది మాగీ. స్టీఫెన్‌గెస్ట్‌ను ఇష్టపడిన యువతి లూసీ. ఆమె మాగీ, ఫిలిప్‌లను కలపటానికి ప్రయత్నిస్తుంది. అంతేకాదు. మిల్ తిరిగి ఇచ్చేస్తే టామ్ కోపం తగ్గవచ్చునని కూడా ఆమె ఊహ. స్టీఫెన్ కోరిక మన్నించి ఫ్లాస్ మీద బోట్ రైడ్‌కు వెళుతుంది మాగీ. టామ్ కంటపడుతుందీ విషయం. తనకు తెలియకుండా చెల్లెలు ప్రేమాయణం నడిపించటం భరించలేడు.

అతడనుకున్నట్టుగా ఏమీ జరగలేదని చెప్పబోతుంది మాగీ. కాని టామ్ వినడు. ఆమెను ఇంటిలోకి కూడా రానియ్యడు. గ్రామాల్లో ఇలాగే జరుగుతాయి. మాగీకి ఉద్యోగం ఇచ్చిన పెద్ద మనిషి ఆమెను పనిలోంచి తీసేస్తాడు. ప్రేమ ఉంది. తన కోసం ప్రాణమిచ్చే ప్రేమికులున్నారు. ప్రాణానికి ప్రాణం అను

వాళ్లు ఆమె మేధో ప్రతిభకు ముగ్ధులైనారు.

"ది వెస్ట్ మిన్స్టర్ రివ్యూ" పత్రిక కోసం పనిచేస్తున్న రోజుల్లో ప్రముఖ సాహిత్యకారుడు, విమర్శకుడు జార్జ్‌హెన్రీ లెనెస్‌తో పరిచయం ఏర్పడింది.

అప్పటికే లెనెస్ వివాహితుడు. అయినా బహిరంగంగానే అతడితో కలసి జీవించటానికి నిశ్చయించుకుంది మేరీ ఎవాన్స్. వివాహేతర సంబంధాలను ఏకాలంలోనూ, ఏ సమాజమూ ఆమోదించలేదు. ఇంతటి ప్రముఖ రచయిత్రికి కూడా జీవితకాలంలో వచ్చిన కీర్తి కన్నా అపకీర్తి ఎక్కువ.

వ్యక్తిగత సమస్యల విషయం ఎలా ఉన్నా, ఈ సంబంధంతో ఇంగ్లిష్ సాహిత్యానికి మాత్రం ఎనలేని మేలు జరిగింది. లెనెస్ ప్రోత్సాహంతో 'జార్జ్ ఎలియట్' అనే కలం పేరుతో మేరీ ఎవాన్స్ నవలా రచన ప్రారంభించింది. 'ఆడం బీడ్' తర్వాత ప్రతి నవలతో ఆమె కీర్తి ఇనుమడించింది. సైలాస్ మార్నర్ (1861); రోమోలా (1863); ఫెలి క్స్, హోల్ట్, ది రాడికల్ (1866); మిడిల్ మార్చ్ (1872); డేనియల్ డేరొండా (1876)లు సాహితీ ప్రియులకు సుపరిచితం. 'యుద్ధము-శాంతి'తో పోల్చదగినంత గొప్ప నవల మిడిల్ మార్చ్

1860లో ప్రచురితమైన 'ది మిల్ ఆన్ ది ఫ్లాస్' ఆత్మ కథాత్మకమైన నవల. ఇందులో ఆమె చిత్రించిన విషాద దార్శనికత పాఠకుల మనసులను కలచివేస్తుంది.

కున్న అన్నయ్య ఉన్నాడు. అయినా జీవితంలో ఏమీ మిగల్లేదు.

తెలిసీ తెలియక చేసిన పాపాలన్నింటికీ ప్రాయశ్చిత్తంగా ప్రభువు ముందు మోకరిల్లి ప్రార్థించాలనుకుంటుంది మాగీ. ఆ ఒంటరితనంలో పాదాలకేదో తడి తగిలినట్టవుతుంది. ఉలిక్కిపడి కళ్లు తెరుస్తుంది. క్షణంలో గదినిండా నీళ్లు. నది గట్టున నివసించే వాళ్లకిది సుపరిచిత దృశ్యమే. ఫ్లాస్ పొంగింది. వరద ఊరిని ముంచేస్తున్నది.

బాబ్ జేకిన్స్‌నూ, అతడి భార్యనూ లేపి బోట్‌లోకి చేర్చుతుంది. ఆ క్షణాన ఆమెకు కలిగిన కోరిక- ఎలాగైనా అన్నను రక్షించాలి. తుఫానులాగ ఉంది వాతావరణం. అలలు ఎగిసిపడుతున్నాయి. మరొక బోట్ తీసుకుని టామ్ కోసం బయలుదేరుతుంది. కాని ఆ అలజడిలో బోటు కదలదు. తెడ్లు వెయ్యటం వీలుపడదు.

చెల్లెలు మునిగిపోతోందనుకుని టామ్ కూడా రక్షించటానికి ప్రయత్నిస్తాడు. ఉవ్వెత్తున లేచిన కెరటాలతో ఫ్లాస్ అన్నా చెల్లెళ్లిద్దర్నీ తన గర్భాన చేర్చుకుని ముందుకురుకుతుంది.

కథలోని మలుపులు మినహాయిస్తే, మాగీ పాత్ర ద్వారా రచయిత్రి తన అభిప్రాయాల్నే చెప్పిందని పాఠకులకు తెలిసిపోతుంది. ముఖ్యంగా మాగీ ప్రేమను టామ్ అంగీకరించకపోవటం రచయిత్రి స్వానుభవమే.

**"సుభాషితాలకు అతీతమైనది జీవితం. అన్నీ తెలుసుకున్నామనుకుని నిబంధనలు తయారుచేస్తారు కొందరు. వాటిని ఉల్లంఘించి అవన్నీ అసమగ్రమని వాస్తవం నిరూపిస్తుంది" అంటుంది మాగీ. "తల వంచుకున్న వాళ్లమీద రాళ్లెయ్యటం సమాజ లక్షణం" అని గ్రహించింది జార్జి ఎలియట్. "అత్యంత ఆప్తులు, రక్తం పంచుకొని పుట్టినవాళ్లే మనపట్ల ఇంత క్రూరంగా ఎందుకు ప్రవర్తిస్తారు?" అని ప్రశ్న వేసుకుని దానికి సమాధానంగా రాసిన నవల ఇది. హెన్రీ ఫీల్డింగ్, విలియం మేక్‌పీస్ థాకరే లాంటి వాళ్లు సామాజిక ఇతివృత్తాలతో రాసినా, వ్యక్తికీ, సమాజానికీ ఉన్న సంబంధాన్ని విశ్లేషించిన తొలి ఇంగ్లిష్ నవలగా గుర్తింపు పొందింది "ది మిల్ ఆన్ ది ఫ్లాస్"**

–ఎం. వసంత

# అనుబంధాలు



తమిళ మూలం: జయకాంతన్

అనువాదం: జిల్లేళ్ళ బాలాజీ



'నా పేరు హెన్రీ. ఇకపై ఈ ఊళ్ళోనే ఉండబోతున్నాను. విలేజ్ మున్సిఫ్‌ను కలవడానికి కాస్త హెల్ప్ చేస్తారా?" అంటూ ఆ ఊళ్ళో ప్రవేశించిన అతడు ఏనాడో ఊరిని విడిచి ఎటో వెళ్ళిపోయిన భాగవతార్ దత్తపుత్రుడనని సాక్ష్యాలు చూపాడు. తన పెంపుడు తండ్రి ఇంట్లో నివసించి ఆయన మధుర జ్ఞాపకాన్ని శాశ్వతం చేసుకోవాలనుకున్నాడు. ఏ దురలవాటూ లేని ఆ ఆగంతకుని పట్ల ఊరి ప్రజలు, పినతండ్రి, పినతల్లి కుటుంబం వ్యవహరించిన తీరును, అందరితో అతడు వ్యవహరించిన రీతిని, బాంధవ్య బంధాన్ని ఆసక్తిదాయకంగా మలచిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత జయకాంతన్ తమిళ నవల అనుబంధాలు ఈ నెల 'చతుర' సమర్పణ.

ఆ లారీలో మొత్తం ఏడుగురు వ్యక్తులు ఉన్నారు. బీడీ తాగుతున్న డ్రైవర్ దొరస్వామి పక్కనే దేవరాజులు కూర్చొని ఉన్నాడు. ఎప్పటిలాగే అతడు తన ప్రత్యేక తను ప్రదర్శించేలా పుస్తకాన్ని చదువుకుంటు న్నాడు. అతడి చేతిలో 'అట్లస్ ష్రక్ట్' అన్న పుస్తకం ఉంది. అతడు పక్కనున్న ఓ గ్రామం లో సుఖంగా, హాయిగా జీవితాన్ని వెళ్ళదీస్తు న్నాడు. అక్కడి ఉన్నత పాఠశాలలో పి.టి. అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు. ఈ మనుష లతో సంబంధం లేనివాడిగా ఉండటానికే అతడు ఇష్టపడతాడు. లారీలో ఎడమ పక్కన ఒదిగి కూర్చుని ఉన్న క్లీనర్ పాండు, దేవరా జులుకూ తనకూ మధ్య కూర్చొని నిద్రలో తూగుతున్న ముసలివాణ్ణీ, బయట కనిపి స్తున్న వింతలనూ చూస్తూ కూర్చున్నాడు. మోకాలిదాకా నిక్కరూ, మురికి పట్టిన బని యనూ వేసుకున్న పాండు, దొరస్వామికి తగ్గ శిష్యుడు. లారీ వెనుక భాగంలో ముగ్గు రు వ్యక్తులు నిలబడి ఉన్నారు. ఆ ముగ్గురూ నడుముకున్న పంచెల్ని తలపాగాలా చుట్టు కుని గోచీలతో నిలబడి ఉన్నారు. ఆ ప్రాంతం లోని పేద గ్రామీణులు అలాగే తిరగటం పరి పాటి. ఇంకాస్త దూరం వెళితే మరికొందరు లారీలోకి ఎక్కుతారు. బస్సులో వెళితే ఎంత చార్జీ అవుతుందో అంతే డబ్బును ప్రయాణికు లనుండి పాండు వసూలు చేస్తాడు. డ్రైవర్ దొరస్వామి ఆ డబ్బుకు లెక్క అడుగుతాడే తప్ప తనకు భాగమివ్వమని ఏనాడూ పాండును అడిగింది లేదు. అయితే పాండు తనంతటతానుగా లారీలోకి ప్రయాణికుల్ని పిలిస్తే మాత్రం దొరస్వామికి ఒళ్ళుమంట. కొన్ని సందర్భాల్లో కోపంతో పాండును కొట్టడం కూడా జరిగేది.

ట్రంక్ రోడ్డులోని ఆర్కేపేట పక్కనున్న గ్రామాల్లోంచి సరుకులు తీసుకొచ్చే లారీ అది. ఎప్పుడైనా చాలా దూరం ప్రయాణించటం కద్దు. బండి చాలా పాతబడిపోయినందున దొరస్వామి దాన్ని నమ్ముకుని ఈమధ్య బయటి ఊళ్ళకు ప్రయాణం చేయటం లేదు.

ఆర్కేపేట నుండి తూర్పుకు సాగే కొండ ప్రాంత ఘాట్‌రోడ్లలో ఇరవై మైళ్ళ దూరం లోని గ్రామాలను చుట్టుకుంటూ 'కుమార పురం' చేరుకునే లారీ అది. ఆర్కేపేట రైల్వే స్టేషన్ కల్గిన చిన్న ఊరే అయినా రెండు ట్రంక్ రోడ్లు ఒకదాన్నొకటి అడ్డుపడే 'క్రాస్ రోడ్' జంక్షనైనందు వలన లారీలవాళ్ళు, కమీ షన్ వ్యాపారులు, కూరగాయలు సప్లై చేసే గ్రామీణులతో సందడిగా ఉంటుంది. ఎగు మతి, దిగుమతి జరిగే స్థలంలాగా ఆ చుట్టు పక్కల గ్రామాల్లో ఆ ప్రాంతం ఎంతో గుర్తిం పు తెచ్చుకుంది. రెండు మూడు టీ కొట్లు, ఓ హోటలూ, దానిముందు వరుసగా నిలబడే లారీలు, ఎక్స్‌ప్రెస్ బస్సులూ, పెట్రోల్ బంకూ, ప్రయాణికులు కాసేపు సేదతీరే ప్రదే శంలా ఉండటం వల్ల ఆ సందడీ... అదీ... ఓ పెద్ద నగరంలోని వీధిలా కనిపిస్తుందే తప్ప ఆ ఊళ్ళో పెద్దగా వీధులూ, ఇళ్ళూ లేవు.

ఆర్కేపేటకూ కుమారపురానికీ మధ్య పది హేను మైళ్ళదూరం ఉంటుంది. మధ్యలో పది మైళ్ళవరకూ కొండ ప్రాంతం. ఆ పది మైళ్ళలోనే నాలుగు హేర్‌పిన్ మలుపులు ఉన్నాయి. కొండ ప్రాంతం ముగిసే ప్రదే శంలో కృష్ణరాజపురం అన్న అందమైన చిన్న గ్రామం ఉంది. లారీలోకి ఎక్కించే కాయగూ రలు, పువ్వులూ, అధికభాగం ఆ గ్రామం నుంచే సరఫరా అవుతాయి. ఆపై ఉన్న ఐదు మైళ్ళ దూరాన్ని దాటేంతలోనే విడిపోయే రహదారుల గుండా వెళ్ళే దాసుకుప్పం, కోన గిరి, ముంగిలిపట్టు వంటి గ్రామాలను చుట్టు కుంటూ కుమారపురం చేరటానికి పదిమైళ్ళ పైనే ఉంటుంది.

ఆర్కేపేటకూ, కుమారపురానికీ మధ్య నేరుగా బస్ సౌకర్యం ఉంది. కానీ బస్ తప్పి పోతే మళ్ళీ నాలుగు గంటలు ఎదురు చూడా ల్సిందే. అలాంటప్పుడు ప్రజలు ఇలాంటి లారీలనే నమ్ముకుంటారు.

ఐదు గంటల బస్ వెళ్ళిపోయింది. ఇక

ఆఖరి బస్సే మిగిలింది. పాండు ఆ రోజు ఎందుకో విచారంగా ఉన్నాడు. వాడు ఆశించిన విధంగా ప్రయాణీకులు ఎక్కకపోవటమే అందుకు కారణం. దొరస్వామి ఆ రోజు చాలా కుషీగా ఉన్నాడు. అందుకు ఏ కారణమూ లేదు. అతడి ముఖం కోపంగా ఉన్నా, అతడు లోలోపల ఎప్పుడూ సంతోషంగానే ఉంటాడు. రెంటికీ ప్రత్యేక కారణం అంటూ ఏమీ ఉండదు. నోట్లో బీడీతో ఏదో పాట పాడుతూ లారీని నడుపుతున్నాడు.

లారీ కొండదారిని సమీపించింది.

బ్యాగ్ ఉంది. ఎడమచేత్తో దాన్ని పట్టుకొని కుడిచేతితో కొత్త లెదర్ సూట్‌కేస్ నొకదాన్ని పట్టుకుని ఉన్నాడు. కాలికి బాగా మట్టికొట్టుకుపోయిన హవాయ్ చెప్పులున్నాయి.

అతడు బస్సును ఆపటం కోసం చేతిని చాపటమో, గొంతెత్తి అరవటమో చెయ్యలేదు. కొండదారినీ, ప్రకృతి అందాలనూ తన్మయత్వంతో చూస్తూ నడుచుకుంటూ వెళుతున్న అతను వెనుక- భారంగా రొప్పుకుంటూ వస్తున్న ఈ లారీని కూడా అంతే అబ్బురంగా చూశాడు. తన కోసం ఓ లారీ ఆగుతుందనో,

**మూల రచయిత పరిచయం** దండపాణి జయకాంతన్ (జెకెగా సుప్రసిద్ధులు) తమిళనాడులోని ఉత్తర ఆర్కాట్ జిల్లా, కడలూరులో 1934, మే 25న జన్మించారు. పెద్దగా చదువు కోకపోయినా, జీవితాలను బాగా చదివిన అనుభవశాలి. కొంతకాలం కమ్యూనిస్టు పార్టీలో పనిచేశారు. మార్క్సిజాన్ని బాగా అధ్యయనం చేశారు. స్త్రీ, పురుష సంబంధ భావోద్వేగాల తాలూకు లోతుపాతుల్ని అద్భుతంగా ఆవిష్కరించడంలో జయకాంతన్ దిట్ట. దాదాపు 200 పైచిలుకు కథలు రాశారు. నలభైకి పైగానే నవలలు రాశారు. వాటిలో 'సుందరకాండం', 'ఊరికి వందమంది', 'పాపం ఆమె ఓ బ్రాహ్మణ స్త్రీ', 'కోకిల ఏం చేసింది? ' 'కొన్ని సమయాలలో కొందరు మనుషులు,' 'ఓ మనిషీ -కొన్ని ఎనుబోతులు,' 'ఓ నటి నాటకం చూస్తోంది' ముఖ్యమైనవి. 1970లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, 1977లో తమిళ విశ్వవిద్యాలయం నుండి 'రాజరాజ చోళన్' 2002 సం॥లో ప్రతిష్ఠాత్మకమైన జ్ఞానపీఠ్ అవార్డు అందుకున్నారు. ఆయనకు నచ్చిన నవల 'అనుబంధాలు'.

'కొండదారి జాగ్రత్తగా ప్రయాణించండి' అన్న హెచ్చరిక బోర్డు సమీపంలో నడుచుకుంటూ వెళుతున్నాడు ఒక యువకుడు. తన వెనుక లారీ వస్తున్న శబ్దాన్ని విని వెనక్కు తిరిగి చూసి నిలబడ్డాడు.

అంతదూరం నుండే ఆ వ్యక్తి ఈ ప్రాంతానికి కొత్తవాడని తెలుస్తోంది. మట్టి కొట్టుకుపోయి, బూడిదరంగులోకి మారిపోయిన అతడి పైజామా అంచులు అసహ్యంగా కనిపిస్తున్నాయి. కొండగాలికి చిందరవందరైన అతడి వెంట్రుకలు ముఖానికి అడ్డుపడగా తలను విదిలించి లారీని చూశాడు. భుజాలమీదుగా ఆలివ్ రంగులోని మిలట్రీవాళ్ళ 'కిట్'లా ఓ

ఆగాలనో అతడు ఆశించలేదు.

పాండు, దొరస్వామితో "ఒక టికెట్ వస్తోందన్నా" అని ఆనందంగా చెప్పాడు. అప్పుడే దేవరాజులు ఆ వ్యక్తిని దగ్గరనుండి చూశాడు. లారీ వేగం తగ్గి అతడి పక్కకు వెళ్లి మెల్లగా ఆగింది. లారీ ఆగినపుడు, వెళుతున్నప్పటి కన్నా పెద్దగా ఇంజన్ శబ్దం చెయ్యడం వినిపించింది. ఎడమ పక్క డోర్ దగ్గర ఇరుక్కుని కూర్చొని ఉన్న పాండు కిందకు దూకి నిలబడ్డాడు.

ఆ యువకుడు తనకోసం లారీ ఆగటమూ, అందులో నుండి ఒకడు దిగటమూ చూసి అనుకోకుండా లభించిన సౌకర్యానికి సంతో

షించి కృతజ్ఞతలు తెలిపేలా నవ్వాడు. అక్కడున్న అందరికీ అతడు ఎంతో విచిత్రంగా కనబడ్డాడు. అతడి కనుపాపలు నీలంగా ఉన్నాయి. అయితే అతడి రంగు తెల్లదొరల లాగా లేదు. దేవరాజులు కూడా అతడికన్నా తెల్లగానే ఉన్నాడు. అయితే అతడి తల వెంట్రుకలు మాత్రం పూర్తిగా నల్లగా కాక కాస్త గోధుమ రంగులో ఉన్నాయి. అతడి రుమేనియా ముక్కు ఆ ప్రాంతపు మనుషుల్లో కనిపించని విధంగా ఉంది. "ఇతడికి తెలుగులో మాట్లాడితే అర్ధమవుతుందా? " అన్న అనుమానంతో పాండు, దేవరాజులు వైపుకు తిరిగి అన్నాడు.

"మీరే అడగండి సార్ - ఎక్కడికెళ్ళాలో"



దేవరాజులు అడగ టానికి ముందే అతడు అన్నాడు. "కృష్ణరాజపు రానికి వెళ్ళాలి. బస్ వెళ్ళి పోయింది. నెక్స్ట్ బస్... రావటానికి రాత్రి అయిపోతుందట కదా? " అంటూ పాండును చూసి ఓ చిర్నవ్వు నవ్వి- తన భుజానికి వేలాడు తున్న ఆ 'మిలిటరీ కిట్'ను పాండు భుజానికి మార్చాడు ఆ యువకుడు. పాండు అతడితో "మీరు ముందు ఎక్కండి సార్" అంటూ మర్యాదగా చెప్పి ముందు సీట్లో తన స్థానాన్ని అతడికి ఇచ్చి తాను వెనక ఎక్కాడు.

లారీలోకి ఎక్కాక తన పక్కన కూర్చొని ఉన్న ముసలి వ్యక్తినీ, ఆయనకు పక్కనున్న దేవరాజులునూ అప్పుడే గమనించాడతడు. వాళ్ళందరూ ఆ సమయంలో అతడి గురించే ఆలోచిస్తూన్నారు. అతడు తనను చూడడం కోసమే ఎదురుచూస్తున్న దేవరాజులు "కృష్ణ రాజపురంలో ఎవరిని కలవడానికి వెళుతు న్నారు? " అంటూ అడిగాడు. అతడు నుదురు చిట్లించాడు. అతడి చిన్నిఫాల భాగంలో మూడు గీతలు వంకరగా పడ్డాయి. మీసం



లేని పై పెదవిని రెండు మూడుసార్లు పళ్ళ తో కొరికాడు. తర్వాత నిదానంగా అన్నాడు.

"నేను ఎవరినీ కలవడానికి వెళ్ళడం లేదు"

ఆ సమాధానం ముందు సీట్లోని వారినం దరినీ, ఓసారి అతణ్ణి చూసేలా చేసింది. వెనుకవైపు నిలబడున్న పాండు కూడా వీళ్ళ వీపు భాగాన లారీ పలకలో ఉన్న చిన్న ద్వారం గుండా ఆ వ్యక్తిని చూశాడు. అతడు ఎంతో మామూలుగా బయటకు తల తిప్పి ఆ కొండ ప్రాంతాన్ని వింతగా చూడసాగాడు.

యువకుడూ, దేవరాజులూ మధ్యలో ఉన్న ముసలి వ్యక్తి ముందు చేతులు చాపి షేక్ హ్యాండ్ ఇచ్చుకున్నారు. వీళ్ళు ఇంగ్లిష్‌లో మాట్లాడుకోవటమూ, చేతులు కలుపుకోవట మూ చూసి పాండుకు ఎందుకో నవ్వొచ్చింది.

హెన్రీ తనలో తాను మాట్లాడుకుంటున్న ట్లు దేవరాజులుతో అన్నాడుI am a stranger. ఈ ఊళ్ళో, రోడ్డు మీద నడుస్తున్నప్పుడు మీకంతా నేను స్ట్రేంజర్‌ని, ఒంటరిగా ఉంటే I am a stranger to myself. నా పేరు హెన్రీ.

## అనువాద రచయిత పరిచయం



జిల్లేళ్ళ బాలాజీ తమిళ నాడులోని తిరుత్తణిలో 1961, మే 1న జన్మించారు. ఎం.ఏ. (తెలుగు) పిహెచ్.డి. చేశారు. భాష్యం విద్యాసంస్థల తిరుపతి శాఖలో తెలుగు ఉపా ధ్యాయుడిగా పని చేస్తున్నారు. ఇప్పటివరకూ దాదాపు ఎనభైకి పైగా కథలు, 50 వరకూ మినీ కవితలు వివిధ పత్రికలలో ప్రచురించబడ్డాయి. ఇవికాక 40 వరకూ పిల్లల కథలు కూడా వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. రెండు డిటెక్టివ్ నవలలు రాశారు కానీ అవి ఇంకా అముద్రితమే. తమిళ భాషపై పట్టు ఉన్నందున కొన్ని కథలు, నవలలు తెలుగులోకి అనువదించారు. వాటిలో జయకాంతన్ గారి నవల 'ఒరు నడిగై నాడగం పార్కిరాళ్' నవలను 'కళ్యాణి వెడ్స్ దివాకర్' పేరుతో ఆంధ్రజ్యోతి డైలీ సీరియల్‌గా 2004లో ప్రచురించారు. 'అనుబంధాలు' ఆయన అనువదిం చిన రెండవ నవల. 1985లో 'రసమయి' నిర్వహించిన కథానికల పోటీలో ప్రథమ బహు మతి; 1990లో 'జాగృతి' వారపత్రిక కథానికల పోటీలో ప్రోత్సాహక బహుమతి; 2000లో 'సుప్రభాతం' వారపత్రిక కథల పోటీలో తృతీయ బహుమతి; 2005లో 'పులికంటి సాహితీ సత్కృతి' కథల పోటీలో ప్రత్యేక బహుమతినీ అందుకున్నారు. కొన్ని కథలు తిరుపతి రేడియో కేంద్రం నుండి ప్రసారమయ్యాయి.

"If I am not inquisitive" అంటూ అతణ్ణి పిలిచేలా మొదలు పెట్టాడు దేవరాజులు. అతడు మళ్ళీ పై పెదవిని కొరుకుతూ దేవరా జును మిర్రి మిర్రి చూశాడు. దేవరాజులు కొనసాగిస్తూ అన్నాడు.

"మీరు ఏ పనిమీద కృష్ణరాజపురానికి వెళు తున్నారో తెలిస్తే నాకు చేతనైన సాయం చేస్తాను. నేనూ ఆ ఊరివాణ్ణే, నా పేరు దేవ రాజులు"

"హెన్రీ" అంటూ తన పేరు చెప్పి ఆ ఈ ఊళ్ళోనే ఇకపై ఉండబోతున్నాను. విలేజ్ మున్సిఫ్‌ను కలవడానికి కాస్త హెల్ప్ చేస్తారా? ఆయనతో నాకు కాస్త పనుంది".

అతడు మాట్లాడే తెలుగు స్వచ్ఛంగా లేదు. ఇంగ్లీషు ఉచ్చారణ అదోలా ఉంది. తెలుగు ఉచ్చారణ యాసగా ఉంది. అతడు చెప్పిన విషయం వాళ్ళను ఇంకా తికమకపడేలా చేసింది.

దొరస్వామి ఓ హేర్-పిన్ వంపులో లారీని జాగ్రత్తగా తిప్పి మిట్టపైకి డ్రైవ్ చేస్తూ చాలా

నిదానంగా అతణ్ణి చూస్తూ, చాలా సేపటి నుండి అడుగుదామా, వద్దా అనుకుంటున్న ప్రశ్నను చివరికి అడిగాడు.

"ఈ హిప్పీ-గిప్పీలంటారే... అదేనా మీరు? "

"నో" అంటూ దాన్ని ఖండించి "I don't know" అని తనలో తాను గొణుక్కున్నాడు హెన్రీ. మళ్ళీ బయటకు చూస్తూ కూర్చు న్నాడు ఓ పసిపిల్లాడిలా!

కొండదారిపై ఓ చోట సమతలంగా ఉన్న ప్రదేశంలో... రోడ్డు పక్కగా... ఓ నీటి గుంట వద్ద పాలరాతి బొమ్మలా ఓ పల్లెప డుచు స్నానం చేస్తూ కనిపించింది. ఆమె లారీని ఏదో ఓ యంత్రంలా భావించిన ట్టుంది. ఏ సిగ్గూ బిడియమూ లేకుండా స్నానం చేస్తూ కనిపించింది. హెన్రీ ఆ దృశ్యాన్ని చూశాడు. బండిలో ముందు కూర్చున్న ముసలి వ్యక్తీ, వెనుక నిలబడ్డ గ్రామీణులు తప్ప తక్కిన ముగ్గురూ ఆమెను చూశారు. పాండు కూడా చూశాడు. వాళ్ళు చూశాక అందరూ హెన్రీని చూశారు. హెన్రీ మాత్రం ఎవరినీ గమనించకుండా ఆ దృశ్యం దాటిపోయాక కూడా తల తిప్పి వెనక్కు తిరిగి చూడసాగాడు. అతడలా చూడ్డం దొరస్వామికి ఒళ్ళు మండేలా చేసింది. ఓసారి దగ్గాడు. అప్పటికీ హెన్రీ తల తిప్పక పోవటంతో- "దొరా, తల లోప లకి పెట్టుకో" అని చెప్పి అంతటితో ఆపటా నికి ఇష్టపడక "ఆడది నీళ్ళు పోసుకోవటాన్ని అలా చూస్తున్నావే..." అన్నాడు.

హెన్రీ నవ్వాడు. "మీరు అది మాత్రమే చూశారా? కొద్దిసేపటి క్రితం ఆ హేర్‌పిన్ వంపులో వస్తున్నప్పుడు... తెల్లని ఓ లేగ దూడ పరుగెత్తిందే...కింద పల్లంలో, పొలా ల మధ్య క్వొశ్చన్ మార్క్‌లాగా తోకను ఎత్తుకొని మన లారీ శబ్దానికి రెండు గెంతు లు గెంతిందే... పరుగెడుతూ ఆర్భాటం చేసిందే... దాన్ని చూశానే... మీరు చూళ్ళే దా? లారీకి అడ్డుగా ఇంతకు ముందు కోతు లు ఇటు పక్కనుండి అటు పక్కకు దబ్బు దబ్బుమని దూకుతూ పరుగులు తీశాయే దాన్ని చూశానే, మీరు చూళ్ళేదా..."

హెన్రీ చెప్పిన జవాబు దేవరాజులుకు ఎంతగానో నచ్చింది. అతణ్ణి చూసి ఓ చిర్నవ్వుతో తన అభినందనలను తెలుపుతూ షర్ట్ జేబులో నుండి సిగరెట్ ప్యాకెట్ తీసి అతడి ముందుకు చాపాడు దేవరాజులు.

"నో... థ్యాంక్స్ నేను స్మోక్ చెయ్యను" అన్నాడు హెన్రీ. దేవరాజులు సిగరెట్ వెలి గించాడు. కాసేపటి వరకూ వాళ్ళెవరూ ఏమీ మాట్లాడుకోలేదు. లారీ పల్లంలో వేగంగా దూసుకెళ్ళసాగింది.

"అదిగో కనిపిస్తోంది చూడండీ, అదే కృష్ణ రాజపురం" అని దేవరాజులు, గోధూళి వేళలో కనువిందు చేస్తున్న ఓ పల్లెను హెన్రీకి చూపించాడు.

"ఇంకా ఎంతదూరం ఉంటుందండీ? " అని దూరాన ఉన్న ఆ పల్లె అందాన్ని చూస్తూ అడిగాడు హెన్రీ.

"ఫోర్ మైల్స్" దేవరాజులు చెప్పిన మాటను ఖండిస్తూ తనకూ ఇంగ్లిష్ వచ్చని తెలిపే ధోరణిలో చెప్పాడు దొరస్వామి.

"నో, నో త్రీ మైల్స్"

పాండుకు దొరస్వామి చెప్పిన సమాధానం ఎంతో సంతోషాన్ని కలిగించింది.

## 2

దేవరాజులు, హెన్రీ ఇద్దరే కృష్ణరాజపు రంలో దిగారు. వాళ్ళిద్దరూ కలిసే వస్తున్నట్టు, ఒకరినొకరు అంతకు మునుపే పరిచయం ఉన్నవాళ్ళగానూ ఆ ఊరి వాసులకు అగుపిం చారు. పాండు లారీలోనుండి హెన్రీ బ్యాగు ను ఇవ్వగా దేవరాజులు కింద నుండి దాన్ని అందుకున్నాడు. హెన్రీ పాండుకు ఐదు రూపాయల నోటు ఇచ్చాడు. పాండు మిగతా చిల్లర చొక్కా జేబులో నుండి తీసి హెన్రీకి ఇవ్వబోయాడు.

హెన్రీ చిర్నవ్వుతో, "నువ్వే ఉంచుకోవయ్యా" అన్నాడు. పాండు వెనుకాడుతూ "వద్దు సార్, బస్సు చార్జి కన్న ఎక్కువ తీసుకుంటే అన్న తిడతాడు" అని వివరించాడు. హెన్రీ దాన్ని చెవిలో వేసుకోకుండా కిందకు దించి పెట్టిన బ్యాగును తీసుకోబోయాడు.

నలుగురిలో ఒకణ్ణి పిలిచాడు దేవరాజులు.

"ఏంటయ్యా పిలిచారా?" అని వాళ్ళలో ఒకడు ప్రశ్నించాడు.

"ఎవడైనా ఒకడు ఇలా రండ్రా... రేయ్ చిన్నప్పా, నువ్వే రారా" అనగానే వాడు పరుగెత్తుకుని వచ్చాడు.



"ఉండనివ్వండి సార్. ఇక్కడ మనవాళ్ళెవరైనా ఉంటారు" అంటూ తల తిప్పి ఎవరికోసమో వెదికి, "రేయ్... ఇలా రారా" అంటూ ద్రౌపదమ్మ గుడి ముందుభాగంలో నిలబడి మాట్లాడుకుంటున్న

దొరస్వామి లారీని ఆపి ఎక్కడికో వెళ్ళాడు. అతనితో చెప్పి వెళదామని అనుకున్న హెన్రీ, ఖాళీగా ఉన్న డ్రైవర్ సీటును చూసి అతడి కోసం నలువైపులా చూశాడు.

దొరస్వామి, ద్రౌపదమ్మ గుడి వెనకున్న పొలాల్లోకి వెళుతుండటం గమనించి పాండు వైపుకు తిరిగి "డ్రైవర్‌తో చెప్పేయ్" అన్నాడు.

"అలాగేనండి" అని మర్యాదపూర్వకంగా హెన్రీకి సలాం చేశాడు పాండు.

"అతనూ మన ఊరివాడే. ఇప్పుడు కుమారపురానికి అత్తగారింటికే వెళ్ళిపోయాడు. పొలం పుట్రా అన్నీ ఇక్కడే



ఉన్నాయి" అని దొరస్వామి గురించి హెన్రీతో చెప్పాడు చిన్నప్ప.

చిన్నప్ప సంబంధం లేకుండా అనవసరంగా హెన్రీతో మాట్లాడ్డం ఇష్టంలేని దేవరాజులు ముఖం చిట్లించాడు.

చిన్నప్ప బ్యాగును ఎత్తుకొని "మన ఇంటి కేనాండీ? " అని అడగ్గా, హెన్రీ, దేవరాజులు ఒకే ఆలోచనతో ఒకరినొకరు చూసుకున్నారు.

"ముందు గ్రామ మున్సిఫ్‌ను కలవాలి. ఆయన దగ్గరకు తీసికెళతానన్నారుగా" ఇంగ్లీష్‌లో అన్నాడు హెన్రీ.

దేవరాజులు చేతి గడియారంకేసి చూశాడు. ఆరున్నర అయింది. కాసేపట్లో పూర్తిగా చీకటి పడిపోతుంది. ఈ సమయంలో వెళ్ళి మున్సిఫ్‌ను చూడ్డం అంత ఉచితం కాదని భావించాడు. ఈ సమయంలో . ఆయన ఇంట్లో ఉండడని కూడా గ్రహించాడు.

కనుక అతణ్ణి తనతోపాటు ఇంటికి తీసుకెళ్ళటం, ఈ రాత్రి తన ఇంట్లోనే ఉండనివ్వటం, అతనితో మాట్లాడుతూ గడపటం, దాని మూలంగా అతను ఎవరైనదీ తెలుసుకోవటం, రేపు సెలవుదినం కాబట్టి అతనితో తానూ మున్సిఫ్ ఇంటికి వెళ్ళి తన చేతనైన సాయం చెయ్యటం- ఉచితం అని మనస్సులోనే నిర్ణయించుకున్నాడు దేవరాజులు.

అయితే తన నిర్ణయాన్ని హెన్రీతో చెప్పటా

పల్లెలోని దుకాణాల యజమానులు, వీధిలో తిరుగుతున్న జనాలూ ఆ కొత్తవ్యక్తిని పరిశీలనగా చూశారు. అతడు దేవరాజులుతో ఉన్నందువల్ల ఎవరూ అతణ్ణి ఎలాంటి ప్రశ్నలూ అడగలేదు

నికి కాస్త జంకాడు.

"మున్సిఫ్ ఇల్లు మన ఇంటికి వెళ్ళే దార్లోనే ఉంది. ఒకే వీధిలోనే మేం ఉంటున్నాం. వెళ్ళేటప్పుడు వాకబు చేద్దాం. ఇప్పుడు ఆయన ఇంట్లో ఉండడని అనుకుంటున్నాను. ఆయన లేకుంటే మీరు నాతో మా ఇంట్లోనే ఉండొచ్చు. రేపు ఆయనను కలవటానికి ఏర్పాటు చేస్తాను" అని దేవరాజులు అంటూ ఉండగానే మధ్యలోనే అడ్డుపడి రెండు మూడు సార్లు "థ్యాంక్‌యూ", థ్యాంక్ యూ" అని కృతజ్ఞతలు తెలిపాడు హెన్రీ.

చిన్నప్ప హెన్రీ బ్యాగును తలపై పెట్టుకుని, వీళ్ళకోసం ఎదురుచూడకుండా దేవరాజులు ఇంటికేసి నడవసాగాడు.

హెన్రీ ఏదో మ్యూజియంలోనో... ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లోనో నడుస్తున్నట్టు రెండు దిశలా మార్చి మార్చి చూస్తూ ఆగి ఆగి నడవసాగాడు. పల్లెలోని దుకాణాల యజమానులు, వీధిలో తిరుగుతున్న జనాలూ ఆ కొత్తవ్యక్తిని పరిశీలనగా చూశారు. అతడు దేవరాజులుతో ఉన్నందువల్ల ఎవరూ అతణ్ణి ఎలాంటి ప్రశ్నలూ అడగలేదు. అతడు దేవరాజులుకు చుట్టం అనో, స్నేహితుడనో వాళ్ళుగా ఓ నిర్ణయానికి వచ్చేశారు. కానీ ఆ పల్లెలోని పసిపిల్లలు హెన్రీ వాలకాన్నీ, అతడి మాటల ధోరణినీ వింతగా చూస్తూ వాళ్ళ వెనుకే గుంపుగా, తమలో తాము రహస్యంగా ఏదో మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ అనుసరించసాగారు. వాళ్ళలో కాస్త పెద్దవాడిగా కనిపిస్తున్న పిల్లాడొకడు ధైర్యంగా హెన్రీ సమీపానికి వచ్చి మర్యాదపూర్వకంగా అతడి చేతిలోని లెదర్ సూట్‌కేసును పట్టుకుని "నేను పట్టుకొస్తాను సార్" అని అర్థించాడు. హెన్రీ అతడి బుగ్గపై ప్రేమగా తట్టి "నో థ్యాంక్స్" అనటం ఆ పిల్లాడికి ఎంతో గర్వాన్నిచ్చింది.

హెన్రీ మళ్ళీ ఆ ఊరిని వింతగా చూస్తూ నడవసాగాడు.

వాళ్ళముందు ఓ ఊరకుక్క పైలట్‌లాగా పరుగెడుతూ... వెనక్కు తిరిగి చూస్తూ... మొరగసాగింది. వాళ్ళు దాన్ని సమీపించేంతలో అది ఇంకాస్త దూరం వెళ్ళి నిలబడి మళ్ళీ వీళ్ళను చూస్తూ మొరగసాగింది.

ద్రౌపదమ్మ గుడికి వెనకున్న కోనేటి కుడిపక్కనుండి ఊరి ప్రధాన భాగం మొదలౌతుంది. ఆ ఊరికి చాలా ముఖ్యమైన వాళ్ళు లేదా ముఖ్యమైనవాళ్ళుగా గతంలో ఉన్నవాళ్ళ సంతతి- ఆ ఊరి పూర్వీకమైన ఇండ్లలో అక్కడే జీవిస్తున్నారు.

"నేను చూసే మొదటి విలేజ్ ఇదే, తెలుసా? నేను బెంగుళూరు వదిలి ఎక్కడికీ వెళ్ళింది లేదు" హెన్రీ దేవరాజులుతో చెప్పాడు.

అతడు ఏదైనా వ్యాపారం చేస్తున్నాడా, లేక ఎక్కడైనా ఉద్యోగం చేస్తున్నాడా అని తెలుసుకోవటానికి చాలా నాజూకుగా "వాట్ ఆర్ యూ? " అని ప్రశ్నించాడు దేవరాజులు.

"అయాం హెన్రీ". ఎన్నిసార్లు చెప్పాలి అన్నట్టు చూశాడు హెన్రీ. దేవరాజులు నవ్వుతూ "నో, నో, మీరు బెంగుళూర్లో ఏం పనిచేస్తున్నారని అడిగాను" అని వివరించాడు.

"నథింగ్! నాకు పనేం లేదు... ఇకమీదటే ఏదైనా చెయ్యాలి. పనిచేసే తినాలి. అందుకే ఇక్కడికి వచ్చాను. దాని గురించి తర్వాత చెబుతాను. ముందు మున్సిఫ్‌ను కలవాలి"

వాళ్ళను వెంబడించి వచ్చిన పిల్లలు వాళ్ళవాళ్ళ ఇళ్లు వచ్చేసరికి ఒక్కరొక్కరూ తప్పుకోగా ఆ పెద్ద పిల్లాడు మాత్రం వాళ్ళతో వస్తున్నాడు. వాళ్ళు ఇంగ్లిషులో మాట్లాడుకుంటున్నప్పుడు విన్న 'మున్సిఫ్' అన్న మాటను మాత్రం ఆ పిల్లాడు అర్థం చేసుకున్నాడు. కొత్తగా వెల్లవేసిన ఓ పెంకుటింటి సమీ

పంలోకి వచ్చినపుడు ఆ పిల్లాడు హెన్రీతో మాట్లాడాలన్న ఉత్సాహంతో చెప్పాడు, "ఇదే నండి గుర్నాథం నాయుడుగారి ఇల్లు".

దేవరాజులు ఆ పిల్లాడు వైపుకు తిరిగి "నాయుడు ఉన్నారేమో వెళ్ళి చూడు" అని చెప్పి ఆ ఇంటికెదురుగా వీధిలో నిలబడ్డారు.

వాళ్ళకన్నా ముందు వెళుతున్న చిన్నప్ప బ్యాగుతో సహా ఆ వీధి చివర్లో ఉన్న ఓ ఇంట్లోకి దూరటం గమనించిన హెన్రీ, అదే దేవరాజులు ఇల్లుగా అర్థం చేసుకున్నాడు.

"నాయుడుగారు లేరంట; కుమారపురం వెళ్ళారంట" అంటూ ఆ పిల్లాడు పరుగెత్తు కుని వచ్చి చెప్పాడు.

దేవరాజులు ఇంట్లోకి వెళ్ళేముందు వీధి దీపాలు వెలిగాయి. యాంత్రికంగా హెన్రీ వెనక్కు తిరిగినపుడు వీధి దీపాల వెలుగులో తాళం వేసున్న ఓ ఇల్లు అతడి కంటబడింది.

చాలాకాలం నుండి తుప్పు పట్టినట్టున్న ఆ తాళాన్ని చూసి, అతడు 'ఓ! ఈ ఇల్లే కాబోలు' - అనుకోగానే అతడి గుండె వేగంగా కొట్టు కుంది.

ఇంటి అరుగుమీద దుమ్మూ ధూళీ పరుచు కొని విరిగి కిందపడి ఉన్న పెంకులు తోక ముడుచుకొని పడుకున్న ఓ కుక్కా...

ముప్పైరెండేళ్ళ క్రితం తాళం వేయబడి ఇప్పటి వరకు తలుపులు తెరవబడని ఆ ఇంటి కథలు, అతడికి చెప్పబడ్డ సంఘటనలు మనసు విప్పి చెప్పిన గొంతూ... గుర్తు కొచ్చి.. అతడి కళ్ళు చెమర్చాయి.

"పప్పా!" అని పెదాలు పలుకగా, ఆ ఇంటిని అతడు పారవశ్యంతో చూస్తూ అలాగే నిలబడ్డాడు.

హెన్రీ చెయ్యి అతడి పైజామా చొక్కా జేబులో ఉన్న ఆ ఇంటి తాళం చెవిని వెదికి పట్టుకుంది.

దేవరాజులుకు అతడి చూపులో కొత్తద నమో, ప్రత్యేకమైన భావమో ఏదీ కనిపించ లేదు. అతడు అన్నింటినీ అలాగే కదూ చూస్తున్నాడు? !

"ప్లీజ్ కమిన్" అని తన ఇంట్లోకి హెన్రీని ఆహ్వానించాడు దేవరాజులు.

హెన్రీ, దేవరాజులు ఇంట్లోకి అడుగు పెట్టి నపుడు బ్యాగును ఇంట్లో పెట్టి చిన్నప్ప బయ టికి వచ్చాడు. వాణ్ణి చూసి హెన్రీ, చొక్కా జేబులో నుండి పర్సు తీసి డబ్బివ్వబోయాడు.

"అయ్యయ్యో... డబ్బా... వద్దండీ? " అంటూ దూరంగా వెళ్ళిపోయాడు చిన్నప్ప.

వాడి చర్య అర్థంకాక, హెన్రీ ఓ నిమిషం వెనకాడి ఏదో అర్థం చేసుకుని చిర్నవ్వుతో- 'థ్యాంక్ యూ" అంటూ పర్సును జేబులో పెట్టుకున్నాడు.

"అక్కమ్మా! మేడగది తాళం వేసుంటే తీయించు" అని తమిళంలో గట్టిగా అరిచాడు దేవరాజులు. అటునుండి సమాధానం రాకపో యేసరికి "నువ్వు మేడమీదకి బ్యాగును పట్టు కెళ్ళు. నేను తాళంచెవి తీసుకొస్తాను" అని చిన్నప్పతో చెప్పి పెరడుకేసి దారితీశాడు దేవ రాజులు.

ఆ ఊరిని, వీధిని ఎలా చూశాడో అదే అబ్బురంతో హెన్రీ ఆ ఇంటినీ చూశాడు. అలాంటి ఇంటిని అతడు అంతకు మునుపు ఎన్నడూ చూడలేదని అతడి చూపుల ద్వారా తెలుస్తోంది.

హెన్రీ నిలబడ్డ ద్వారానికి ఆనుకుని గోడ పక్కగా ఓ మూలగా నులక మంచంపైన పరచిన చాపపైన ఓ పండు ముదుసలి వ్యక్తి కాళ్ళు ముడుచుకుని పడుకుని ఉన్నాడు. ఆయన అంతకు మునుపే వీధిలో కుక్క మొరగటంతో మేలుకున్నాడు.

దేవరాజులు హెన్రీని మేడమీదకి తీసుకెళ్ళ టానికి వచ్చినపుడు వెనకున్న పెరటి ద్వారం గుండా అక్కమ్మ లోనికి వచ్చింది. ఆమె పద హారేళ్ళ వయస్సులోనే విధవరాలయింది. ఇప్పుడు వయస్సు నలభై ఉంటుంది. ఆమె ముఖంలో ఆకర్షించే యవ్వనం అణిగిపోయి మిణుకుమిణుకుమంటోంది. శుభ్రమైన తెల్లచీ రను ఆమె కట్టిన తీరు లోపల ఆమె రవికె వేసుకుందో, లేదో తెలియని రీతిలో వుంది.

ఒంటిమీద ఒక్క బంగారు అభరణమూ లేదు. ఆమె వెంట్రుకలూ, కనులూ మాత్రమే పెట్టని అలంకారంలా ఉన్నాయి.

ఎవరో చుట్టం వచ్చినట్టు దేవరాజులు తాళం చెవి అడిగినప్పుడే అర్థం చేసుకుంది అక్కమ్మ. అయితే వచ్చిన మనిషి ఇలా పర దేశిలా ఉంటాడని అనుకోలేదు. ఇలాంటి ఓ మనిషిని ఆమె అంతకు మునుపు చూసింది లేదు. ఆమె ఆ గ్రామాన్ని వదిలి మరెక్కడికీ వెళ్ళిందీ లేదు.

"ఇవనదు ఊరు బెంగుళూరు" అని మొదలు పెట్టి "మన గ్రామ మున్సిఫ్‌తో ఏదో పనిబడి వచ్చి, వచ్చేదారిలోనే నాకు స్నేహితు డయ్యాడు." అని తెలుగులో చెప్పిన దేవరా జులు హెన్రీతో "దిసీజ్ మై సిస్టర్... అక్కమ్మ" అంటూ మొదలుపెట్టి "నాకు తల్లి దండ్రులెవరో తెలియదు. నాకు అక్కయినా, అమ్మయినా ఆమే కనుక నేను "అక్కమ్మా" అని పిలవటంతో ఈ ఊరికే ఇప్పుడు ఆమె అక్కమ్మ అయిపోయారు" అని ఇంగ్లీషు లోనూ, తెలుగులోనూ వివరించి చెప్పాడు.

"తల్లిదండ్రులెవరో తెలియదు" అని దేవరా జులు చెప్పినపుడు హెన్రీ తన కనుబొమ్మల్ని పైకి లేపుతూ నవ్వటానికి ప్రయత్నించి అత డిని ఆప్యాయంగా చూశాడు. తర్వాత అక్క మ్మకు చేతులు జోడించి నమస్కరించాడు. బదులుగా తానూ నమస్కరించాలన్న మర్యా ద తెలియని అక్కమ్మ "ఉండనీ, ఉండనీ" అని అతణ్ణి వారిస్తున్నట్లు అంది. అంతేకాక అతడికి తనకన్నా వయస్సు ఎక్కువా, తక్కువా అని ఆమె అంచనా వేయలేకపో యింది. తన తమ్ముడి స్నేహితుడైనందువల్ల తమ్ముడిలాగానే అతణ్ణీ భావించాలి అన్న ఆలోచనతో, చిన్నవాళ్ళు నమస్కరిస్తే పెద్ద వాళ్ళు ఆశీర్వదించాలి అనుకుని "ఉండనీ" అని ఆశీర్వదించేలా ఆమె అభినయించింది. ఆమె కాస్త పక్కకు తప్పుకుని- 'దేవూ, కాఫీ ఏమైనా కావాలా? మేడ మీదకు పంపనా? " అని తమ్ముడిని అడిగింది.

"హౌ అబవుట్ సమ్ కాఫీ..." అని అడి గాడు దేవరాజులు.

"గుడ్ ఐడియా" అన్నాడు హెన్రీ.

వాళ్ళు మేడ మీదకు వెళుతుండగా ఒడ్లను పాదాలతో తోస్తున్న అక్కమ్మ "దేవూ, తర్వాత ఓ మారు వచ్చిపో" అని చెప్పింది. దేవరాజు లుకు అక్కమ్మ ఎందుకు పిలుస్తున్నదో అర్థ మైంది. వచ్చిన చుట్టానికి రాత్రి భోజనం విష యమై ఏం చెయ్యాలో అంది.

ఆ ఇంటికి పక్కగా మేడ మెట్లున్నాయి. దేవరాజులు ముందు హెన్రీ అతడి వెనుకగా పైకి వెళుతుండగా బ్యాగు మేడమీద పెట్టి వస్తున్న చిన్నప్ప ఎదురుపడ్డాడు. వీళ్ళు రావ టం గమనించి మళ్ళీ వెనక్కెళ్ళి మేడ మీది గది ముందు ఒక పక్కగా నిలబడ్డాడు.

"ప్లీజ్ కమిన్" అని హెన్రీని గదిలోకి ఆహ్వానించి దేవరాజులు చిన్నప్ప వద్దకు వెళ్ళి "అక్కమ్మను కోడి కోయమంటుందేమో అడిగి కొయ్యమంటే, నువ్వే కోసిచ్చేసి వెళ్ళు" అని చెప్పి హెన్రీని చూశాక ఓ సందేహం ఫ్లాష్ లాగా వెలిగింది. "మాంసాహారం మీరు తింటారనుకుంటాను" అని ఇంగ్లీష్‌లో అడి గాడు.

హెన్రీ కనుబొమ్మలు ముడివేసి! "ఐ డోంట్ మైండ్! కానీ అది అవసరం లేదు... ఆకలికి తినాలి అంతే! నేను మనుషులు తినే వస్తువులన్నీ తింటాను. అయితే ఇప్పుడు రెండు రోజులుగా పండ్లు మాత్రమే తింటు న్నాను. ఇప్పుడు వస్తున్నప్పుడు ఆ ఊళ్ళో- లారీలన్నీ ఆగుతాయే అక్కడ- టీ తాగాను. అదీ రెండు రోజుల తర్వాత" అని చెబుతూ ఆ గదిని పరిశీలనగా చూశాడు హెన్రీ. చిన్నప్ప కిందకు వెళ్ళాడు.

పాతకాలంనాటి నులకమంచం, ఓ చిన్న రేడియో, టేబుల్ ఫ్యాన్, గోడకు వేలాడు తున్న బ్యాడ్మింటన్ రాకెట్, హేంగర్‌కు తగిలించబడ్డ చొక్కాలు, పుస్తకాలతో నిండిన ఆల్మైరా, ఓ టేబుల్ దాని ముందు కుర్చీ..

ఆ గది శుభ్రంగానూ, అందంగానూ

ఉంది. దేవరాజులు అక్కడున్న టేబుల్ ఫ్యాన్‌ను ఆన్ చేశాడు. మడిచి పెట్టున్న ఓ ఈజీ చెయిర్‌ను విడదీసి వేసి కాన్వాస్‌ను దులిపి హెన్రీని కూర్చోమని చెప్పాడు. చేతిలో ఉన్న లెదర్ సూట్‌కేస్‌ను దేవరాజులు చేతికి ఇచ్చి హెన్రీ అందులో కూర్చొని ఎదురుగా గోడకు వేలాడుతున్న ఫొటోను చూశాడు. అది దేవరాజులు, అతడి భార్య కనక మహాలక్ష్మి పూలమాలతో నిలబడున్న పెళ్లి ఫొటో! హెన్రీ ఆ ఫొటోను గమనించటం చూసి దేవరాజులు దాన్ని అందుకొని చేత్తో తుడిచి అతడికి చూపించాడు. "నా భార్య! ఇప్పుడు ఇక్కడ లేదు. ఆమె పుట్టింట్లో ఉంది" అన్న అతడి మాటల్లో ధ్వనించిన బాధ, తపన హెన్రీకి అర్థం కాలేదు.

చిర్నవ్వు చిందిస్తూ అతడే లేచి ఫొటోను గోడకు తగిలించాడు. "నో కిడ్స్? " అని ప్రశ్నించి ఓ పసిపాపాయిలా అందంగా నవ్వాడు హెన్రీ.

"నో" అని చెప్పిన దేవరాజులు "నిరుడే మాకు పెళ్లి అయింది..." అని ఏదో చెప్పాలనుకొని మళ్ళీ అక్కడితో ఆగిపోయాడు.

దేవరాజులు బట్టలు మార్చుకున్నాడు. "మీరు కూడా కావాలంటే డ్రెస్ చేంజ్ చేసుకోవచ్చుగా" అన్నాడు హెన్రీతో.

"స్నానం చేస్తే బావుణ్ణు" అని కాస్త పైకే అన్నాడు హెన్రీ.

"వేణ్ణీళ్ళు పెట్టమని చెప్పనా? " అంటూ వెనుతిరిగాడు దేవరాజులు.

"నో-ప్లీజ్, ఐ ప్రిఫర్ కోల్డ్ వాటర్" అంటూ జలకాలాడే అనుభవం కోసం తహతహలాడాడు హెన్రీ.

చిన్నప్ప ఓ ఇత్తడి చెంబులో కాఫీ, రెండు పెద్ద గ్లాసులు పట్టుకొచ్చి దాన్నిండుగా కాఫీ పోసి మొదట హెన్రీకి ఇచ్చాడు. తర్వాత దేవరాజులుకు ఇచ్చాడు. కాఫీ కాస్త తియ్యగా అనిపించింది. దాహానికి బాగా అనువుగా ఉన్నట్టు అనిపించింది. హెన్రీ కాఫీ చప్పరిస్తూ దేవరాజులును చూసి



# చిలకమర్తి జోకులు



ప్రసిద్ధ కవి, రచయిత అయిన చిలకమర్తి లక్ష్మీనరసింహం హాస్యచతురతలో అఖండులు. 'గణపతి' నవల చదివితే ఇప్పటికీ పొట్టచెక్కలవడం ఖాయం. భాషతో తమాషాలు ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. అలాగే అలనాటి బ్రాహ్మణ సంప్రదాయాలపైనా చెణుకులు విసిరేవారు. ఆయన చతురవ్యాఖ్యలు.. జోకులలో కొన్నింటికి కొత్త ముస్తాబులు వేసి ఈ నెల చతుర పాఠకులకు అందిస్తున్నాం...

## అభిప్రాయభేదాలు

పిచ్చాసుపత్రిలో తన స్నేహితుడ్ని చేర్పించారన్న విషయం తెలుసుకుని అతని స్నేహితుడు హుటాహుటిన అక్కడికి చేరుకున్నాడు. తన మిత్రుడిని కలిసి,




'ఏమైందిరా నీకు ? మీవాళ్లు ఇక్కడెందుకు చేర్చారు? ' అని అడిగాడు ఆందోళనగా.

'ఏం లేదు! మా మధ్య కొద్దిపాటి అభిప్రాయ భేదాలు వచ్చాయి.. అంతే! అన్యాయంగా తీసుకొచ్చి ఇక్కడ పడేశారు.. ఏంచేస్తాం? ' నిరాశగా జవాబిచ్చాడతను.

'అభిప్రాయభేదాలున్నంత మాత్రాన మరీ ఇంత అన్యాయమా? అయినా ఇంతకీ ఏమిటవి? ' అడిగాడు మిత్రుడు సానుభూతిగా.

'ఏముంది? సూర్యుడు రాత్రివేళ ఉదయిస్తాడన్నాను నేను. కాదు.. పగలంటారు వాళ్లు. నిప్పు చల్లగా ఉంటుందంటాను నేను.. కాదు కాదు వేడిగా ఉంటుందటారు వాళ్లు.. ఇలాంటివే!'అంటూ కన్నీరు పెట్టాడతను.

? ? ?

అభిమానంతోనూ, కృతజ్ఞతతోనూ పదేపదే చిర్నవ్వులు చిందించాడు.

"చన్నీళ్ళతో స్నానం చెయ్యాలంటే తోటకె ళదాం. అక్కడ మోటర్ ఉంది. కావాలంటే పంప్ వేసుకుని స్నానం చేద్దాం. పెద్దబావి, మెట్లున్నాయి. బావిలోకి దిగి ఈదులాడ వచ్చు" అని అతడికి ఆశలు కల్పించేలా అన్నాడు దేవరాజులు.

"ఓహ్!... ఐ లవ్ ఇట్..." అంటూ ఓ చంటి పిల్లాడిలా తన రెండు చేతుల్నీ చరచి ఈజీ ఛెయిర్లోంచి లేచి నిలబడ్డాడు హెన్రీ.

దేవరాజులు టవలూ, సబ్బూ పట్టుకుని బయలుదేరాడు. హెన్రీ తన బ్యాగును విప్పి ఓ టవల్‌ను మాత్రం తీసుకున్నాడు.

బయట చీకటి బాగా అలుముకుంది. వెన్నె లకాంతి పరుచుకుంది. మేడముందు భాగం లోకి వచ్చి నిలబడి ఆ ఊరిని, వీధినీ, వెన్నెల వెలుగులో చూశాడు హెన్రీ. వీధిలో పిల్లలు ఆడుకుంటూ కనిపించారు.

ఎదురింటి ముందరున్న టెలిఫోన్ స్తంభా నికి ముఖం దాచుకొని ఓ కుర్రాడు "దాగుడు మూతల దండాకోర్... రావచ్చా.. రావ చ్చా.." ఓ పాటలా పాడుతూ అన్నాడు. హెన్రీ ఆ రాగంలోని మెలోడీని ఆస్వాదిం చాడు. అతడు తనలో అనుకున్నాడు "దాగు డుమూతల దండాకోర్..."

ఆ టెలిఫోన్ స్తంభానికి ఎదురుగా తాళం వేసిన ఆ ఇల్లు కనిపించింది. దాన్నే చూస్తూ మిగతావాటినంతా మరిచిపోయి ఆ ఇంటికి సంబంధించిన కథల్నీ, దృశ్యాలనూ, వాటిని వివరించిన గొంతునీ అతడు స్ఫురణకు తెచ్చు కొని మైమరచిపోతుండగా అతడి వెనుక దేవ రాజులు వచ్చి నిలబడి ఆ వీధిని చూశాడు.

"ఆ మూతబడి ఉన్న ఇంటి గురించి మీకే మైనా తెలుసా? " అని హెన్రీ అడిగాడు.

దేవరాజులు ఓ క్షణం ఆలోచించాడు. అతడు అడిగిన విధానంలోనే 'అతడికి ఏదో తెలిసినట్టే ఉంది' అని అనిపించింది దేవరా జులుకు. ఆ ప్రశ్నతో దేవరాజులు మన స్సులో- ఎదుట నిలబడ్డ హెన్రీ ఓ మర్మమైన మనిషి లాగానూ, ఆశ్చర్యకరమైన కథల్ని తనలో దాచుకున్నవాడిలాగానూ అనిపించి, అతడి గురించి తెలుసుకోవాలన్న కోరిక బల పడసాగింది. దాన్ని బయటకు తెలియనీయ కుండా, "నాకు బుద్ధి తెలిసినప్పటి నుంచి ఆ ఇల్లు మూతబడే ఉంది" అన్న దేవరాజులు ఆ ఇంటిని గురించి మొదటిసారిగా ఆలోచనలో పడ్డాడు. అతడికే అది ఆశ్చర్యంగా అనిపిం చింది. అక్కడే పుట్టీ, పెరిగీ ఎన్నోమార్లు ఆ ఇంటి అరుగుమీదా, వెనుక పాడుపడ్డ మొండి గోడల మధ్యా ఆడుతూపాడుతూ తిరిగిన తనకు ఆ ఇంటిని గురించీ, దాని పూర్వాప రాల గురించిన భావన ఏర్పడక పోవటం ఆశ్చర్యంగా అనిపించింది.

"సమ్ వన్ మస్ట్ హేవ్ లాక్ దిస్ హౌజ్... కదూ? "

"యస్? " అన్నాడు. అతడికి చిన్ననాటి సంఘటనొకటి గుర్తుకొచ్చింది.

పల్లె మంగలి ఒకడు పిచ్చిపట్టి తిరుగుతుం డేవాడు. అతడు ఎప్పుడూ మూతబడున్న ఆ ఇంటి అరుగుమీద కూర్చుని, పడుకుని కనిపిం చేవాడు. దేవరాజులుకు అప్పుడు అతణ్ణి చూస్తే ఎందుకో భయం! ఆ పిచ్చివాడు ఒక రోజు ఆ ఇంటి అరుగుపైనున్న దూలానికి ఉరివేసుకుని చచ్చిపోయాడు.

ఆ రోజంతా- దాన్ని చూస్తే భయపడతా డని దేవరాజులును బయటకు పంపకుండా తన కనుసన్నలలోనే దాచుకుంది అక్కమ్మ. ఆ సంగతే చెప్పాడు హెన్రీకి.

"నాయిబ్రాహ్మిణ్- మీన్స్ బార్బరే కదా? " అని తనకు తెలిసిన విషయాన్ని దేవరాజు లును అడిగాడు.

"అవును, అతడు ఆ ఇంటి అరుగు మీదే పడుండే వాడు... కొంచెం పిచ్చి"

"హు ఈజ్ నాట్ కొంచెం పిచ్చి"... అంటూ చిర్నవ్వు నవ్వాడు హెన్రీ.

"అతడికి నిజంగానే పిచ్చి" అని దేవరా జులు చెప్పగా దాన్ని అంగీకరించినట్టు

నవ్వుతూ అతణ్ణి నిశితంగా చూశాడు హెన్రీ.

"ఆ ఇంటి అరుగు మీదే పైకప్పుకు ఉరివే సుకుని చనిపోయాడు"

"మైగాడ్ అతడు చనిపోయాడా? " అని కనుబొమలు పైకి లేపాడు హెన్రీ.

"డు యు నో హిమ్"?

"విన్నాను. అతడి పేరు గోయిందు కదూ? " అని ఏదో ఆలోచిస్తూ దేవరాజు లును చూడకుండానే అన్నాడు హెన్రీ.

దేవరాజులుకు అతడి పేరేమిటో తెలి యదు. అయినా అతడు చెప్పినప్పుడు 'ఉండొ చ్చు' అనిపించింది. "నాకు సరిగ్గా గుర్తు లేదు" అని దేవరాజులు ఒప్పుకున్నాడు.

"యస్, హి ఈజ్ గోయిందు" అన్నాడు హెన్రీ. 'తర్వాత అక్కమ్మను అడగొచ్చులే'... అని అనుకున్నాడు దేవరాజులు.

"సరే రండి... స్నానానికి వెళదాం" అని ఇద్దరూ బయలుదేరారు.



పెరడు తలుపు తీసుకొని దేవరాజులు ముందు దారి తీయగా హెన్రీ అతణ్ణి అనుస రించాడు.

పంట పొలాల్లో ఉన్న దిగుడు బావి వద్దకు చేరారు. హెన్రీ బట్టలు విప్పేసి నగ్నంగా బావిలోకి దూకి స్నానం చేశాడు. దేవరాజులు మెట్లు మీదుగా దిగి అతడితో జత కలిశాడు- వీళ్ల తీరు అంతేనేమో అనుకుంటూ.

స్నానం చేస్తూనే "I am very grateful to you" అని కృతజ్ఞతలు తెలిపాడు హెన్రీ. "మనం కలిసి ఇప్పటికి మూడు గంటలు కూడా కాలేదు కదూ?... ఇద్దరు ఫ్రెండ్స్ కావటానికి ఎక్కువ సాన్నిహిత్యం అక్కర లేదు... ఇట్ రిక్వయర్స్ సమ్ సార్ట్ ఆఫ్ కాన్ఫిడెన్స్ ఇన్ ఈచ్ అదర్..."

"ఆ నమ్మకం మీకు నాపైన ఉందా? " అని అడిగాడు దేవరాజులు.

"అఫ్‌కోర్స్..." అని నీటి పైభాగాన చెయ్యి చాపి అతడి చేతిని అందుకొని హెన్రీ ఇంగ్లి ష్‌లో అన్నాడు. "ఈ ఊరికి వస్తున్నప్పుడే దేవుడు ఓ మంచి మిత్రుడి ద్వారా నన్ను ఆశీ ర్వదించాడు"

"మీకు దేవుడి మీద నమ్మకం ఉందా? "

"ఉంది... నాపైన తప్ప అన్నింటిపైనా నాకు నమ్మకముంది"

"వాటు డు యు మీన్..."

"ఐ మీన్... దేవుణ్ణి నమ్మటానికీ, నమ్మక పోవటానికీ 'నేనెవరు' అన్నదే నాకు తెలి యటం లేదు. 'భగవంతుడు' అన్నది మన నమ్మకం మాత్రమేనా? నాకూ నా నమ్మకా లకూ ఏమిటి సంబంధం? ఈ జీవితం తప్ప, అదీ నాకు తెలిసిన ఏ కాస్తో తప్ప, నాకేమీ తెలియదే... తెలియటానికీ అవకాశం లేదే... మై పప్పా యూజ్డ్ టు సే 'కన్నా'. హి యూ జ్డ్ టు కాల్ మీ లైక్ దట్...! ఆయనకు కొంచెం కూడా ఇంగ్లిష్ తెలియదు. ఇంగ్లిష్ వాజ్ మై మదర్‌టంగ్. మా అమ్మ ఆంగ్లో ఇండియన్- మై పప్పా- 'కన్నా' అని అచ్చమైన తెలుగులో పిలిచేవాడు నన్ను... నేను 'పప్పా' అని ఆయనను పిలిచేవాణ్ణి. ఆయన అనే వారు 'జీవితంలో నువ్వు నెరవేర్చవలసిన ధర్మం- ధర్మం- ఆయన పదే పదే ఆ మాట ను అనేవారు ఒకటే ఒకటుంది. ఏమిటో తెలుసా? 'ఎప్పుడూ సంతోషంగా ఉండు- అంతేరా కన్నా' అని చెప్పేవారు, నేనెప్పుడూ సంతోషంగానే ఉన్నాను"

"వాట్ వాజ్ హి? !"

"హు? "

"యువర్ ఫాదర్!"

"ఆయన రైల్వేలో ఫోర్‌మేన్‌గా ఉండే వాడు... హి వజ్ నాట్ జస్ట్ మై ఫాదర్ - సంథింగ్ మోర్ దేన్ థట్... అయినా

ఆయన నా కన్నతండ్రి కారు. అండ్ ఆల్సో మై మదర్ - మా అమ్మ కూడా నా కన్నతల్లి కాదు... అండ్... దే వర్ నాట్ హజ్‌బెండ్ అండ్ వైఫ్..." అని హెన్రీ ఆకాశంకేసి చూస్తూ చంద్రునిలో ఎవరినో వెదుకుతూ మాట్లాడుతూ ఉండటాన్ని అర్థం చేసుకోలేక తికమక పడ్డాడు దేవరాజులు.

"ఇటీజ్ క్వయిట్ కన్‌ఫ్యూజింగ్..." అని బిక్కమొహమేసిన దేవరాజులును నిశితంగా చూశాడు హెన్రీ. నీటిలో ఉన్నందువలన చేత్తో నీటిని మెల్లగా కొట్టాడు.

"యూ సీ... మా అమ్మా నాన్నా ఒకరి నొకరు వివాహం చేసుకోలేదు. అండర్ స్టాండ్? "

"ఎస్..."

"నేను వాళ్ళకు పుట్టినవాణ్ణి కాను... అర్థ మైందా? "

"అయితే వాళ్ళనెందుకు మీరు, అమ్మా-నాన్న అంటున్నారు? "

"వాళ్ళే నాకు అమ్మానాన్నలుగా ఉన్నవాళ్ళు. నాకు వాళ్ళు ఐడియల్ ఫ్రెండ్స్‌గానూ, వాళ్ళలో వాళ్ళు ఐడియల్ కపుల్‌గానూ ఉన్నారు. I was a foundling. రైల్ క్యారేజ్‌లో అనాథనై పడున్నానట... ఆయనకు కొడుకు కావటం నిజంగా నా అదృష్టమే? " అని తన తండ్రిని గుర్తుకు తెచ్చుకొని 'పప్పా' అని మనస్సులో స్మరించుకున్నాడు.

మొదట దేవరాజులు స్నానం పూర్తిచేసి మెట్లెక్కి పైకి వచ్చాడు. అప్పటికి 'స్నానం ఇక చాలు' అని అనుకున్నాడు హెన్రీ. పైకి వచ్చాక దేవరాజులు ఒళ్ళు తుడుచుకున్నాడు. మళ్ళీ హెన్రీ నగ్నంగా పైకి వచ్చి, పండు వెన్నెల్లో నిలబడటాన్ని తప్పించటానికి-"టవల్‌ను తీసి కిందకు వెయ్యనా? " అని బావిలోకి తొంగి చూస్తూ అడిగాడు దేవరాజులు. అప్పుడతడు సగం దూరం మెట్లెక్కి వస్తూ కనిపించాడు.

"థ్యాంక్యూ" అంటూ హెన్రీ చాపిన చేతులోకి టవల్‌ను పడేశాడు దేవరాజులు.

హెన్రీ అక్కడే బావి మెట్ల మీదే, సగం దారిలో నిలబడి ఒళ్ళు తుడుచుకున్నాక, గుడ్డను నడుముకు చుట్టుకుని పైకి వచ్చాడు. అలా గుడ్డను చుట్టుకొని నిలబడ్డం అతడి దృష్టికి తీసుకొచ్చి, నడుముకు గుడ్డ లేకుండా బావిలోనో, చెరువులోనో, కుంటలోనో, ఏట్లోనో దిగకూడదన్న విషయాన్ని చెప్పాలనుకున్నాడు దేవరాజులు. అయినా దాని గురించి మాట్లాడ్డానికి దేవరాజులుకు సిగ్గేసింది.

"మీరు స్నానం చేస్తున్నప్పుడు నడుముకు ఏదైనా కట్టుకోవాలి. ఇప్పుడు రాత్రి కాబట్టి ఫరవాలేదు. పగలయితే కూలీలు, పశువుల కాపర్లు, ఆడవాళ్ళు కూడా ఇటు వైపు వస్తారు" అని ఇంగ్లిష్‌లో చెప్పాడు.

"యస్.... యస్..." అని అతడు చెప్పిన



దాన్ని ఆమోదించిన హెన్రీ, "మై పప్పా యూజ్డ్ టు గివ్ మి ఆయిల్ బాత్!" అని దేన్నో ఊహించుకొని చెప్పాడు.

"మై పప్పా వజ్ ఎ వండర్‌ఫుల్ మేన్...." అని చెబుతున్నప్పుడు తన తండ్రి గురించి మాట్లాడ్డంలో, అతడిలో అమితమైన ఆనందమూ, హద్దుల్లేని ప్రేమ పొంగ

డం గుర్తించాడు దేవరాజులు.

దేవరాజులు సిగరెట్ వెలిగించాడు. నడుముకు కట్టుకున్న గుడ్డతో హెన్రీ పల్లెల్లో తిరిగే స్వాముల్లాగా కనిపించాడు. కనుచూపు మేరా విస్తరించిన పంట పొలాల్ని సంతృప్తిగా చూశాడు. దూరంగా రేడియో నుండి ఏదో పాట తేలుతూ చెవులకు చేరింది.

ఓ పక్కగా మడిచి పెట్టిన తన బట్టల్ని తీసుకుంటూ- "వీటిని ఉతికి ఉంటే బావుణ్ణే... సరే ఉదయాన్నే చూసుకుందాం, ఎండలోనూ ఆరుతుంది" అని ఇంగ్లిష్‌లో గొణిగాడు.

అతడు ఎంతవరకూ చదువుకున్నాడో తెలుసుకోవాలనుకున్నాడు దేవరాజులు. కానీ దాని గురించి అడగటం నాగరికత అనిపించుకోదని అర్థం చేసుకుని మౌనంగా ఉండిపోయాడు.

హెన్రీ తనలో తాను ఇంగ్లిష్‌లో గొణుగుతూనే ఉన్నాడు. "నేను చదువుకోలేదు. పప్పా నాకు అంత స్వేచ్ఛనిచ్చారు. మమ్మీ నన్ను స్కూల్‌కు తీసు



కెళ్ళేది. 'స్కూల్‌కు వెళ్ళాలని వాడికి ఇష్టముంటేనే వెళ్లనీ, లేకుంటే వద్దు. వాణ్ణి నిర్బంధించకండి' అని పప్పా చెప్పేవారు. నాకు 'బాప్టిజం' చేయటానికి కూడా ఆయన అంగీకరించలేదు. 'నీ మతం ఎంత గొప్పదైనా దాని కోసం ఈ బిడ్డ తలమీద ఆ భారాన్ని మోపవద్దు' అని అనేవారు. వాడికై అనిపిస్తే తర్వాత క్రైస్తవునిగానో, హిందువుగానో, ముస్లిమ్‌గానో వాడి ఇష్ట ప్రకారం కానిద్దాం...

మనం వాణ్ణి మంచి మనిషిగా చేద్దాం. వాడి దారిలోనే వదిలేద్దాం! పప్పా ఏం చెబితే అది మా మమ్మీకి స్క్రిప్చర్ లాంటిది. ఇంతా చేసి చివరి వరకూ ఆయన హిందువుగానే ఉన్నాడు. మమ్మా క్రిస్టియన్... ఆదివారం చర్చ్‌కు అమ్మతో పాటు వెళ్ళేవాణ్ణి. నాన్నతో ఎప్పుడైనా గుడికి వెళ్లేవాణ్ణి. హి వజ్ వెరీ జనరల్..." చేతులు విరుచుకుంటూ అన్నాడు హెన్రీ.

"ఇక్కడ ఓ తండ్రి యిలా ఉంటే 'ముద్దు చేసి బిడ్డను పాడు చేస్తున్నాడంటారు' అన్నాడు దేవరాజులు.

"యూ ఆర్ రైట్..." అని దాన్ని అంగీకరించాడు హెన్రీ.

"ఎక్కడైనా అలాగే అంటారు. అందువల్ల పిల్లలూ పాడైపోతారు. నా విషయంలో అది ఒట్టి ముద్దు చేయడం కాదు. ఇట్ వాజ్ లవ్... ఎ నార్మల్ లవ్! పప్పా తాగుతారు. డెయిలీ తాగేవారు. ఇంట్లోనూ తాగేవారు. షాప్‌కు వెళ్ళి తాగేవారు. నేనెప్పుడూ ఆయనతోనే ఉండేవాణ్ణి. రెండు గ్లాసుల తర్వాత బాగా ఎమోషనల్ అయ్యేవారు. కళ్లంతా నీటితో నిండి ఏడ్చి ఏడ్చి నాతో మాట్లాడేవారు. ఆయన బాగా కష్టపడ్డ మనిషి! ఒక్కో ఏజ్‌లోనూ ఆయా ఏజ్‌కు తగ్గట్టు ఆయన పడ్డ కష్టాన్నంతా నాతో చెప్పేవారు. ఐ మీన్ ఆయన ఎక్స్‌పీరియన్సంతా చెప్పేవారు..."

**ఇంగ్లీష్‌లో మాట్లాడితే ఆయనకు అర్థమయ్యేది. కానీ తిరిగి మాట్లాడ్డం రాదు. నేనూ మమ్మీ ఆయనను ఎప్పుడైనా ఇంగ్లీష్‌లో మాట్లాడమని చెప్పి నవ్వుకునే వాళ్లం.**

"డోంట్ క్రై పప్పా" అని నేనాయన కళ్లు తుడిచేవాణ్ణి.

".... నేను ఏడ్వటం లేదు కన్నా" అని నా చేతిమీద పదే పదే ముద్దు పెట్టేవారు. ఇంగ్లీష్‌లో మాట్లాడితే ఆయనకు అర్థమయ్యేది. కానీ తిరిగి మాట్లాడ్డం రాదు. నేనూ మమ్మీ ఆయనను ఎప్పుడైనా ఇంగ్లిష్‌లో మాట్లాడమని చెప్పి నవ్వుకునే వాళ్లం. మేము నవ్వటం కోసం ఆయన మాట్లాడేవారు! అయితే మేం మాట్లాడే తెలుగు విని ఆయన నవ్వేవారే కాదు".

"మీరూ తాగటం కద్దా? " అని దేవరాజులు అడిగాడు.

"నో!... పప్పా ప్రతిసారీ ఒక మర్యాద కోసం నన్ను తాగమని అడిగేవారు. చిన్న పిల్లాడిగా ఉన్నప్పుడే రుచి చూసి, నేను "వద్దు" అని చెప్పేశాను. అయినా ఆయన ఒక మర్యాద కోసం ఎప్పుడూ అడిగేవారు. నేను "థాంక్స్" అని చెప్పేసేవాణ్ణి!"

"తాగకూడదని ఏమైనా నియమమా? "

"నో, నో... నాకు అవసరం లేదు. నాకవన్నీ రుచించలేదు. మీరు తాగుతారా? ఇక్కడ అలాంటి వాటికంతా నిషేధమట గా? " అని ఇంగ్లిష్‌లో ప్రశ్నించాడు హెన్రీ.

"చట్ట ప్రకారం నిషేధమే...అయితే మందు బాగా దొరుకుతుంది. ఇక్కడే సారాయి కాస్తారు. నేను ఎప్పుడైనా ఒంటరిగా తాగటం కద్దు. నాకు స్నేహితులెవరూ లేరు. స్నేహితుల్లా ఉన్న వారంతా నిజమైన స్నేహితులు కారు. మీరు నాకు నిజమైన స్నేహితుడిగా ఉండగలరన్న నమ్మకం నాకు ఇప్పుడు కలుగుతోంది" అని అతడు అంటూ ఉండగా- "థాంక్యూ" అని సంతోషంగా అన్నాడు హెన్రీ.

"ఈ మంచి సందర్భాన్ని పురస్కరించుకొని మనం కలిసి తాగుదాం అనుకున్నాను. నా వద్ద అర బాటిల్ బ్రాంది ఉంది..." అని వెనుకాడాడు దేవరాజులు.

"ష్యూర్! నేను మీకు కూడా కచ్చితంగా తోడు ఉండగలను. మీ సంతోషాన్ని నేను కాదనటమా...? " అని అతణ్ణి తొందర పెట్టేలా బావి అంచు మీద నుండి లేచాడు హెన్రీ.

"విల్ యు డ్రింక్ విత్ మి?" అని అడిగాడు దేవరాజులు.

"ష్యూర్... ఐ విల్ డ్రింక్ ఫార్ యూ!"

"నా కోసం మీ అలవాటును మార్చుకుంటారా ఏం?"

"నో, నో! నా అలవాటే 'ఫ్లెక్సిబుల్'గా ఉండడం" అన్నాడు హెన్రీ.

ఇద్దరూ తొందర తొందరగా నడచి వచ్చి పెరడు వైపు నుండి మేడ మీదకు వెళ్ళారు. మేడ మీదకు వచ్చాక తన మురికి బట్టల్ని విప్పేసి ఓ పైజమాను, బనియన్‌ను తొడుక్కున్నాడు హెన్రీ.

దేవరాజులు రెండు గ్లాసుల్ని పట్టుకొచ్చి ఓ స్టూల్ మీద వాటిని పెట్టి అల్మైరా నుండి బాటిల్‌ను తీసుకొని పోసి మంచినీళ్ళు కలిపాడు.

"నాకు కొద్దిగా చాలు" అని నవ్వుతూ దేవరాజులు మనసు నొచ్చుకోకుండా చెప్పాడు హెన్రీ.

అతడు తన కోసమూ, తనతో ఏర్పడ్డ స్నేహం కోసమూ తాగుతున్నాడని గ్రహించిన దేవరాజులు అతడి ఔన్నత్యాన్ని మనుసులోనే మెచ్చుకున్నాడు.

ఇద్దరూ "చీర్స్" అంటూ చెప్పి తాగారు. దేవరాజుల గ్లాసులో సగం ఖాళీ అయింది. హెన్రీ పెదాలు మాత్రం తడిగా ఉన్నాయి.

అతడు చివరివరకూ ఆ గ్లాసును అలా చేతిలోనే పట్టుకుని ఉంటాడని దేవరాజులుకు అర్థమైంది. తాను అందుకోసం అతణ్ణి బలవంతం చెయ్యకూడదని నిర్ణయించుకున్నాడు.

హెన్రీ ఎదురుగా గోడకు వ్రేలాడుతున్న ఫోటోను చూశాడు. దాన్ని చూసిన దేవరాజులు దీర్ఘంగా నిట్టూర్చాడు.

"నేనూ నా గురించి మీకు చెప్పాలి"

"ప్లీజ్- చెప్పండి" అంటూ పసి పాపయిలా నవ్వాడు హెన్రీ.

దేవరాజులు దీపం వెలుతుర్లో గ్లాసులో పొంగుతున్న ద్రవాన్ని తీక్షణంగా చూశాడు. తర్వాత తల తిప్పి హెన్రీ ప్రేమ పూర్వకమైన చిర్నవ్వును చూశాడు. దేవరాజులు పెదాలు మెల్లగా వణికాయి. "మీలాగా నేను సంతోషంగా లేను..."అన్నాడు.

దేవరాజులు ముఖంలో విషాద ఛాయ అలముకుంది. సంతోషంగా గడపాలని, ఆనందం కోసమని తాగి దేన్నో గుర్తు చేసుకుంటున్న అతడి ముఖమూ, మనసూ మారటాన్ని హెన్రీ గుర్తించాడు.

దేవరాజులు గోడకు వేలాడుతున్న ఫొటోలో ఉన్న తన భార్యను చూశాడు.

"ఎంత నమ్మకంతో, ఎన్ని కలలతో, ఆశలతో ఆమె పక్కన నేను నిలబడ్డాను" అంటూ దీర్ఘ శ్వాస విడిచాడు.

"వి ఆర్ నాట్ లివింగ్ టుగెదర్" అని చెప్పిన దేవరాజులు తన మాటల్ని కొనసాగిస్తూ ఇలా వివరించాడు. "నాకూ ఆమెకూ మధ్య ఒక్క జగడమూ లేదు. శని, ఆదివారాలు ఎప్పుడు వస్తాయా అని ఇప్పటికీ ఎదురు చూస్తూనే ఉంటుంది. వాళ్ళ నాన్న అమ్మ అందరూ నాతో మర్యాదగా,ప్రేమగానే ఉంటారు. అయితే ఆ ప్రేమా, మర్యాద వాళ్లకు మా అక్క మీద లేదు. అది వాళ్ళ తప్పు కాదు. అది ఉందే... అదే నా భార్య... అది అక్కను అసహ్యించుకొని, వాళ్ళు కూడా అసహ్యించుకునేలా చేసింది. ఆ విషయంలోనే ఆమెను నేను అర్థం చేసుకోలేకపోయాను. పెళ్ళైన రెండు మూడు మాసాల వరకు సంతోషంగా ఉన్నట్లే అనిపించింది. అంత కోపమూ, అసహ్యమూ ఎలా వచ్చాయో అర్థం కాలేదు. అందుకు కారణం కూడా నా ఊహకు తట్టలేదు. మా అక్క చస్తేనే దానికి జీవితం సంతోషంగా ఉంటుందట. అలా అని నాతో అనొచ్చా? నన్ను అవమానించటమేగా అది? నేను అప్పుడే చెప్పాను. "నువ్వు నాకొద్దు. అక్కమ్మ ఇల్లు ఇది. అక్కమ్మే ఇక్కడ అన్నింటికీ అధికారి. అక్కమ్మను ఇంతగా అసహ్యించుకునే నువ్వు, అవమానకరంగా మాట్లాడే నువ్వు నాకొద్దు. నువ్వు మీ ఇంటికి వెళ్ళిపో! అన్నాను. యు నో వాట్ షి సెడ్?" అని ఆ జ్ఞాప

కాలలోనే కోపం తారా స్థాయికి చేరుకోగా పళ్ళు పటపట కొరికాడు దేవరాజులు. అతడి ముఖం ఎఱ్ఱబడి కళ్ళ కొసలలో కన్నీళ్ళు బయటికొచ్చి క్రిందకు జారాయి.

హెన్రీ అతడి భుజం మీద చెయ్యి వేసి కళ్ళతోనే నవ్వుతూ "శాంతించండి" అన్నాడు. దేవరాజులు ఓ సిగరెట్‌ను వెలిగించాక సమాధానపడి తన భార్య అమాయకత్వాన్ని తలచుకొని బాధగా నవ్వాడు.

"నాకు వచ్చిన కోపంలో హత్య చేస్తానేమో నని కూడా భయపడ్డాను. అనరాని మాటలు చాలా అనేసింది. ఆవేశం వచ్చేస్తే బుద్ధి మాత్రమే కాదు, పద్ధతులు కూడా మారిపో తాయి. నేను ఆమెను కొట్టాను. అప్పుడు కూ డా అక్కమ్మే పరుగెత్తుకొచ్చి అడ్డుపడి నన్ను తిట్టింది. ఆమెకు తెలియదు, మా మధ్య ఎందుకు కొట్లాట వచ్చిందో? ! దాన్ని ఓ పసి బిడ్డలా హత్తుకొని నన్ను ఖండించింది అక్క మ్మ. అప్పుడే ముఖాముఖి అక్కమ్మను మర్యాద లేకుండా మాట్లాడింది నా వైఫ్. అక్కమ్మ నాకు దేవతలాంటిది. మా అక్క కాబట్టి అలా అనటం లేదు. యాజ్ ఎ ఉమ న్... షి ఈజ్ ఎ గాడెస్ ఎస్, గాడెస్" అంటూ రెండోసారో, మూడోసారో గ్లాసు నింపుకున్నాడు దేవరాజులు.

హెన్రీ మొదటి గ్లాసును అలాగే పట్టుకుని ఉన్నవాడు ఒక్క గుటకలో దాన్ని గొంతులో పోసుకున్నాడు.

"నంజుకోవడానికి ఏమన్నా కావాలా? " అని అడుగుతూ లేచి గదిలోంచి బయటికి వచ్చాడు.

కిందకు వెళ్ళిన దేవరాజులు అక్కమ్మతో- "తినటానికి ఏమైనా ఉందా? " అని అడిగాడు.

"ఇదిగో, అయిపోయింది...కాసేపట్లో భోజ నమే అయిపోతుంది..." రోట్లో దంచటాన్ని ఆపి తల తిప్పి అంది అక్కమ్మ. "ఔనూ... అతనెవరూ? మనవాళ్ళు లాగా కనిపించటం లేదే!" అని గొంతు తగ్గించి అడిగింది.

"నీకెలా అనిపిస్తోంది అక్కమ్మా...? " అని అడిగాడు దేవరాజులు.

"నేను మన చుట్టాలేమో- ఒకవేళ మీ అత్త గారింటి నుండి ఎవ్వరైనా వచ్చారేమోనని పరుగెత్తుకొని వచ్చాను. తీరా వచ్చి చూస్తే అదోలా అయిపోయింది. అదిగో, ఆ ఫొటో లో ఉన్నారే ఆయనలా లేడూ? " అని ఎదు రుగా గోడకు వేలాడుతున్న ఓ కేలండర్‌ను చూపించింది అక్కమ్మ. అటు చూసి దేవరా జులు గట్టిగా నవ్వాడు. దాంతో తాను తప్పు గా ఏదైనా అనేశానేమోనని భయపడి పోయింది అక్కమ్మ.

"సరి, సరి. తినటానికి ఏమన్నా కావాలని అడిగావుగా? మురుకులు ఉన్నాయి... తీసు కెళ్ళు..."అని ఓ పళ్ళెంలో మురుకులు, వేయిం చిన వేరు శెనక్కాయల గింజలు పట్టుకొచ్చి ఇచ్చింది.

ఆమె హెన్రీని ఎవరిలా ఉందని చూపిం చిందో ఆ కాలెండర్‌లోని వ్యక్తితో హెన్రీని పోల్చి చూసి, ఆమె తన అజ్ఞానం వల్ల హెన్రీకి ఆపాదించిన గౌరవాన్ని గుర్తు చేసు కుంటూ ఆమెతో అన్నాడు.

"అతడిది బెంగుళూరట- ఇంతవరకూ పల్లె టూళ్ళే చూళ్లేదట. మొట్టమొదట మన ఊరికే వచ్చాడు. అతడి మాట తీరూ అదీ మంచి మనిషిగా అగుపిస్తున్నాడు. మనింటికి పిలి చాను. మున్సిఫ్‌ను కలవాలని చెప్పాడు. 'అలాగే, రేపు ఏర్పాటు చేస్తానన్నాను'. ఏమైనా భూమి పుట్రా కొని ఇక్కడే ఉండిపో వాలన్న ఆలోచన ఉందో ఏమో!? "

"ఆ అక్కడంతా లేని భూములా! వేరే ఏదైనా విషయం ఉండొచ్చు" అంది అక్కమ్మ.

"ఉండొచ్చు అక్కమ్మా... మన ఎదురిల్లు లేదూ... పాడుబడ్డ ఇల్లు- దాని గురించి పదే పదే అడిగాడు. ఎందుకు అడిగాడో తెలియ టం లేదు. నా చిన్నప్పుడు ఓసారి మంగలి వాడొకడు ఉరి వేసుకొని చచ్చిపోలేదూ? ఆ విషయం మాత్రం చెప్పాను. వెంటనే అతడి పేరు గోయిందు కదూ అని అడిగాడు. నాకేం గుర్తు లేదు. అనేశాను. అతడి పేరు

గోయిందా? "

"ఆ ఆ... ఆ మంగలి పేరు గోయిందే- అతడి కుటుంబమే నాశనమై పోయింది. అత డికి ఎలా తెలుసట? " అంటూ రోలు దగ్గరికి వెళ్లింది అక్కమ్మ.

"అదే నాకు తెలియటం లేదు. కానీ చాలా మంచి వ్యక్తి అక్కమ్మా! మనకు అదేగా కావ లసింది. మాట్లాడుతూనే ఉన్నాడు... కొంచెం కొంచెంగా చెబుతున్నాడు. ఒంటరిగా వదిలేసి వచ్చేశాను. భోజనానికి తొందరేం లేదు. నిదా నంగానే కానివ్వు. ఇవన్నీ ఉన్నాయిగా!" అంటూ పళ్లాన్ని అక్కమ్మ ఇచ్చిన మురుకులు తీసుకొని మేడ మీదకు వెళ్ళాడు దేవరాజులు.

"I am sorry, చాలాసేపు మిమ్మల్ని ఒంట రిగా వదిలేసి వెళ్ళిపోయాను" అంటూ చేతిలో పట్టుకొచ్చిన పళ్లాన్ని ఇద్దరికీ మధ్య ఉన్న స్టూలు మీద పెట్టి మంచంపై కూర్చుని మందు ఓ గుక్క తాగాడు దేవరాజులు.

హెన్రీ దేవరాజులు, అతడి భార్య ఫొటోని చూస్తూ "మీకు ఓ బిడ్డ పుడితే అన్నీ సర్దుకుం టాయి. మీకు ఓ బిడ్డ పుట్టాలని ఆశపడుతు న్నాను" అన్నాడు హెన్రీ.

"థాంక్ యూ" అన్నాడు దేవరాజులు "మూడు నెలలుగా నేను వాళ్ళింటికే వెళ్ళ లేదు. ఆమె టీచర్ ట్రైనింగ్ చెయ్యనా? అని అడిగింది... సరేనని చెప్పాను. తర్వాతే ఆలో చించి చూశాను. సరే, ఆమెకూ ఓ ప్లాన్ ఉండేలా ఉంది అనుకున్నాడు. నేను అనవస రంగా ఆమె విషయంలో ఎందుకు తల దూర్చాలి? ఆమెకు నేను కావాలంటే తానుగా రానీ- అయితే ఒకటండీ, నేను ఎప్పుడూ మన సులోనూ, ఈ ఇంట్లోనూ, నా జీవితంలోనూ ఆమెకు స్థానం అట్టిపెట్టాను. అది ఖాళీగానే ఉంది, ఉంటుంది. చూడండి పీపుల్ డోంట్ అండర్‌స్టాండ్ ఈవెన్ లవ్" అంటూ కన్నీళ్ళ పర్యంతమయ్యాడు దేవరాజులు.

## బరువు తగ్గించే 'బ్రాన్'



ఉదయం టిఫిన్ అంటూ ఓ చిన్న కప్పులో కాసిని మొల కెత్తిన ధాన్యం గింజలు తింటున్న వారిని మనం కాస్త వింతగా చూస్తాం. ఆరోగ్య స్పృహ ఎక్కువవుతున్న ఈ రోజుల్లో అలా తినేవారి సంఖ్య క్రమంగా పెరుగుతోంది.

మొలకెత్తిన ధాన్యపు గింజలను ప్రతిరోజూ ఆహారంగా తీసుకుంటే మధుమేహ వ్యాధి, గుండె జబ్బులు, కొన్ని రకాల క్యాన్సర్లు రాకుండా నివారించవచ్చు అన్నిటికంటే, అధిక కొవ్వు శరీరంలో చేరకుండా అవి మిమ్మల్ని నాజూకుగా ఉంచుతాయని చెప్తున్నారు హార్వార్డ్ స్కూల్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ శాస్త్రవేత్తలు. పోషక విలువలు అధికంగా ఉండే ధాన్యపు గింజలు ఆహారంగా తీసుకోవటం వల్ల క్రమంగా శరీరపు బరువు తగ్గి, కొవ్వు కరిగి, రక్తపోటు నివారిస్తుందని ఇటీవల వారి పరిశోధనలలో తేలింది. పాలిష్ పట్టించిన ధాన్యపు గింజల కంటే, ముడి గింజల మీదుండే పై పొర(బ్రాన్)లో పీచు పదార్థాలు బి-విటమిన్లు, తక్కువ మోతాదులో లవణాలు ఉంటాయి. ప్రోటీన్లు, యాంటీ ఆక్సిడెంట్లు, విటమిన్-ఇ కూడా పుష్కలంగా ఉంటాయి. బ్రాన్ పొర ముడి గింజలపై ఉండి మనకి ఆరోగ్యాన్ని, రుచిని అందించడమే గాక అధిక బరువుని తగ్గించి 'స్లిమ్‌గా' ఉంచుతుంది.

బరువు తగ్గాలంటే 'బ్రాన్'ని ఆశ్రయించాల్సిందే మరి!

"ఖచ్చితంగా ఏదో ఒకరోజు మీ భార్యకు మీ 'మంచి' తెలుస్తుంది. అందుకు కొద్ది రోజులు పడుతుంది" అన్నాడు హెన్రీ.

"కాలం గడిచాక తెలుసుకుని ఏం ప్రయోజనమండీ? " అన్నాడు దేవరాజులు.

రాత్రి పదిగంటలైంది. మేడ మెట్ల మీద ఎవరో నడిచివస్తున్న శబ్దం విని దేవరాజులు తల తిప్పి "ఎవరదీ? " అని ప్రశ్నించాడు.

"నేను కరిపిగాణ్ణి" అంటూ పైకి వచ్చి గోడ పక్కగా, చంద్రుని వెలుతురు పడేచోటు నిలబడి తల మాత్రం చాపి చూశాడు. వాళ్ళిద్దరికీ తెలియకూడదని తలను వెనక్కు తీసుకొన్న కరిపిగాడు వాళ్ళ కంటికి కనిపించకుండా నిలబడి అన్నాడు.

"భోజనం మేడమీదికే పంపాలా? కిందికే వచ్చి భోజనం చేస్తారా? అక్కమ్మ అడిగి రమ్మంది..."

దేవరాజులు చేతి గడియారంకేసి చూశాడు. బాటిల్లో ద్రవం ముప్పావు వంతు ఖాళీ అయిపోయింది. అతడికి 'ఇక చాలు' అనిపించింది. హెన్రీ గ్లాసుకేసి చూశాడు. ఇంకా అందులో సగం ద్రవం ఉంది.

"మీరన్నట్టు నిజంగానే మీరు నాకు తోడు కోసమే తాగుతున్నారు" అన్నాడు దేవరాజులు. బాటిల్ తెరిచి, "మరో గ్లాసు తాగుదామా? "అనడిగాడు.

"థాంక్స్, నాకిది చాలు" అంటూ చేతిలో ఉన్నదాన్ని రెండుగుటకల్లో తాగేశాడు హెన్రీ. దేవరాజులు తెరచిన బాటిల్ను మూసి, "నాక్కూడా చాలు" అని అక్కడుంచి కరిపిగాణ్ణి పిలిచాడు.

"ఇక్కడే ఉన్నా ను" అంటూ వాడు లోపలికి వచ్చాడు. హెన్రీకి వాడి పేరు చాలా వింతగా అనిపించింది.

"కాసేపట్లో వస్తామని అక్కమ్మకు చెప్పు... ఈ రోజు మాకు నువ్వే వడ్డించాలి..." అంటూ దేవరాజులు వాడి భుజంపై ప్రేమతో తట్టాడు. వాడు తనను దాటి వెళుతున్నప్పుడు హెన్రీ వాణ్ణి చూసి స్నేహంగా వాడి ముందుకు చేతిని చాపి అన్నాడు. "అయాం హెన్రీ!"

కరిపిగాడు ఓ క్షణం ఖంగారు పడ్డాడు. తనను గౌరవించి మర్యాదను చూపించే అతణ్ణి దాటి ముందుకు పోవటానికి వీలు కాలేదు కరిపిగాడికి.

"అయాం కరిపిగాడు" అని చెప్పాలన్న విషయం వాడికి తెలుసు. దేవరాజులు వైపు సిగ్గుపడుతూ చూశాడు.

"పల్లెటూరి బైతులా నడుచుకోకు" అని దేవరాజులు ఇంగ్లీష్లో అన్నాడు.

"మై నేమ్ ఈజ్ కరిపి" అంటూ హెన్రీ చేతిని పట్టుకుని షేక్ చేసి పొంగిపోతూ నడచిన కరిపిగాడు మేడ మెట్లమీద గెంతుతూ కిందికి పరుగెత్తాడు.

"వెరీ నైస్ బాయ్... పక్క గ్రామం వాళ్లది. చాలా బీద కుటుంబం. తండ్రి మంచివాడు కాదు... వీణ్ణి అన్యాయంగా కొట్టి వేధించేవాడు. వీడి తల్లి ఓ రోజు వీణ్ణి వెంటబెట్టుకుని వచ్చి నా చేతుల్లో పెట్టి, "మీ బిడ్డలా చూసుకోండి. ఈ మాణిక్యం గొప్పతనం తెలియకుండా ఆ పాపాత్ముడు కొట్టి చంపేసేలా ఉన్నాడు... నా కొడుకు ఎక్కడైనా ప్రాణాలతో ఉంటే అంతే చాలు, ఓ పూట అన్నం పెట్టి ఉంచుకోండయ్యా..." అంది. అప్పుడు వీడు చాలా చిన్న పిల్లాడు. ఏడుస్తూ నిలబడ్డాడు. ఒళ్లంతా పట్టలు పట్టలుగా బెల్ట్తో కొట్టిన గాయాలు... నాకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అక్కమ్మ కూడా ఏడ్చేసింది. వాడి తల్లి ఏడుస్తూ చెప్పిం ది. 'నా కొడుకు అబద్ధమాడడు. దొంగతనం చెయ్యడు... కాస్త గంజి పోసి కళ్ళు తెరిపించేశారంటే పుణ్యం ఉంటుంది' అప్పుడు వీడు మా బడిలో ఐదవ తరగతి చదువుతు



న్నాడు. మూడేళ్లకు ముందు మాట ఇది. ఇప్పుడు ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు. చాలా బుద్ధిమంతుడు. అక్కమ్మకు నా తర్వాత వీడే కొడుకు. వాడి తల్లి ఎప్పుడైనా వచ్చి చూసి వెళుతుంటుంది..." అని ఇంగ్లిష్‌లోనూ తెలుగులోనూ దేవరాజులు విశదపరచాడు.

హెన్రీ ఆసక్తిగా వింటూ ఉన్నవాడు- "గాడ్ బ్లెస్ యూ!" అని దేవరాజులుని దీవించాడు.

"నన్నెందుకు ఆశీర్వదిస్తున్నారు? "

"సకారణంగానే... జీవితంలో బాధింపబడే వాళ్ళు చాలామంది ఉన్నారు. బాధించే వాళ్ళూ చాలా మందే ఉన్నారు. కానీ దాన్ని అర్థం చేసుకునే వాళ్ళు చాలా కొద్దిమందే ఉంటారు. ఆ కొద్ది మందిలో మీరూ ఒకరు..." ఇంగ్లీష్‌లో అన్నాడు హెన్రీ.

"మీరు నన్ను పొగుడుతున్నారా? " హెన్రీ మాటలకు పొంగిపోయి నవ్వుతూ, "భోజనానికి వెళదామా? " అని ప్రశ్నిస్తూ లేచాడు దేవరాజులు. హెన్రీ కూడా లేచాడు. దేవరాజులు ముందుకు దారి తీశాడు. చాలా నిదానంగా మెట్లు దిగాడు. ఓసారి వెనక్కు తిరిగి చూసి హెన్రీకి కన్ను గీటి నవ్వాడు. అక్కమ్మకు తెలియకూడదన్న సంకేతం అది.

కింది వసారాలో నీళ్ళ చెంబుతో నిలబడున్నాడు కరిపిగాడు. వాడి చేతినుండి దాన్ని అందుకుని చేతులు కడుక్కున్న హెన్రీ "థాంక్స్" చెప్పాడు. ఇప్పుడు కరిపిగాడు హెన్రీని చూస్తూ చిర్నవ్వు నవ్వాడు.

వంటగది ముందున్న హాల్లో చాపలు పరచి, ఆకులు వేసి, నీళ్ళ గ్లాసులు పెడుతున్న అక్కమ్మ, వాళ్ళు రావటం చూసి చిన్నగా నవ్వి సాదరంగా ఆహ్వానించింది.

"నువ్వు ఉండు అక్కమ్మా. కరిపిగాడు వడ్డిస్తాడు..." అన్నాడు దేవరాజులు. అక్కమ్మ వంటగదిలోకి వెళ్ళి పదార్థాలు పట్టుకొచ్చి ఆకుల్లో వడ్డిస్తూ అంది. "మొదట నేను వడ్డించేస్తే తర్వాత కావాలంటే వాడు వడ్డిస్తాడు"

హెన్రీ నేలమీద కూర్చోవటానికి కాస్త శ్రమ పడ్డాడు.

"మీరు కావాలంటే సౌకర్యంగా ఛెయిర్‌లో కూర్చోండి" అన్నాడు దేవరాజులు. "నో, నో... ఇలా సౌకర్యంగానే ఉంది... నేనూ అలవాటు పడొద్దూ" అన్నాడు హెన్రీ.

"మా వంటకాలన్నీ పల్లెవాటంగా ఉంటాయి... మీకెలా ఉంటుందో"అంది అక్కమ్మ.

హెన్రీకి ఏం సమాధానం చెప్పాలో తెలియక లోలోన నవ్వుకున్నాడు.

హెన్రీ ఓ మాంసపు ముక్కను తీసుకొని తింటూ తల తిప్పి "చాలా బావుందండీ" అంటూ మెచ్చుకున్నాడు.

అతడు చాలా కొద్దిగానే భోజనం తిన్నాడు. మొదట అక్కమ్మ వడ్డించాక ఆపై అతడు ఏమీ పెట్టించుకోలేదు. రసం, పెరుగూ గ్లాసులో పోయించుకుని తాగాడు. దేవరాజులు మాంసాన్ని ఆస్వాదించి తింటూ ఉంటే అతడి పక్కనకూర్చొని వేచి చూడసాగాడు హెన్రీ.

"బాగా ఉందని చెప్పారే కానీ, తిన్నది చూస్తే- భోజనం బాగా లేనట్టు..." అంటూ సాగదీసింది అక్కమ్మ.

"అలా కాదండీ... చాలా బాగా ఉంది. నేను రెండు మూడు రోజులుగా సరిగ్గా భోజనం చెయ్యలేదండీ. అందుకని ఇప్పుడు వీలు కాలేదు. అయినా ఎక్కువే పెట్టేశారండీ..." అని నవ్వాడు హెన్రీ. అక్కడ మాట్లాడే విధానాన్ని గ్రహించి హెన్రీ ఒక్కో మాటకు చివర "అండీ" చేర్చి మర్యాదగా మాట్లాడాడు. అయినా అతడి మాటలు కొత్తగా అనిపించాయి అక్కమ్మకు.

"మీ కుటుంబమంతా బెంగుళూరులో ఉందా బాబూ..." అని అడిగింది అక్కమ్మ. హెన్రీ ఆమెను నిశితంగా చూశాడు.

"కుటుంబం... ఊహూఁ లేదండీ... మా నాన్నగారు మూడు రోజుల క్రితం చనిపోయారండీ. ఆయనే నాకు కుటుంబం. ఆయన తర్వాత నేను మాత్రమేనండీ. అమ్మ పోయి మూడేళ్ళైపోయింది. అంతేనండీ- ఇప్పుడు ఎవరూ లేరండీ. నేను ఈ ఊళ్ళోనే ఉండిపోవడానికి వచ్చానండీ. మీ తమ్ముడు నాకు



మంచి స్నేహితుడైపోయారు. మీరంతా చాలా మంచివాళ్ళు. ఈ ఊరూ చాలా బావుందండీ..." అని అతడు చెబుతూ ఉండగానే దేవరాజులు భోజనం ముగిం చాడు. ఇద్దరూ పైకి లేచారు.

అక్కమ్మకు అతడు చెప్పిన విషయా ల్లోంచి ఏమీ అర్థం కాలేదు. 'సరే మనకెం దుకు?' అని ఊరుకుంది. 'తమ్ముడు చెప్పి నట్టు, మంచి మనిషిలానే అన్పిస్తోంది' అని ఆమె కూడా గ్రహించింది.

ఇద్దరూ చేతులు కడుక్కుని మేడ మీదికి వెళుతుండగా దేవరాజులు హెన్రీతో అక్కమ్మ గురించి చెప్పాడు.

"నాకు నాలుగేళ్ళప్పుడే అక్క మ్మకు పెళ్ళైంది. అదే యేడు మా బావ చనిపోయారు. విధ వరాలిగా ఇక్కడకొచ్చాక ఓ సంవత్సరంలోనే మా అమ్మా, నాన్న ఇద్దరూ ఒకరి వెనుక ఒక రుగా వెళ్ళిపోయారు. అదిగో అక్కడ కూర్చోనున్నాడే మా తాతయ్య-నాన్నకు నాన్న- ఆయ న ఆ షాక్‌తోనే పడకేసేశాడు. మా కుటుంబానికి ఏదో శాపం తగిలి నాశనమైనట్లు అందర్నీ పోగొట్టుకొని వయసు పైబడ్డ ఆ ముసలాయనా, పసివాడినైన నేనూ, అక్కమ్మలాంటి ఓ పది హేనేళ్ళ విధవరాలూ-ఇలా మా కుటుంబం దిక్కు లేకుండా నిల బడ్డప్పుడు, అదే ఓ సవాల్ కదూ? విధి విసిరిన సవాల్! దాన్ని పదిహేనేళ్ళ విధవరాలైన అమ్మాయి స్వీకరించింది. మా కుటుం బాన్ని నిలబెట్టింది. ఇల్లూ, పొలమూ అన్నింటినీ చూసుకుంటూ తానే కాపాడుకొ చ్చింది. అక్కమ్మలాగా బాధ్యత, నిగ్ర హం ఎందరికి వస్తుంది? ఇవ్వాళ నేనే అన్నిం టికీ అధికారినన్న హక్కును సాధించగ

లనా, ఏం? ఈ న్యాయం నా భార్య కు అర్థం కాలేదు. ఎలా అర్థం అవుతుంది? పాతికేళ్ళ తర్వాత నన్ను ఇంత పెద్ద మగాడిగా చూసే వాళ్ళకు నా వెనుకుండే ఈ న్యాయమంతా ఎలా అర్థమవుతుంది? నేను- ఈ ఆస్తి-నాకు భార్యయైన హక్కు-ఇంతే దాని కి తెలుసు అని ఇంగ్లిష్‌లో చెబుతూ పైకి వచ్చి హెన్రీ కోసం పడక వేశాడు దేవరాజులు.

హెన్రీ తనకేమీ వద్దని వారించి సిమెంట్ నేలపై గుడ్డ పరచుకుని పడుకున్నాడు.

దేవరాజులు అతణ్ణి బలవంతం పెట్టి నేల మీదే ఓ పడక పరచి అందులో పడుకోమన్నాడు.

"ఇక్కడే బాగా గాలి వీస్తోంది. తర్వాత నేను అక్కడికి వచ్చి పడుకుంటాను. మిమ్మల్ని చూస్తోంటే బాగా నిద్రవస్తున్నట్టు అనిపిస్తోంది. మీరు వెళ్ళి పడుకోండి" అని దేవరాజులును పడుకోమన్నాడు హెన్రీ.

దేవరాజులు మందు మైకంలో నవ్వుతూ పడకమీద కూర్చొని ఓ సిగరెట్‌ను వెలిగించాడు. సగం సిగరెట్ కాల్చాక నిద్ర అతణ్ణి కమ్ముకోసాగింది.

"మీ పప్పా... కాలం చేసి మూన్నాళ్ళే అయిందా? ... అక్కమ్మతో అన్నారుగా...? " అని అంత నిద్ర మత్తులో కూడా తన సంతాపాన్ని తెలిపాడు దేవరాజులు.

"యస్! పప్పాకు డెబ్బైకు పైగానే ఉంటుంది వయసు. ఓ నెల కాయలా పడ్డారు. నా ఛాతీ మీదే తల పెట్టుకుని పడుకున్నారు. నేను ఎంతో కాలం ఆయన ఛాతీ మీదే పడుకున్న వాణ్ణి" హెన్రీ చెబుతూ ఉండగానే దేవరాజులు సిగరెట్‌ను మంచం కింద పడేసి నలిపేస్తూ ఓ చెయ్యి కిందకు వేలాడేసి దిండులోకి తల పెట్టి పడుకున్నాడు. హెన్రీ అతడిని సమీపించి అతడి చేతిని మంచంపై పెట్టాక, "గుడ్‌నైట్" అని అతడి చెవి దగ్గర వంగి చెప్పాడు.

"గుడ్‌నైట్ మిస్టర్ హెన్రీ" అంటూ నిద్రలోకి జారుకున్నాడు దేవరాజులు.




హెన్రీ మేడమీద పరచుకున్న వెన్నెలలోకి వెళ్ళి నిలబడి చుట్టూ అలుముకున్న ప్రశాంతతను, ఆ వీధినీ, ఊరినీ పరిశీలనగా చూశాడు. దూరంగా 'వీధినాటకం' రిహార్సల్స్ జరుగుతున్న శబ్దాలు. లయతో కూడిన ఓ మగ గొంతు ఉచ్ఛస్థాయిలో గాలిలో తేలుతూ వచ్చి అతణ్ణి చేరింది.

"కన్నా"

"ఏం పప్పా"

"ఏం లేదు కన్నా, నువ్వెప్పుడూ నా పక్కనే ఉండాలి. నేను నిన్ను, కన్నా, కన్నా... అంటూ పిలుస్తూనే ఉండాలి. నీతో నేను మాట్లాడుతూనే ఉండాలి. కన్నా! నీకెంతో చెప్పాలి,నాకు నీ పేరు గుర్తుకు రాదు. నువ్వు అందరికీ హెన్రీవి... కానీ, నువ్వు నాకు కొడుకే కదా కన్నా" అంటూ ఆ లేత చేతులపై ఆయన ముద్దు పెట్టుకుంటున్నప్పుడు, వాడి సన్నని చేతులపై ఆయన మీసాల రోమాలు గుచ్చుకోగా గిలిగింతలు పెట్టినట్లై తలను పక్కకు పెట్టి నవ్వేవాడు హెన్రీ.

"పప్పా... మమ్మీ కూడా నన్ను సన్నీ అనే పిలుస్తుంది? "

"నాకు భయంరా కన్నా, నిన్ను 'కన్నా' అని పిలవకుండా 'హెన్రీ హెన్రీ' అంటూ పిలిస్తే నువ్వెక్కడ నాకు హెన్రీలాగా అయిపోతావో నని... నువ్వెప్పుడూ నాకు కొడుకుగానే ఉంటావా, కన్నా? "

"యస్ పప్పా! అయాం పప్పా... అండ్ ఐ విల్ బి... పప్పా! నువ్వు మీ పప్పా గురించి చెబుతుంటావే. ఆ కథ చెప్పు పప్పా" అతడు పప్పాతో తెలుగులో మాట్లాడేవాడు.

"నన్ను మానాన్న 'కన్నా' అని పిలిచిందే లేదు కన్నా. ఆయన నన్ను కసురుకునే వారు, కొట్టేవారు. 'రేయ్' అనే పిలిచేవారు. తర్వాత గాడిదా, కుక్కా అంటూ తిట్టేవారు. ఆ 'రేయ్' అన్న పిలుపులోనే కడుపులో నాకదోలాంటి వణుకు పుట్టేది. దగ్గరికి వెళ్ళి నిలబడేవాణ్ణి. ఆయన ఏదో అడిగేవారు. నేనేదో జవాబు చెప్పేవాణ్ణి. తర్వాత కొట్టేవారు. ఆ తర్వాత నేనెందుకు చనిపోకూడదు అనుకునేవాణ్ణి. కొన్ని సమయాలలో 'ఇలా కొట్టే ఈ నాన్న ఎందుకు చచ్చిపోకూడదు'అనుకునేవాణ్ణి. అలా అనుకున్నందుకు తర్వాత బాధపడేవాణ్ణి. నేను చావకుండా ఉండి పెద్దవాణ్ణి అయితే, నాకు ఓ కొడుకు పుడితే వాణ్ణి నేను కొట్టనే కొట్టను అని నిర్ణయించుకున్నాను"

"కొంతకాలానికి ఆయన నన్ను కొట్టడం మానేశారు. కానీ ఆయన చాలా మంచివారు కన్నా. ఆయన కొట్టినా, కొట్టకపోయినా ఆయన్ను చూస్తే నాకు భయంగా ఉండేది. ఆయన ఎంతో చదువుకున్నారు. చదువంటే, తెలుగు చదువే. మా ఇంటికి 'భాగవతుల ఇల్లు' అని పేరు. చాలా తాటాకు పత్రాలను చదివేవారు. ఆయనే నాకు గురువు. మా ఊళ్ళో ఒకే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనే ఇంగ్లిష్ బడికి అయ్యవారు. నేను చదువుకునేందుకు ఆయన దగ్గరకు వెళ్ళేవాణ్ణి. ఆయన అనేవారు. "నీ లాంటి వాళ్ళంతా ఇంగ్లిష్ ఎందుకురా చదువుకోవడం? అది ఉద్యోగానికి ఉపయోగపడే చదువురా. అందరూ ఉద్యోగానికి వెళ్ళకూడదురా. నువ్వు మీ నాన్న దగ్గరే తెలుగు నేర్చుకోరా" అని అనేవారు. ఆ మాటలు ఎంత సరియైనవో పోనుపోను తెలిసి వచ్చింది. అన్నీ అంతేరా కన్నా. చెప్పాల్సిన సమయంలో చెప్పేయాలి; అర్థమయ్యేటప్పుడు అర్థమవుతుంది. అలాగేరా కన్నా నేను నీతో ఏమేమో చెబుతున్నాను. నీకు అర్థమవుతోందా కన్నా? "

"ఓ యస్. అర్థమవుతోంది పప్పా. మీ నాన్న మిమ్మల్ని ఎందుకు కొట్టేవారు? "

"తెలియదు కన్నా ఒకవేళ అదీ ఒక ఆశేమో" అంటూ దేన్నో ఊహించుకొని నవ్వాక చెప్పిన విషయాన్ని మళ్ళీ చెప్పారు. "ఔను అవన్నీ ఆశలే. నీమీద నాకెంతో ఆశ ఉంది. అయినా నేను నిన్ను కొట్టను. ఎందుకో చెప్పు? "

"నువ్వు కొడితే నేను ఏడుస్తాను"

"నువ్వు ఏడిస్తే నేను ఏం చేస్తాను? "

"నేను ఏడిస్తే నువ్వూ ఏడుస్తావు"

"కానీ మానాన్న ఏడవరు. ఆయనకు పదే పదే కోపం వచ్చేసేది. కోపం వచ్చిన వాళ్ళంతా ఆశపడ్డవాళ్ళను కష్టపెడతారు. నాకు కోపమే రాదు కన్నా. అది సరే సాయంత్రం నువ్వు ఆడుకున్నావా? "

"ఎవరితో ఆడుకున్నావు? ఏం ఆట ఆడావు? "

"జానీ ఓ బంతి పట్టుకొచ్చాడు. పెద్ద బంతి పప్పా. మేమంతా గ్రౌండ్‌లో దాంతో ఆడుకున్నాం. అప్పుడే నువ్వొచ్చావ్. నేను వెంటనే పరుగెత్తుకుని వచ్చేశాను"

"నువ్వు స్కూలుకు ఎప్పుడు వెళతావు? "

"పప్పా, స్కూలుకు మాత్రం నేను వెళ్ళను, పప్పా! నాకు ఉద్యోగం ఏదీ వద్దు"

పప్పా మళ్ళీ నవ్వాడు: "నీకు కష్టంగా ఉంటే వెళ్ళొద్దు కన్నా... నీకు కష్టమైన పని ఏదైనా నువ్వు చెయ్యవద్దు. నువ్వు ఆడుకో; సంతోషంగా ఉండు... నేను ప్రాణాలతో ఉండేంతవరకూ ఓ పూట భోజనానికి కూడా నువ్వేమీ చెయ్యవద్దు. అటు తర్వాత కూడా నువ్వేమీ కష్టపడవద్దు. అన్నింటికీ భగవంతుడు ఓదారి చూపుతాడు. మనల్ని మనమే కష్టపెట్టుకునే కార్యాలకు భగవంతుడు కూడా ఏమీ చెయ్యలేడు. నీకు అర్థమవుతోందా కన్నా? "

"ఓ! భగవంతుడంటే God కదూ? God అంటే ఎవరు పప్పా? "

"కన్నా! నాకు భగవంతుడు నువ్వేరా... ఎలా, ఎందుకనీ అంటూ అడిగితే జవాబు

చెప్పలేను..."

"నీకు నేను God అయితే, నాకు God ఎవరు పప్పా? "

"నేను నిన్ను చూసినట్టు నీకూ ఎప్పుడైనా ఎవరైనా కనిపిస్తారు. అప్పుడు నీవుగా తెలుసుకుంటావు కన్నా" అప్పుడు మమ్మీ దగ్గరికి వచ్చేది.

హెన్రీ ఇద్దరినీ చూసి మమ్మీతో ఇంగ్లీష్‌లో చెప్పాడు.

"మమ్మీ.... మేమిప్పుడు భగవంతుడి గురించి మాట్లాడుకుంటున్నాం. నేను ఆయనకు భగవంతుణ్ణి పప్పా అంటున్నాడు నీకెవరు మమ్మీ భగవంతుడు? "

"నా భగవంతుడు లార్డ్ జీసస్ క్రీస్తు" అంటూ భుజాలపై శిలువ మార్కు వేసుకుంది.

హెన్రీ కనుబొమలు పైకి లేపి ఆశ్చర్యంగా గోడకు వేలాడే క్రీస్తు పటాన్ని చూస్తూ ఉండిపోయాడు.

"నాకెవరు భగవంతుడో చెప్పనా? "

"చెప్పు సన్నీ!"

"పప్పా అండ్ మమ్మా..." అంటూ ఇద్దరినీ రెండు చేతుల్తో కౌగిలించుకుని "నాకు దేవుళ్ళు" అనగానే, మమ్మీ వంగి హెన్రీ నుదిటిపై ముద్దుపెట్టింది.

పప్పా మమ్మీతో తెలుగులో మాట్లాడుతున్నప్పుడు చాలా మర్యాదగా మాట్లాడేవారు. మమ్మీ బర్మాలో ఉండేది. హెన్రీ మాట్లాడే తెలుగు ఆమె ద్వారా నేర్చుకున్నదే.

"ఇవన్నీ బాగానే ఉన్నాయి. స్కూలుకు మాత్రం వెళ్ళనంటున్నావే? నన్నూ, మీ పప్పాను తర్వాత కాపాడేవాళ్ళెవరు? నువ్వు బాగా చదివి, పెద్ద ఉద్యోగంలో చేరి, గొప్ప వ్యక్తిగా అయితే బావుంటుంది"అంది మమ్మీ?

పప్పా హెన్రీ ఒకరినొకరు చూసుకుని నవ్వుకున్నారు.

"బడికి వెళ్లాలనీ, బాగా చదువుకోవాలనీ మీరు పదేపదే వాడికి చెప్పండి! కానీ వాణ్ణి బలవంతంగా లాక్కెళ్ళి బళ్ళో వెయ్యకండి.

## పదోది నేను కట్టిస్తా

గిరీశం లాంటి ఓ బతక నేర్చిన పెద్దమనిషి పది అంతస్తుల గోపురం ఒకటి కట్టిస్తున్నానని చెప్పి విరాళాల పేరిట జనం సొమ్ము నొక్కేయడం మొదలెట్టాడు. దేవుడి పని కదా అని చాలామంది కాదనలేక వందలు, వేలు ఆయన చేతిలో పోయసాగారు.

ఒక రోజున అతను ఓ వ్యాపారి దగ్గరకు వెళ్లి చందా అడిగాడు. వ్యాపారి అతనికంటే తెలివైన ఘటం కావడంతో ఆ పెద్దమనిషితో-




'గోపురం కట్టిస్తున్నారా? భేష్.. ఇలాంటి పుణ్యకార్యాలకు వందలు, వేలు ఇస్తే ఏం బావుంటుంది? ఎలాగో పది అంతస్తులు కట్టించాలని అనుకుంటున్నారు కదా? తొమ్మిది కట్టించి నాకు కబురెట్టండి... ఆ వెంటనే పదో అంతస్తు నేను కట్టించేస్తా..' అని వెళ్లిరమ్మన్నట్లు నమస్కారం పడేశాడు.

పాపం మన గిరీశం 'డామిట్ కథ అడ్డం తిరిగింది' అని మళ్లీ అనుకుని చక్కా జారుకున్నాడు.

ఏడుస్తూ భయపడుతూ చదివే చదువు వాడికి వద్దు" అన్నాడు పప్పా

"అయితే భవిష్యత్తులో వాడేం చెయ్యాలనీ...? "

"భవిష్యత్తులో ఎవరు ఏం చేస్తారని ఎవరికి తెలుసు? నేను తుపాకి చేతబట్టి యుద్ధం చేస్తానని ఎప్పుడైనా అనుకున్నానా? అయ్యో! ఈ చేతుల్తో ఎందరిని కాల్చి చంపి ఉంటాను? ఇప్పుడు అదే చేత్తో రైల్ ఇంజన్లో బొగ్గు లెత్తి వేస్తున్నాను. నా చిన్నప్పటి జీవితానికి

దీనికి ఏద్దైనా సంబంధం ఉందంటారా? ఓ చెట్టుకు రక్షణ కల్పించటమూ, నీళ్ళు పోయటమూ అంతవరకే మన పని. అందులో ఏం కాయాలో, ఎలా కాయాలో మన నిర్ణయం కాదు"

పప్పా అలాగే మాట్లాడుతారు. అందుకే పప్పా మాటలు మమ్మాకు "స్క్రిప్చర్"లా ఉంటుంది. వాళ్ళిద్దరూ మాట్లాడ్డం మొదలు పెడితే హెన్రీ మౌనమైపోతాడు. కొన్ని సందర్భాల్లో మమ్మా ఇంగ్లీష్‌లోనే మాట్లాడుతూ ఉంటుంది. పప్పా తెలుగులోనే మాట్లాడే వారు.

"నిజంగా మీకు వాడి భవిష్యత్తుపై దిగులు లేదా, డియర్? "

"లేదు, వాడి గురించి దిగులు పడాల్సిన అవసరం లేదు. నాకు వాడే ఒక వరప్రసాదం"

"You mean-Boon?"

"అంటే? "

"భగవంతుడి యొక్క..."

"ఔను. భగవంతుడి యొక్క వరాన్ని కూడా మనమే కాపాడాలి. కానీ, దిగులు పడాల్సిన అవసరం లేదు. అయితే మీ గురించి నాకు చాలా దిగులుంది. చెబితే బాధపడరుగా? నాకన్నా ముందు మీరు చనిపోతే నాకు ఆ దిగులు లేదు. మైఖేల్ మాత్రం ఉండుంటే..." పప్పా కళ్ళు నీళ్లతో నిండిపోయి ఏడుస్తున్నట్లుగా ఉంది. మమ్మా ఆయనను సమీపించి ఆయన కన్నీళ్లు తుడిచి, "యెహోవా మనల్ని ఆశీర్వదిస్తారు" అంటూ ఆయన ముందున్న సారా గ్లాసును ఆయన చేతికి ఇచ్చి తాగించింది.

పప్పా అప్పుడు మైఖేల్‌ను గుర్తుచేసుకున్నారు. ఆయన కళ్ళూ, ముఖమూ ఎర్రబారున్నాయి.

"ఇరవై మైళ్ళు ఆయనను భుజంపై మోసుకొని నడిచానే... అందుకైనా ఇంకోరోజు ఆయన బతికి ఉండకూడదూ? ! అందుకే నేను ఆయనను మోసుకుంటూ వచ్చానే. అది వృధానా? అలా నేను అనుకోవచ్చా? మిలట్రీ ధర్మం ఏమిటో తెలుసా? కాపాడలేమన్న నమ్మకం కలిగితే వాళ్ళను కష్టపడి మోయటం వృధా! వాళ్ళు మరింత కష్టపడుతూ చనిపోకుండా ఓ బుల్లెట్‌ను ఖర్చు చెయ్యవచ్చు. మైఖేల్ కూడా, 'ప్లీజ్ కిల్ మీ' అని వేడుకున్నాడు. నాకేమో ఆయన బతుకుతాడన్న



నమ్మకం ఉంది. నేను ఇరవై మైళ్ళు నా నమ్మకాన్ని మోస్తూ నడిచాను" అని ఎన్నో సంవత్సరాల క్రితం చనిపోయిన మైఖేల్‌ను గుర్తుచేసుకుంటూ ఆయన ఇప్పుడు ఏడవటం

మమ్మీకే ఆశ్చర్యంగా అనిపించింది.

"మైఖేల్ ఎందుకు చనిపోయారు? యుద్ధంలో ఎందరో చనిపోయారే... ఎందు కోసం...? నేను నా చేతులతో ఎందరినో కాల్చి చంపానే. ఎందు కోసం...? సైన్యంలో నేను చేరకపోయుంటే మైఖేల్‌ను కలుసుకొని ఉండేవాణ్ణి కాను కన్నా! నువ్వూ నాకు దొరికేవాడివి కావు"

ఆ రోజే మొదటిసారి హెన్రీ ఆ విష యాన్ని విన్నాడు.

* * *

పప్పా ఉదయాన్నే లేచి డ్యూటీకి వెళ్ళే వారు. మమ్మా ఆయన కన్నా ముందే లేచేది. హెన్రీ వాళ్ళతోపాటే లేచేవాడు. పప్పా హెన్రీకి ముద్దుపెట్టి పనికి వెళ్ళేవారు. పప్పా వెళ్ళాక హెన్రీతోపాటు మమ్మా కూడా పడు కుండిపోయేది. హెన్రీని నిద్రపుచ్చాక, కాస్త తెల్లారాక లేచి ఇంటి పనుల్లో మునిగిపో యేది.

మమ్మా ఉన్నంతవరకూ ఇలాగే కాలం గడిచిపోయింది. హెన్రీ యువకుడిలా పెరిగాక కూడా జీవితంలో పెద్దగా మార్పు లేవీ జరగలేదు. పప్పా మనసు విప్పి చెప్పేవాడు, "భగవంతుడా! నాకు కొత్తగా ఏమీవద్దు. ఉన్న దంతా ఇలాగే కొనసాగితే చాలు..."

మమ్మా చాలా వృద్ధురాలై పోయింది. తలవెంట్రుకలన్నీ తెల్లబడిపోయాయి. కానీ ఇప్పుడూ ఆమెలో అదే పసిపా పాయి నవ్వు. ఆమెకు రక్తహీ నత ఉంది. అప్పుడప్పుడూ తల తిరగటం జరిగేది. ఆమెకు అన్ని పనుల్లోనూ హెన్రీ సాయం చేసే వాడు. కొన్ని సమయా లలో ఆమెను కూర్చోపెట్టి హెన్రీనే వంట చేసేవాడు, గుడ్డలు ఉతికేవాడు. మమ్మాకు భోజనం పెట్టే వాడు. పప్పా ఉదయాన్నే డ్యూటీకి వెళ్ళాలంటే ముందే లేచి పనులన్నీ చేసే బాధ్యత ఇప్పుడు హెన్రీదే.

ఓరోజు మమ్మా పప్పాతో చాలా సంతో షంగా అంది. "మీరు ఆశించినట్టు, మీ కోరిక మేరకు నేను మీకన్నా ముందే వెళ్ళిపోతాను"

"మమ్మా!" కొన్ని సమయాలలో పప్పా

కూడా మమ్మాను మమ్మా అని పిలుస్తారు.

పప్పా తన జీవితం గురించి ఎన్నో విషయాలను హెన్రీకి ఇదివరకే చెప్పారు. ఆరోజు పప్పా, హెన్రీ ఇద్దరూ ఊరు చుట్టిరావటానికి వెళ్ళారు. సెలవురోజులలో మమ్మాతో ముగ్గురూ బయటికెళ్ళేవారు. మమ్మాకు కొన్ని సందర్భాలలో వీలయ్యేది కాదు. మనసులో ఆశవున్నా శరీరం అలసిపోయేది. దాన్ని అర్థం చేసుకుని కొన్ని సమయాలలో బయటకెళ్ళే కార్యక్రమాలను పప్పా వాయిదా వేసేవారు. అది ఆమెకెంతో బాధాకరంగా ఉండేది. అందుకే తానుగా హెన్రీతో పప్పాను బయటకి పంపేది. వెళుతున్నప్పుడు మమ్మా ద్వారం దగ్గర నిలబడి చూసేది. హెన్రీ పెద్దవాడిగా ఎదగటాన్ని చూసి సంతోష పడుతూనే కన్నీళ్ళ పర్యంతమయ్యేది.

అలా ఒకరోజు బయటికెళ్ళినప్పుడు హెన్రీ పార్క్‌లో గడ్డిమీద పడుకుని ఉన్నప్పుడు పప్పా వాడికెదురుగా మోకాళ్ళ చుట్టూ చేతులు వేసుకుని మమ్మా గురించి చెప్పారు.

"కన్నా"

అప్పుడు ఎక్కడినుండో చర్చి గంటలు మోగుతున్న శబ్దం వినిపించింది. ఆ శబ్దంతో పాటు ఆయన మైఖేల్‌ను పవిత్రంగా భావిస్తూ చెప్పారు.

"మైఖేల్, నేనూ స్నేహితులు కావటానికి కారణమేమిటంటే మేమిద్దరమూ ఒకే ఊరివాళ్ళమని ఇతరులు చెప్పటమే! మనం, దూరంగా ఎక్కడికైనా మన దేశాన్ని వదిలి వెళితే, మన ఊళ్ళో ఉన్నప్పుడు మనలో ఉన్న దూరం అంతా తగ్గిపోతుంది కన్నా. మైఖేల్‌ది బెంగుళూరు. నాది దేశంలో ఓ కుగ్రామం. మైఖేల్‌కు కొద్దిగా తెలుగు తెలుసు. అంతే మా మధ్యలో ఉన్న సామ్యం. ఆయన పేకాట ఆడేవాడు. కానీ ఎక్కువ తాగేవాడు కాదు. నేను తాగేవాణ్ణి. ఎప్పుడూ తాగేవాణ్ణి. ఆ విషయంలో ఆయన నన్ను ఖండించేవాడు. నీతులు చెప్పేవాడు. నేను ఎక్కువగా తాగకూడదని నాతోపాటు వచ్చి ఆయనా తాగేవాడు. ఆయన పేకాట ఆడుతున్నప్పుడు నన్ను పక్కన కూర్చోమని చెప్పేవాడు. అప్పుడే ఆయనకు అదృష్టమట. ఆయనకు అలాంటి నమ్మకాలన్నీ ఎక్కువే. మెడలో శిలువ వేసుకుని ఉండేవాడు. ఆదివారం చర్చికు వెళ్ళేవాడు. ఓరోజు నన్నూ పిలిచాడు, వెళ్ళాను. అక్కడే నేను మీ మమ్మాను మొట్టమొదటసారి చూశాను. ఆయన మొదట ఎప్పుడు చూశాడో నాకు తెలియదు. మైఖేల్ మీ మమ్మాను నాకు పరిచయం చేశారు. "Meet Misses Michaeal" అన్నాడు. నాకు ఒళ్ళు జలదరించింది. ఆ విషయాన్ని నాకాయన అప్పటివరకూ చెప్పనేలేదు"

బర్మాకు మేమిద్దరమూ ఒకే రెజిమెంట్‌లో వచ్చాం. వచ్చి ఇంకా ఒక సంవత్సరం కూడా కాలేదు. అంతలోనే ఏమేమో జరిగిపోయాయి. ఆ రోజు ఆయనతోపాటు నేనూ మీ మమ్మా ఇంటికి వెళ్ళాను. అప్పుడు మమ్మా వాళ్ళ పప్పా మాత్రమే ఉన్నారు. మమ్మాకు అమ్మ లేదు. పప్పా ఒక లాండ్రీ నడిపేవారు. ఆయన నాకు బాగా తెలుసు. మనసున్న మనిషి. బాంబులు పడ్డప్పుడు చనిపోయారు. శవాన్ని నేను చూళ్ళేదు. ఆ రోజు భోజనాలయ్యాక చీకటిపడ్డాక- క్యాంప్‌కు తిరిగొస్తున్నప్పుడు మైఖేల్ నాకు అన్ని విషయాలూ చెప్పారు. వాళ్ళిద్దరూ ఎలా కలుసుకున్నారు- ఎలా మెలిగారు- ఆయన వాళ్ల పప్పాను కలుసుకుని మాట్లాడ్డం- చర్చిలో పెళ్ళి చేసుకోవటం- అన్నీ చెప్పారు మైఖేల్"

"ఈ విషయాన్నెందుకు మీరు 'క్యాంప్'లో చెప్పలేదు? " అని అడిగాను. మైఖేల్ అందుకు ఏవేవో కారణాలు చెప్పారు. నాకవన్నీ సరియైనవిగా అనిపించలేదు. నేను అందరితోనూ ఈ విషయాన్ని చెప్పేశాను. ఇంకేముంది? ఆ రాత్రంతా ఒకటే సందడే సందడి. ఆటలూ, పాటలూ!... ఓహ్...!!"

"అటు తర్వాత రెండు మూడుసార్లు మైఖేల్‌తో కలసి మీ మమ్మాను చూడ్డానికి నేను వెళ్ళాను. అప్పుడు మమ్మా మాత్రం ఒంటరి

గా ఉండేది. వాళ్ళింట్లో ఉన్నప్పుడే, సైరన్ శబ్దం వినిపించింది. వెంటనే క్యాంప్‌కు పరుగెత్తుకు వెళ్ళాం. బాంబులు పడి ఊరు ఊరంతా ధ్వంసమైంది. అంతటా కలకలం. జపాన్ వాళ్ళు రంగూన్‌ను కైవసం చేసుకున్నారు... ఓ! భగవంతుడా... ఇంతలో ఎంత వినాశం...!"

"అందరం ఇండియాకు పరుగెత్తుకు వచ్చేశాం. మైఖేల్‌కు ఒళ్ళంతా గాయాలు. ఆయనను నేను భుజంమీదకు ఎత్తుకున్నాను. మమ్మా కూడా ఓ పెద్ద మూటను తల మీదకి ఎత్తుకున్నారు. మాలాగ ఎందరో... రైలు, గూడ్సు బండి, బండ్లు, కాలినడకన... ఎలాగైనా ప్రాణాలు దక్కించుకుంటే చాలు అనుకుంటూ పరుగులు తీస్తున్నపుడు మనిషన్నవాడు ఎంతో మంచివాడుగా, హృదయమున్నవాడిగా అగుపించాడో తెలుసా? ..."

"వస్తున్నప్పుడు కన్నా, రైల్వేస్టేషన్లో నేను, మమ్మా, మైఖేల్ ముగ్గురం రైలు కోసం కాచుకుని ఉన్నాం... ఎన్నో రోజులు రైల్వేస్టేషన్లోనే గడిపాం. ఒకరోజు రైలు వచ్చింది. 'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకున్నాం. అంతే... మళ్లీ బాంబులు పడ్డాయి. అందరూ రైలును వదలిపెట్టి పొలాల్లోకి, గుంతల్లో పడుతూ లేస్తూ పరుగులు పెడుతున్నారు. తేనెతుట్టెను కదిపితే అవి పరుగులు తీస్తాయి చూడూ అలా... అప్పుడే కన్నా.

ఓ రైల్ క్యారేజ్‌లో... గుడ్డలో చుట్టబడి నువ్వు పడున్నావ్... ఓరి భగవంతుడా... ఈ బాంబులూ, యుద్ధమూ, గెలుపోటములు నీకు సంబంధం లేని విషయం! దేవుడి ఒళ్ళోని వెచ్చదనంతో, ఏడ్వకుండా, ఆ బాంబుల శబ్దంలో, స్మశానభూమిలో, నలువైపులా శవాల గుట్టలు-వాటి మధ్య నువ్వున్నావు కన్నా. నేను వీపుపై మైఖేల్‌ను మోస్తున్నాను. కానీ నేనే నిన్ను చూసి నీకు ప్రాణాలు ఉండటం గమనించి మీ మమ్మాతో చెప్పాను. మీ మమ్మా తలమీద ఉన్న మూటను కిందపడేసి పరుగెత్తుకెళ్లి నిన్ను ఎత్తుకుంది కన్నా. కన్నా అప్పుడు కూడా నిన్ను మేము తీసుకెళ్లాలని నాకో, మీ మమ్మాకో కోరిక కలగలేదు. అయితే మేము 'ఈ బిడ్డ ఎవరిదీ... ఎవరిదీ' అని ఎందరినో అడిగాం. ఎంతో వెదికాం. నువ్వు ఎవరి బిడ్డవీ కావు. తర్వాత మేము ఎవరిని అడగలేదు. నిన్ను నేను అప్పుడు 'కన్నా' అని పిలిచాను మొదటిసారి.

హెన్రీ నేల మీద చక్కగా పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. కథ వాడికి మిక్కిలి రసవత్తరంగా అనిపించింది. పప్పా ఎవరి గురించో చెబుతున్నట్టే వాడికి అనిపించింది.

"పప్పా- ఇదంతా నాకు కొద్దికొద్దిగా తెలుసు. ఇప్పుడే ఇంత విడమరిచి చెబుతున్నారు. It is Quite thrilling" అన్నాడు హెన్రీ. ఈ మధ్యే కొంతకాలంగా పప్పాను "మీరు" అని పిలవటం మొదలుపెట్టాడు హెన్రీ.

"నీకు పుట్టిన రోజు జరుపుతున్నామే, అది ఆ తేదీనే కన్నా. నువ్వెప్పుడు పుట్టావో ఎవరికీ తెలియదు" అని చెప్పి ఆ అనాథ శిశువు ఇవ్వాళ ఇంత పెద్దవాడిగా, తన కొడుకుగా పెరుగుతున్నాడనే ఆశ్చర్యంలో వాణ్ణి చూడసాగాడు పప్పా.

"ఏంటి పప్పా? "

"ఏం లేదు కన్నా... మైఖేల్ ఆ పరిస్థితిలో కూడా నిన్ను ముద్దాడారు. మేం ఇండియాకు తిరిగొచ్చి నువ్వు, నేను, మమ్మా, మైఖేల్ నలుగురం ఓ కుటుంబంగా జీవించాలనే వచ్చాం. కానీ మైఖేల్ దారిలోనే చనిపోయారు. ఒకటే వర్షం. ఏ ఊరో తెలియని ప్రదేశం. మనలాగా చాలామంది అక్కడ ఓ పాడుబడ్డ

> బాంబులు పడి ఊరు ఊరంతా ధ్వంసమైంది. అంతటా కలకలం. జపాన్ వాళ్ళు రంగూన్‌ను కైవసం చేసుకున్నారు... ఓ! భగవంతుడా ఇంతలో ఎంత వినాశం...!"

# చతుర భాషితాలు

పాదాల కారణంగా పక్షులు చిక్కుల్లో పడితే మనుషులు నాలుక కారణంగా చిక్కుల్లో పడతారు.
—థామస్ పుల్లర్

విద్యను పొందడం సులభమే. కానీ వివేకం పొందడం కష్టతరమయిన కార్యం.
—సామెత

మార్పు అనేది జీవితానికి రుచినిచ్చే మసాలా లాంటిది.
—కౌపర్

ఉన్నతభావాలు తోడుగా ఉన్నవారికి ఒంటరితనమంటూ లేదు.
—సిడ్నీ

తల్లి ఆసరా కాదు. ఆసరా ఆవశ్యకత లేకుండ చేసేదే మాతృమూర్తి.
— డరోతి ఫిషర్

ప్రయాణానికి కాలం విలువ తెలియదు. కాలానికి ప్రయాణం విలువ తెలియదు.
— ఫ్రెంచి సామెత

జీవితమనే గాఢాంధకార గుహలో ఆమరణ శిక్షను అనుభవిస్తున్న వారే అందరూ.
—సిరిల్ కానరీ

వివేకం ఉంటే చాలదు, భక్తిశ్రద్ధలతో కూడిన నిరంతర కృషి అవసరం.
— డా. రాజేంద్రప్రసాద్

మనిషి జీవితంలో ఆనందం, మనోవికారాలు లేకపోవడం కంటే వాటిని అదుపులో పెట్టుకోవడంలోనే ఉంది.
— అల్‌ఫ్రెడ్ టెన్నిసన్

నిజం కానిది నిజంగా గొప్పది కాదు.
— జాన్సన్

రాత్రివేళ సూర్యుడు కనబడటం లేదని కన్నీరు పెట్టుకునేవాడు నక్షత్ర సౌందర్యానికి అంధుడవుతాడు.
— ఠాగూర్

అభిలషించేది అనుభవించడం కాదు, ఉన్నది ఆకాంక్షించడమే ఆనందం.
— సామెత

శాస్త్రజ్ఞులు అణువును విభజిస్తే, ఇప్పుడు అణువులు మననే విభజిస్తున్నాయి.
— క్వెంటి రౌనాల్డ్స్

నిశ్శబ్దం తర్వాత నిర్దేశించలేని సన్నిహిత భావ ప్రకాశమే గానం
— ఆల్డస్ హక్స్లే

మౌనమనే మూలద్రవ్యంలో మహాద్భుతాలు అవే ఏర్పడుతాయి.
— కార్లైల్

ఇంట్లో తలదాచుకున్నారు. మేమూ వెళ్లి అక్కడ సర్దుకున్నాం. భాష, జాతి, దేశం ఇవన్నీ ఎంత అల్పమైనవో తెలిసొచ్చింది. ఆప్యాయతలే కన్నా ముఖ్యం. అక్కడున్న అందరూ నీ పట్ల ఎంత ఆప్యాయతగా ఉండే వారనీ! అప్పుడే మైఖేల్ చనిపోయారు. 'థెరిసాను బాగా చూసుకో,ఆమెకు సాయం చెయ్. ఆమె ఇష్టపడితే మీరిద్దరూ ఒకటిగా కలిసి జీవించేలా భగవంతుడు ఆశీర్వదిస్తాడు' అని మా ఇద్దరి చేతుల్నీ కలిపారు మైఖేల్. కన్నా అప్పుడు నేను బిగ్గరగా ఏడ్చేశాను. ఆయన చనిపోయినందుకే నేను ఏడుస్తున్నానని మమ్మా కూడా అనుకుంది. లేదు కన్నా! మీ మమ్మా నేనూ కలిసి బతకాలని ఆయన ఆశ పడ్డం నా మనసుకు అదోలా అనిపించింది కన్నా. ఇందులో ఏడ్చేందుకు ఏముందని ఇప్పుడు నాకూ అనిపిస్తోంది. కానీ కన్నా... నాకో కథ ఉందే, అది తెలిస్తే, నేనెందుకు ఏడ్చానో తెలుస్తుంది. మీ మమ్మాకు కూడా అవన్నీ తెలియదు. నేను చెప్పలేదు"

"మైఖేల్ చనిపోయాక నేను వెళ్లి ఒంటరిగా కూర్చొని చాలాసేపు ఆలోచించాను. ఒక రోజంతా ఒంటరిగానే కూర్చుండిపోయాను. నిన్ను కూడా చూళ్లేదు. మీ మమ్మా ఒళ్లో నిన్ను పడుకోబెట్టుకుని నా పక్కన కూర్చుంది... నా మీద ఓ భారాన్ని తీసుకొచ్చి పడేశారు. నేను ఆమెకేసి చూశాను. మీ మమ్మా ఏడవనే ఏడవదు. ఆమె మనసు అప్పటికే ఓ స్థితికి వచ్చేసింది. ఆమె ఓ గొప్ప మేధావి. నేను ఎప్పుడూ ఏదో మాట్లాడేవాణ్ణి. ఆమెకు అన్నీ తెలుసు. అందుకే ఎక్కువ మాట్లాడరు. ఓ తల్లిలా నన్ను చూసి చేతులు చాపారు. నేను ఆమె చేతులు పట్టుకుని పసిపిల్లాడిలా ఏడ్వటం మొదలెట్టాను.ఆమె చేతుల్లో ముఖాన్ని దాచుకుని ఏడ్చాను. మమ్మా నిన్ను నీ వీపుమీద తడుతుండే ఆ మాదిరిగా నన్ను తట్టి సముదాయించింది"

"Why did you cry pappa?" అని అడుగుతూ లేచి నిలబడ్డ హెన్రీ, బట్టలకు అంటుకుని ఉన్న గడ్డిని దులుపుకున్నాడు. పప్పా తన పాత జ్ఞాపకాలతో లేచి నిలబడ్డాడు. కళ్లు మాత్రం ప్రస్తుత పరిస్థితులను చూస్తున్నాయి.

ఇద్దరూ నడవసాగారు. "నీకు నేను ఇంకా ఎంతో చెప్పాలి కన్నా..." అని ఇతనితో ఎలా చెప్పేది? అని వెనకాడాడు. మాటల కోసం తడబడ్డాడు. వాణ్ణి చూసి ఆయన కాస్త సిగ్గుపడ్డట్టు నవ్వారు.

పప్పా అలవాటుగా వెళ్లే సారా కొట్లోకి నడిచారు ఇద్దరూ. అక్కడ ఆయనకంటూ ప్రత్యేకమైన గది. ప్రత్యేకమైన మర్యాద ఉన్నాయి. హెన్రీని ఎదురుగా కూర్చోబెట్టుకుని మాట్లాడుతూ ఆయన తాగుతారు. హెన్రీ టేబుల్ మీద చేతులుంచుకుని ఆయన తాగటాన్ని వేడుకగా చూస్తూ ఆయన చెప్పే విషయాలను వినేవాడు. ఆయన కొన్ని సందర్భాలలో కన్నీళ్లు పెట్టుకుని ఏడ్చేవారు. అప్పుడు తన చోటునుంచి లేచి వచ్చి ఆయన పక్కన నిలబడో, కూర్చునో ఆయన కన్నీళ్లను తుడిచి "పప్పా డోంట్ క్రై పప్పా" అని ఓదార్చేవాడు హెన్రీ.

"నువ్విప్పుడు పెద్దవాడివైపోయావు. నేను అనుకున్నదానికన్నా నువ్వు మంచి వాడివిగానూ, గొప్ప వాడివిగానూ ఎదిగావు..."

"థాంక్యూ పప్పా!"

"నువ్వు స్కూలుకు వెళ్లలేదు, చదువుకోలేదు. ఉద్యోగం లేదని నాకు దిగులులేదు కన్నా, కానీ నీకు కొన్ని విషయాలు చెప్పాలి. ఆ విషయమై నేను ఓ లాయర్ని కూడా కలవాలి. నువ్వు నా 'కొడుకన్న విషయాన్ని' లీగల్‌గా మార్చాలి. అందుకేమైనా పద్ధతులున్నాయో ఏమో తెలియటం లేదు. ఉంటే అలాగే చెయ్యాలి. ముప్పై ఏళ్లకు ముందు మన ఇంటికి తాళం వేసి వచ్చేశానంతే. అదేమైందో నాకు దిగులు లేదు. నీకు కథ చెప్పాలి కాబట్టి చెపుతున్నాను. ఏదో కాస్త పొలం, ఓ కొబ్బరితోటా, ఓ దుకాణం, ఇల్లూ - ఇప్పుడు అంతా కలిపి పది లక్షలకు పైగానే చేస్తుంది ఆస్తి. ఆ రికార్డులన్నీ నా

దగ్గర భద్రంగా దాచాను కన్నా..." అని చెప్పి నవ్వారు పప్పా.

"ఓ రోజు ఆ రికార్డులన్నీ నీ చేతికి ఇస్తాను. ఊరికే ఉంచుకో. అది నీకే సొంతం. అందుకే నీకిస్తాను. అవన్నీ నేనే సంపాదించిన ఆస్తి కన్నా. మా నాన్న నాకేమీ మిగల్చలేదు. ఒట్టి అప్పులు మాత్రమే మిగిల్చారు. ఆ అప్పులన్నీ నేనే తీర్చాను. ఆ ఆస్తులన్నీ కొన్నాను. నా తమ్ముడొకడు ఉండేవాడు. ఇప్పుడూ ఉన్నాడేమో? ! ఉండాలి- దొరస్వామి అని వాడి పేరు. పెద్దగా చదువుకోలేదు. మొరటుగా, బలాదూరుగా తిరుగుతుండే వాడు. కుమారపురంలో మా తాత ఇంట్లోనే ఉండేవాడు"

"పప్పా- మీరెందుకు అక్కడికి వెళ్లటం లేదు? "

"మళ్లీ అక్కడికి వెళ్లకూడదని నిర్ణయించుకునే కన్నా నేను వచ్చేసింది. నేను వెళ్లనే వెళ్లను" అని అంటున్నపుడు ఆయన కన్నీళ్ళ పర్యంతమయ్యారు. అయినా ఆయన నవ్వారు. "పప్పా, ఆశ్చర్యంగా ఉంది. మీరు ఇంత మొండిగా ఉండగలరా? "

"ఇది మొండితనం కాదు కన్నా... నాకు ఎవరిమీదా అసహ్యమో, కోపమో,బాధో లేదు. నేను ఎవరినీ, దేన్నీ గుర్తు చేసుకుంటూ కుమిలిపోయిందీ లేదు. కన్నా. నా మనస్సు ఎలా ఉంటుందో నువ్వు అర్థం చేసుకుంటావని చెబుతున్నాను. 'మా నాన్నకు ఊళ్లో చాలా చెడ్డ పేరుందని చెప్పానుగా. ఆయన ముక్కోపి. అందరితోనూ తగవులు పెట్టుకునేవాడు. నాకేమో ఆయన ఉండగానే మర్యాదలు జరిగేవి. ద్రౌపదమ్మ గుళ్లో పది రోజులపాటు గొప్పగా ఉత్సవాలు జరిగేవి. చుట్టుప్రక్కల గ్రామాల నుండి ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు. అగ్నిగుండంలో నిప్పు తొక్కేవారు. వీధి నాటకాలు వేసేవాళ్లు. 'గరగ ఆటలు ఆడేవారు. అవన్నీ తలచుకుంటే ఇప్పటికీ ఆ శబ్దాలు నా చెవిలో వినిపిస్తాయి. ఇప్పుడూ ఆ ఉత్సవాలు జరుగుతాయని అనుకుంటున్నాను. నాకు పెళ్లి కాకముందే నాన్న చనిపోయారు"

"What? Marriage! Your Marriage?...

"ఔను కన్నా, నాకూ ఒక పెళ్లి జరిగింది. ఆ ఊళ్లో అంత గొప్ప పెళ్లి అంతకు ముందు జరగలేదని చెప్పేవాళ్లు. నాలుగు రోజుల పెళ్లి... అప్పుడు నాకు పందొమ్మిదేళ్లు".

హెన్రీ పప్పాను పందొమ్మిదేళ్ల యువకుడిగా, పెళ్లి బట్టల్లో ఊహించుకుని సంతోషించాడు. ఆయన పక్కన ఒక స్త్రీ. ఆనాటి స్త్రీని అతడు ఊహించుకున్నాడు. ఆమె ముఖం కనిపించలేదు. పేరు తెలియదు. ఏమీ తెలియటం లేదు.

"అప్పుడు మీకు వయస్సు నైన్‌టీనా? "

"ఔను- ఆ మరుసటి సంవత్సరం మా అమ్మ చనిపోయింది"

"You like your Mummy?-"

"ఔను కన్నా. వాళ్లంతా పసిపిల్లల్లా జీవించి, వయసు మీదపడి, ముసలివాళ్లై వెళ్లిపోయారు. వాళ్లకు ప్రపంచం తెలియదు. నాగరికత తెలియదు. ఎలా మాట్లాడాలో కూడా తెలియదు. పక్షులూ, మృగాలూ ఎంతో ప్రేమగా, సంతోషంగా ఉంటాయి చూడు అలా బతికారు. సామాజిక చింతన, బుద్ధి- ఇవన్నీ తెలియవు. వాళ్ల జీవితాలు చాలా ప్రశాంతంగా అందంగా ఉండేవంటే అది ఒక అలవాటే కన్నా. మా అమ్మ నన్ను 'రాజా' అని పిలిచేది. తమ్ముణ్ణి 'దొరా' అని పిలిచేది. చాలా మంచిది మా అమ్మ"

"You love her?"

"ఔను కన్నా"

పప్పా దీర్ఘంగా నిశ్వసించారు. హెన్రీ కళ్లలోకి దీక్షగా చూశారు. అందులో ఏదో అమాయకత కనిపించింది ఆయనకు.

"ఆమె, నేనూ పదేళ్లు సంసారం చేశాం. నేనెంతో సంతోషంగా బతికాను. మాకు పిల్లల్లేరని ఊరంతా బాధపడ్డారు. పదేళ్ల తర్వాత మేము ద్రౌపదమ్మను వేడుకొని 'బాధ్యతను' స్వీకరించాము"

"అంటే? "

"అంటే-ఖర్చులన్నీ మనమే భరించి ఉత్స వాలు జరిపించటం అన్నమాట. ఊరంతా గంజిపోయటం, వీధినాటకాల వాళ్లను, గరగ ఆడేవాళ్లను రప్పించటం, మన ఆధ్వర్యంలో అన్ని కైంకర్యాలను జరిపించటం"

"అర్థమైంది పప్పా-"

"ఆ ఊళ్లో గోయిందని ఒక పల్లె మంగలి ఉండేవాడు. చిన్నప్పటి నుండీ వాడు నాకు తెలుసు. బాగా పాటలు పాడేవాడు. నాదస్వ రం వాయించేవాడు. వీధినాటకాల్లో వేషం కట్టేవాడు. ఆడవేషం వేసేవాడు. ద్రౌపది వేషం, ప్రహ్లాదుని కథలో అమ్మ వేషాలన్నీ వాడే వేసేవాడు. అడపం పెట్టెను పట్టుకొని అందరి ఇండ్లకూ వెళ్లి అరుగుమీద కూర్చొని క్షవరం చేసేవాడు. అతడు వెళ్లిపోయాక అరు గునంతా నీళ్లుపోసి కడిగి శుభ్రం చేసేవాళ్లు. అప్పుడంతా డబ్బా గిబ్బా అన్న ప్రసక్తే లేదు. అందరి ఇండ్లలోనూ నెలకింత 'ఒడ్లు' అని వాడికి ఇచ్చేవాళ్లు. మన ఇంటివాళ్లు వాడికి డబ్బు కూడా ఇచ్చేవాళ్లు. నన్ను చూస్తే పై గుడ్డను నడుముకు చుట్టుకునేవాడు. నోటి కడ్డుగా నాలుగు వేళ్లుంచుకునే మాట్లాడేవాడు. నాకు వాణ్ణి చూస్తే చాలా జాలి కలిగేది. ఆ రోజుల్లో ఎంత హీనంగా వాళ్లను చూసేవా ళ్లమో ఇప్పుడు అర్థమవుతోంది. క్షవరమంటే తల, గడ్డం మాత్రమే కాదు. సర్వాంగ క్షవరం చేసుకునేవాళ్లు"

"ఆ గోయిందు అంటే నాకు చాలా అభిమా నం. వాణ్ణి చూస్తే నాకు చాలా జాలి కలి గేది. మనింట్లో వాడికి కడుపు నిండుగా భోజనం పెట్టి ఖర్చుకు డ బ్బులిచ్చేవాణ్ణి. ఇంటి ముందు అరుగువారగా పడుకునేవాడు"

"కన్నా- ఒక రోజు భాగవతుల ఇంటి కోడలూ, వాడూ పారిపోయారు"

"Your wife and that Barber?"

"ఔను కన్నా"

"సో, దే వర్ ఇన్ లవ్? "

"దానికి అదే సరైన పేరురా కన్నా..."

"పప్పా, అందుకు మీరు బాధపడ్డారా? "

"ఔను కన్నా, చాలా బాధపడ్డాను. అది వెళ్లిపోయిందేనన్న బాధ లేదు. నేను మోస పోయాననే బాధ. వీధిలో నడిచివెళుతుంటే ఉన్న ట్టుండి ఒకడు ముఖం మాడ్చుకొని నన్ను చూసి కాండ్రించి ఉమ్మినట్టు..."

"ఇక మీదట నా కెవరూ లేరే. ఇకపై నాకెవరు కావాలి-? అందరూ నా గురించి ఏమేం మాట్లాడుకుంటారు? ఆఁ...ఆఁ ఆమె ఎంత ప్రేమగా ఉండేది. ఆమె ఈ పని ఎలా చేయగలిగింది? నేనేం తప్పు చేశాను!"

"కన్నా! నేనెప్పుడైనా గుడికెళ్లి కథ చెప్పే వాణ్ణి. మా నాన్న కూడా కథ చెప్పేవారు. అది భాగవతుల వంశ ఆనవాయితీ. సీత గురించీ, అరుంధతి గురించీ నేనెన్నో విష యాలు చెప్పేవాణ్ణి. ఆమె కూడా వచ్చి కూర్చు నేది. అప్పుడు నేను పదేపదే ఆమెనే చూసే వాణ్ణి. నా మనసులో నేనూ ఆమెను వాళ్లలా ఊహించుకునేవాణ్ణి"

"కన్నా! ఓసారి గుళ్ళో కథ చెప్పేసి వస్తు న్నప్పుడు పక్కింటాయన కనకరాజని పేరు... ఇప్పటికీ ఉంటాడు. నా కన్నా కాస్త చిన్న వాడు. నా భార్య కూడా నాతో వస్తోంది. అతడూ, అతడి భార్యతో ఏదో మాట్లా డుతూ మధ్యలో అడిగాడు. "మీరు చెబుతున్నప్పుడు, ఈ కథలన్నీ బాగానే ఉంటున్నాయి. కానీ నమ్మలేకుండా ఉన్నామే" అన్నాడు. 'దేన్ని' అని అడి గాను. "ఆ పురాణా లలో వచ్చే పతివ్ర తల్ని" అన్నాడు.



"వాళ్ళను నమ్మకపోతే పోయావ్, నీతో వస్తున్న నీ భార్యనైనా నమ్ము" అన్నాను. నేనన్న మాటలకు అందరూ నవ్వారు. రేపు అతడు- ఆ కనకరాజు నన్ను చూసి నవ్వు తాడే అని ఆలోచించాను. మా అమ్మ చనిపో యినపుడు ఏడ్చినట్లు నా భార్య వెళ్ళిపోయిన ప్పుడు ఏడ్చాను. తలచుకుంటే ఇప్పుడు నాకు నవ్వొస్తుంది కన్నా. అదంతా ఎలా జరిగిందో ఇప్పటికీ నాకు తెలియదు కన్నా, ఒకవేళ నేను తలచుకుంటే దాన్ని తప్పించి ఉండేవాణ్ణేమో?

కోడి కూయటానికి ముందే పనులు మొద లుపెట్టటానికి ఆమె లేచేది. నాకూ మెలకువ వచ్చేసేది. అయితే నేను పడుకునే ఉండే వాణ్ణి. కొన్ని సమయాల్లో మళ్ళీ నిద్రలోకి జారుకునేవాణ్ణి. కానీ ఆ రోజు నిద్రపోలేదు. ఆశ్చర్యంగా పెరడు తలుపు తెరిచే శబ్దం వినిపించింది. పెరడు తలు పంటే ఇంటికి వెనక చాలాదూరంలో ఉంది. తెల్లారాక పాలవాడి గొంతు విన్నాకే దాన్ని తీయటం మా ఇంటి అలవాటు. గడియ తీసే శబ్దం చాలా మెల్లగా కొద్దిగా వినబ డింది. నేను బాగా కళ్ళు తెరిచి చూశాను. పెరడంతా ఒకటే చీక టిగా ఉంది. నా మనసులో ఏదో భయం. లేచి వెళ్ళాను. పెరటి తలుపుకూ, బావికీ మధ్య నిలబడి వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. నాకు ఆమె కనిపిస్తోంది. వాడు కనిపించ లేదు. వసారాలో ఒకపెట్టె, ఒక మూట ఇవన్నీ తయారుగా ఉన్నాయి. వాడు పెట్టెను, మూటను తీసుకెళ్ళటానికి వచ్చా డు. నేను తలుపు వెనుక దాక్కున్నాను. అప్పుడే వాణ్ణి నేను చూశాను. ఒరేయ్... ఒరేయ్ గోయిందూ!...'

"సరే! ఇకపై నేనేం చెయ్యాలి! అని ఆలో చించాను. ఇప్పుడు ఆమె, అతడు ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని పరుగెత్తుతున్నారే- వాళ్లను నేనేమీ చెయ్యలేను. జరగకూడనిది జరిగింది. దాన్ని నేను అంగీకరించాలి. ఎలా? నేను అంటే ఎవరు? ఇక్కడ పరమాత్మ జీవాత్మ కథలన్నీ సరిపడవు. ఇక్కడ నేను అంటే ఈ భాగవతుల కుటుంబంలో, నాధ మునిగారి కొడుకైన శంకరయ్య, ఆయన కొడు కైన శివసుందరం, ఆయన కుమారుడైన విశ్వ నాథం అని అర్థం.

మా వంశం మానమర్యాదలు కాపాడవల సింది నేను. నాకు కలిగే అవమానం వాళ్ళ ప్రతిష్ఠను దిగజార్చేస్తుంది. ఈ ప్రపంచంలో అంతే కన్నా. పదేళ్ళుగా సంతానం లేదని నేనెంతగానో తపించాను. కానీ దుర్ల భమైన ఆ క్షణాన మాత్రం ఆ విషయంలో నేను ఎంతో సంతోషించాను. సరే! ఇకపై



నేనేం చెయ్యాలి? అదిగో వాళ్ళిద్దరూ లేచిపోతున్నారు. పెరటి తలుపును ఇంకా దాటిపోలేదు. అదిగో మూలన ఓ వేటకత్తి ఉంది. దాంతో వాళ్ళిద్దర్నీ నరికిపారేయ వచ్చు. అందువల్ల ఏం లాభం? గొంతెత్తితే ఊరు ఊరంతా పరుగెట్టుకు రారూ. ఇద్ద రినీ పట్టుకుని చెట్టుకు కట్టెయ్యవచ్చు. దాని వల్ల ఏం లాభం? నా భార్య లేచిపోతోం దని ఊరందర్నీ పిలవనా? 'ఒరేయ్. విశ్వ నాథం! అయితే నువ్వేం మగాడివి? అందు వల్ల మీ భాగవతుల వంశ గౌరవం హిమా లయాలంత ఎత్తుకు ఎదిగిపోతుందా? ఛీ ఛీ? మరోదారి చూడరా' అని నా మనసు చెప్పటం ఓ పక్క.

'మరేం చేద్దాం? నాదేం పోయింది' అని మిన్నకుండిపోదామా? నేను ఉండిపో వచ్చు. ఊరు ఊరుకుంటుందా? భాగవతు ల కోడలు కనిపించటంలేదన్న విషయం మొదట ఊరంతా తెలుస్తుంది. ఆపైన ఈ ఊరు మంగలి కూడా కనిపించటంలేదని తెలుస్తుంది. అది చాలదూ? ఏం చెయ్యాలో అర్థం కాలేదు నాకు. ఆ ఊళ్ళో ఇకమీదట నేనెలా బతకాలి? ఆత్మహత్య చేసుకుందా మా? అన్న ఓ ఆలోచన కలిగింది. మాన మే కదా ముఖ్యం! అదే పోయిన తర్వాత ప్రాణం ఉంటేనేం, పోతేనేం? ఆత్మహత్య చేసుకోవటమన్నది నేను తప్పించుకోవటా నికి సాయపడొచ్చు. ఇప్పుడు నేను దానికోస మా బాధపడుతున్నాను? "

పప్పా కళ్ళు కన్నీళ్ళు వర్షిస్తున్నాయి. గ్లాసు లోని ద్రవాన్ని గటగటా తాగే శాడు. హెన్రీ జేబులోనుండి కర్చీ ఫ్‌ను తీసి ఆయన ముందుకు చాపాడు.



"నేను ఏడ్వడం లేదు కన్నా. అప్పుడు నేనెలా ఏడ్చానో చెబుతు న్నాను" అని కర్చీ ఫ్‌తో ముఖం తుడుచుకున్నాడు.

"నేనేంచేయాలో తెల్లవారే లోపలే నాకు స్పష్టమైపో యింది కన్నా. ఆ సమయంలో నాకు అలాంటి ఆలో చననిచ్చిన ఆ భగవం తుడికి కృతజ్ఞతలు చెప్పాలి. జరిగింది, జరుగు తున్నది, జరగబోయేది అన్నీ ఆ భగవంతుడి లీలలు కన్నా. ఆ నిమిషం వరకూ దీన్ని అర్థం చేసు కోలేని మొద్దునయ్యాను. కానీ ఆ ఆలోచన నాకు వచ్చిన వెంటనే

మనసూ, శరీరమూ తేలిగ్గా గాలిలో తేలి పోయే ఓ దూదిపింజెలా అయిపోయింది. కన్నా, నేనేం స్వామీజీనై పోలేదు. ఆ సమయంలో నాకు ఏం కావాలని నేను అనుకున్నానో - డబ్బు, నగలు, బట్టలు అన్నింటినీ మూట కట్టుకుని నేనూ బయలు దే..రే..శా..ను..కన్నా...".

హెన్రీ కనుబొమ్మలు పైకి లేపి ఆయన అలా ఎందుకు చేశాడో కారణం తెలియని అయోమయంలో పడ్డాడు. "వసారా అంతా వడ్లమూటలు పేర్చి ఉన్నాయి. దాన్నంతా అమ్మి డబ్బు చేసుకోవటానికి నాకు సమయం లేదు. ఇకపై అవన్నీ నావి కావు. పెరటికొట్టంలో పశువులు ఉన్నాయి. ఇంకాసేపట్లో పనివాడు వస్తాడు. పెరటి తలుపు దగ్గర నిలబడి 'అమ్మా అమ్మా' అని పిలుస్తాడు. ఆపైనే అమ్మగారు వెళ్ళి తలుపు తియ్యాలి. ఈ రోజు తలుపు తీసుందే! అమ్మగారు కనిపించటం లేదే...? "

"నేను వెళ్ళి పెరటి తలుపును మూసి సరిగ్గా గడియ పెట్టాను. బావి దగ్గరకు వెళ్ళి నాలుగు బిందెల నీళ్ళు చేది తలపై గుమ్మరించుకున్నాను. తెల్లారేందుకు ఇంకా టైముంది. లాంతరు దీపం పట్టుకుని ఇల్లంతా ఓసారి పరిశీలనగా చూశాను. ఆస్తికి సంబంధించిన పత్రాలన్నీ తీసి పెట్టుకున్నాను. వెలుగుతున్న లాంతరు దీపాన్ని కూడా నేను ఆర్పలేదు. నూనె ఉన్నంతవరకూ అది వెలగనీ. వీధి తలుపు లాగి తాళం వేసి తాళం చెవిని తీసుకున్నాను. స్తంభం చాటున నిలబడి వీధిని చూశాను. ఎవరూ లేరు.. ఎవరి కంటా బడకుండా నేనూ పరుగెత్తాను"

''What is the Idea pappa?''

"నీ కర్థం కాలేదా కన్నా! మొదట కొంత కాలానికి, దీని గురించి ఎవరికీ ఏమీ తెలియకుండా ఉంటుంది. అదే చాలా ముఖ్యం. ఆ తర్వాత 'భార్యాభర్తలు కలిసి ఎక్కడికో వెళ్ళిపోయారు' అనుకుంటారు. ఆ సంవత్సరమేగా మేము గుడి ఉత్సవాలు జరిపాం- అందుకని పిల్లల్లేరన్న దిగులుతో యాత్రలకెళ్ళుంటామని అనుకుంటారు. ఇంకా రాకపోవడంతో కొంత కాలానికి, వెళ్ళిన చోటులో ఏమైందో... ఏమోనని ఆ తర్వాత అనుకుంటారు. నాక్కావలసింది అంతేగా కన్నా! తక్కినదంతా ఏమైపోతే నాకేం? ఇల్లు... దుకాణం... తోపు... పొలాలు... వడ్లమూటలు... వెలుగుతున్న లాంతరు దీపం.

హా... హా... హా..."

"That Barber, Pappa?" అని హెన్రీ ఆయన నవ్వు మధ్యలో అడ్డుపడ్డాడు.

"ఔను, అతడూ కనిపించలేదని ఊరంతటికీ తెలుస్తుంది. ఒకవేళ మా సంగతి కంటే ముందే తెలియవచ్చు. అయితే వాడికి మాతో సంబంధం కలపరు. నేను ఇంట్లో ఉంటేనేగా అది సాధ్యం? అందుకేగా నేనూ లేకుండా వెళ్లాను. ఇప్పుడు అతడితో భాగవతుల ఇంటి కోడలు లేచిపోయిందని ఎవరూ అనుకోరు. అయితే మంగలివాడు ఎక్కడికి వెళ్లుంటాడు...? వాడు ఎక్కడికైనా క్షవరం చెయ్యటానికి వెళ్లుంటాడని అనుకుంటారు కన్నా..."

'ఒకవేళ అతడు, ఆమె పక్క గ్రామంలో ఎక్కడైనా జీవిస్తూ, ఆ విషయం అందరికీ తెలిస్తే? ... భాగవతుల వంశ గొప్పతనం అలా ఉండనీ, పప్పా వేసిన ఈ ప్లాన్ అంతా ఎంత పెద్ద ఫ్లాప్? ' - హెన్రీ అలా అనుకున్నాడే కానీ పప్పాతో అనలేదు. అలా అనడం ఆయనను బాధ పెడ్తుందని భయపడ్డాడు.

'పప్పా... ఆ మంగలి మళ్లీ ఇక్కడికి వచ్చేశాడట, పప్పా' అని మనసులో అనుకుంటూ దేవరాజులు ఇంటి మేడమీద, వెన్నెల వెలుగులో నిలబడి ఊరంతా నిద్రపోతున్న ఆ నిశిరాత్రిలో ఎదురింటిని చూడసాగాడు హెన్రీ.

'గోయిందు ఇక్కడికి వచ్చాక పప్పా దాచిన రహస్యాలన్నీ అందరికీ తెలుసుంటాయా? ' అని ఆలోచించాడు హెన్రీ. అన్నీ తెలుసున్న పక్షంలో- 'అయ్యో పప్పా' అని ఆయన కోసం అతడు బాధపడ్డాడు.

గదిలో నుండి దేవరాజులు గురక శబ్దం వినిపిస్తోంది. టేబుల్ ఫ్యాన్ తిరుగుతున్న శబ్దం వినిపిస్తోంది. టైం ఎంతైందో తెలియటంలేదు. వీధి నాటకం రిహార్సల్స్ శబ్దాలు ఇంకా వినిపిస్తున్నాయి. హెన్రీకి నిద్రపట్టడం లేదు, అలసటా కలగలేదు. అయినా అతడు పడుకోవాలని నిర్ణయించుకున్నాడు.

గది లోపల అతడి కోసం దేవరాజులు వేసిన పడకను గది బయటకు లాగి వెన్నెల వెలుగులో వేసుకున్నాడు. పడకపై వెల్లకిలా పడుకుని వెన్నెల అందాన్ని ఆస్వాదించాడు.

'నన్ను విశ్వనాథం కొడుకనో, పెంపుడు కొడుకనో ఈ ఊరు తెలుసుకోబోతోంది. పప్పా భార్య గురించి నాకు తెలుసని వీళ్లు అనుకోవచ్చు నాకు తెలియక పోయినా నేను చెప్పాల్సిన అవసరం లేదు. వీళ్లకు నిజం తెలియని పక్షంలో వీళ్లకు ఏమీ నష్టంలేదు కాబట్టి అది మంచిదే. తెలుసున్న పక్షంలో దాన్ని దాచిపెట్టటమో, దాని కోసం బాధపడ్డమో చెయ్యటం తన పనికాదు.




దేవరాజులు, హెన్రీ పళ్లు తోమటం ముగించి మేడమీద గది బయట నిలబడ్డారు. ఆ వీధిలోని ఒక్కో ఇంటి గురించి హెన్రీకి చెప్పి ఆ ఇంటి మనుషుల గురించీ వివరంగా చెప్పసాగాడు దేవరాజులు.

హెన్రీ ఎదురింటిని పగటి వెలుతురులో బాగా పరిశీలనగా చూశాడు. దేవరాజులు చెప్పే ప్రతి విషయాన్నీ చాలా శ్రద్ధగా విన్నాడు. అతడు చూపించే ప్రతి ఇంటినీ బాగా పరిశీలించి చూశాడు. తనకు బాగా సన్నిహితులైన వారి గురించి తెలుసుకోవాలనే ఓ అన్యోన్యభావం అతడి మనసులో ఏర్పడింది.

దేవరాజులు చెబుతున్న విషయాలన్నింటినీ వింటూ చివరగా అతడి చూపులు ఎదురింటి దగ్గర ఆగిపోయాయి. ఇప్పుడు ఆ ఇంటి లోపలి భాగం, బయటి భాగం అక్కడ నుండి బాగా కనిపిస్తోంది. ఆ ఇంటి పెరటి కాంపౌండ్ గోడలు వాలిపోయున్నాయి. ఆ పెరటి తలుపు ఎక్కడ ఉండవచ్చో అతడివల్ల ఊహించడానికి వీలు కాలేదు. తీగలు, పూల మొక్కలు, పొదలు అన్నీ ఎండిపోయాయి, వాటి మధ్య ఒక పెద్ద చేదబావి కనిపించింది. అదిగో కనిపిస్తున్న చిన్నగోడ ఆ ఇంటి వంటగదై ఉండవచ్చనిపించింది. గోడల మధ్య బిగించిన కిటికీలు కనిపించాయి. బాగా పుచ్చిపోయి, మగ్గిపోయిన కొయ్యలు... ఇటుపక్క కాస్త ఒరిగిపోయిన ఇంటి పైకప్పు. అయితే ఆ ఇంటి ముందు భాగం మాత్రం భద్రంగా తాళం వేయబడి ఉంది. హెన్రీ మనసులో అదో 'సింబాలిక్'గా అనిపించింది.

హెన్రీ చప్పున వెనక్కు తిరిగి దేవరాజులు కళ్లల్లోకి చూశాడు. 'ఆ ఇంటికి ఇప్పుడు నేను యజమానిని' అని చెప్పేయాలనిపించింది. కానీ హెన్రీ సంబాళించుకున్నాడు.

"ఇంత సన్నిహితంగా మీతో కలిసి ఉన్నాక, మీ నుండి ఇన్ని హక్కులు తీసుకున్న తర్వాత నేను నా గురించీ, నేను ఇక్కడికి ఎందుకొచ్చానో మనసు విప్పి మాట్లాడకుండా ఉండటం న్యాయం కాదు" ఇంగ్లిష్‌లో దేవరాజులుతో అన్నాడు హెన్రీ.

"నో...నో...నేను స్నేహం చేసిన ఏ మిత్రుడూ నాతో ఈ విధంగా మనసు విప్పి మాట్లాడింది లేదు. మీ 'ఫ్రాంక్‌నెస్' నాకు బాగా నచ్చింది. మీ గురించి తెలుసుకోవాలనుకోవటంలో నాకేం తొందరలేదు..." అన్నాడు దేవరాజులు. తాను అలా అనటం ఎంతో బావుందని మనసులో సంతోషించాడు దేవరాజులు.

కరిపిగాడు కాఫీ తీసుకురావటంతో ఇద్దరూ అక్కడే నిలబడి కాఫీ తాగారు.

హెన్రీని ముఖాముఖి చూడాలంటే వాడికి

## భలే శిక్ష!




వేటకు పోయిన ఓ నవాబు సాయంకాలానికి ఒక ఊరు చేరుకున్నాడు. అక్కడి చెరువులో స్నానంచేసి, ఆ రాత్రికి అక్కడే కడుపునిండా తిని విశ్రమించాడు. ఉదయానికల్లా చలిజ్వరం ముంచుకొచ్చింది. వెంటనే ఊరి కరణం మునసబులను పిలిపించి ఇలా ఎందుకైందని అడిగారు.

నవాబు ఊళ్లోనే ఉంటే తమకు తలనొప్పులు తప్పవని, ఎలాగైనా నగరానికి పంపేయాలని భావించి వారిద్దరూ-

'ప్రభూ! మా ఊరి నీళ్లుగానీ.. గేదె పెరుగుగానీ మంచివి కావు. ఈ ఉపద్రవానికి అవే కారణం. తమరు వెంటనే రాజధానికి చేరడం మేలు' అన్నాడు.

అదే నిజమనుకున్న నవాబు వెంటనే నగరానికి చేరాడు. అయితే అప్పటి నుంచీ ఎవరేం నేరం చేసినా- '..ఫలానా ఊరు తీసుకువెళ్లి అక్కడి చెరువులో స్నానం చేయించండి... తర్వాత అక్కడి గేదెపెరుగుతో అన్నం పెట్టండి.. అదే వీడికి సరైన శిక్ష' అనడం మొదలెట్టాడు.

నేరగాళ్లు మాత్రం హాయిగా ఆ ఊరెళ్లి ఎంచక్కా స్నానంచేసి కడుపునిండా పెరుగన్నం తిని నవ్వుకుంటూ తమ దారిన తాము పోయేవారు.

ఇంకా సిగ్గుగానే ఉంది.

కాఫీ తాగుతూ దేవరాజులు హెన్రీతో అన్నాడు. "మనం స్నానంచేసి, కాఫీ, టిఫిన్ పూర్తిచేశాక మున్సిఫ్ ఇంటికి వెళదాం"

ఎక్కడో వేడుక చూస్తున్న కరిపిగాడు చప్పున దేవరాజులు వైపునకు తిరిగి అన్నాడు. "అయ్యయ్యో, నాయుడుగారు ఉదయాన్నే బండి తీసుకొని ఎక్కడికో వెళ్లిపోయారు... కుమారపురానికో, మల్లంగుంటకో...మీకు తెలియదా...వాళ్లమ్మాయి ప్రసవించిందిగా? "అని చెప్పి. కాఫీ గ్లాసుల్ని తీసుకొని కిందకు వెళ్లాడు.

"మరి ఇప్పుడు మనమేం చేద్దాం? " అని అడిగాడు దేవరాజులు.

"మీకేమైనా పని ఉంటే నా కోసం దాన్ని వాయిదా వేయకండి. మీ పని చూసుకోండి. నాయుడిగారిని ఈ రోజు కలవటానికి వీలు కాకపోవచ్చు.. He will be very busy... అందుకని మనమే ఆ విషయాన్ని రేపటికి వాయిదా వేసుకుందాం. నేను అలా ఓ రౌండ్ వెళ్లి అ ఊరినీ, గుడినీ, మనుషుల్నీ అన్నింటినీ చూసొస్తాను" అంటూ హెన్రీ అక్కడి నుంచే కనుచూపు మేరా ఆ ఊరిని ఓసారి కనులారా దర్శించాడు.

"అలా అయితే మీతో నేనూ రావటం సాయంగా ఉంటుంది? "

"విత్ ప్లెషర్! నావల్ల మీ పని ఏమైనా చెడుతుందేమోనని నేను భయపడ్డాను"

"నాకేమీ పని లేదు. దగ్గరి స్నేహితులు ఎవరూ లేరు నాకు. సాధారణంగా సెలవు దినాల్లో ఇంట్లోనే పుస్తకాలు చదువుతూ గడుపుతాను. ఇదిగో ఇప్పుడు కరిపిగాడు కొన్ని పుస్తకాలు పేపర్ పట్టుకొస్తాడు చూడండీ... వాటిని ఒకసారి తిరగేస్తాను! తర్వాత కాసేపు నిద్రపోతాను...రేడియో వింటాను... రాన్రాను అంతా బోర్ అనిపిస్తోంది. మీకు అభ్యంతరం లేకపోతే ఈ ఊళ్లో మీరు వెళ్లాలనుకున్న చోటికల్లా నేను మిమ్మల్ని తీసుకెళతాను. నన్నడిగితే, "Nothing is interesting in this place! ఒకే ఒక చోటు తప్ప... నేను చెప్పానే... ఆ ఏటి పక్కకు వెళ్లితే సీనరీ చాలా బావుంటుంది. పెద్దగా మనుషులు ఉండరు. మనుషులు

ఉండని చోటు అందంగానే ఉంటుంది. రెండు మైళ్లు నడవటం మీకు కష్టం కాకపోతే మనం స్నానం చెయ్యటానికి అక్కడికే వెళదాం"

"Is it a big river?" ఓ నదీ ప్రవాహాన్ని ఊహించుకుంటూ అడిగాడు హెన్రీ.

"అంత పెద్దదేం కాదు. చాలా అందమైన ఏరు. కొండ కింది ప్రాంతం... ఇవ్వాళ మనం అక్కడికెళదాం!" దేవరాజులు అతడి ఆసక్తిని పెంచాడు.

"ష్యూర్... ష్యూర్" అంటూ ఏదో ఆలోచనల్లో ఉండి తల ఆడించాడు హెన్రీ.

టిఫిన్ చేశాక వాళ్లు ఆ వీధిని దాటి కోనేటి పక్కగా నడిచి ద్రౌపదమ్మ గుడి సమీపానికి వచ్చినప్పుడు అక్కడ లారీ నిలబడి ఉండటం కనిపించింది.

"గుడ్‌మార్నింగ్ సార్" అన్న పిలుపు చాలా ఆప్యాయంగా వినిపించింది. హెన్రీ వెనక్కు తిరిగి చూశాడు. హోటల్లో ఉన్న బెంచ్‌మీద కూర్చొని బీడీ తాగుతూ, చేతిలో కాఫీ గ్లాసుతో దేవరాజులుకు నమస్కరించి ఆహ్వానించాడు లారీ డ్రైవర్ దొరస్వామి. బయట వెదురు కట్టకు ఆనుకుని నిలబడి టీ తాగుతున్న క్లీనర్ పాండు హెన్రీని చూసి సలాం చేశాడు. హెన్రీ వాళ్లకు నమస్కరిస్తూ లోపలున్న బెంచ్‌ను సమీపించాడు.

హెన్రీ హోటల్ వద్దకు వెళ్లి చాలాకాలం నుండి పరిచయం ఉన్నట్టు అక్కడున్న బెంచ్‌పై దొరస్వామి పక్కన కూర్చున్నాడు. దేవరాజులకు అది కాస్త ఇబ్బందిగా అనిపించింది. అతడు బయటే నిలబడ్డాడు.

"Please come in" అంటూ హెన్రీ మనసులో ఏ భేదమూ లేకుండా అతణ్ణి ఆహ్వానించినప్పుడు దేవరాజులు దాన్ని కాదనలేకపోయాడు. అతడు లోనికి వచ్చి బెంచ్‌పై కూర్చున్నాడు. ఆ ఊళ్లోనే పుట్టి పెరిగిన దేవరాజులు అలా హోటల్లోకి వచ్చి కూర్చోవటం అదే మొదటిసారి.

"గ్లాసుల్ని బాగా వేణ్ణీళ్ళతో కడిగి రెండు కాఫీలు పట్రారా". అంటూ అక్కడున్న కుర్రాడికి అధికారంతో చెప్పాడు దొరస్వామి.

"ఇప్పుడే ఇంట్లో కాఫీ తాగాం" అని దేవరాజులు చెప్పడు హెన్రీ కూడా అతడితో జత కలిపాడు: ఇప్పుడే... జస్ట్ నౌ"

"అయితే కాఫీ వద్దు. టీ తాగండి, రేయ్! రెండు టీలు పట్రారా", అంటూ వాళ్ళ సమాధానం కోసం ఎదురుచూడకుండా ఆర్డర్ చేశాడు దొరస్వామి. దొరస్వామి చేసే మర్యాదలో ఉండే అందమైన మొరటుతనాన్నీ అతడి ఆప్యాయతనూ హెన్రీ అర్థం చేసుకొని నవ్వాడు. హోటల్లోకి వెళ్ళగానే ఎడమవైపు టేబుల్... దాని వెనకున్న కుర్చీలో కూర్చొని ఉన్న హోటల్ యజమాని పక్కన గోడవారగా నిలబెట్టి ఉన్న రెండు చేతికర్రలు- 'ఈ టీ కొట్టు యజమాని ఒక అవిటి మనిషి' అని తెలియజేస్తోంది.

హెన్రీ హోటల్ యజమానిని చాలా సానుభూతితో చూశాడు. నవ్వుతూ హోటల్ యజమాని హెన్రీని అడిగాడు. "మనది ఏ ఊరండి? నిన్న సాయంకాలం మీరు లారీలో నుండి దిగివస్తున్నప్పుడే చూశాను". అని చెప్పి ఆపై ఏం మాట్లాడాలో తెలియక నవ్వాడు.

"బెంగుళూరు" అని సింపుల్‌గా బదులిచ్చాడు హెన్రీ.

"చూశావా, నాయక్! నీ హోటల్‌ను వెదుక్కుంటూ బెంగుళూరు నుండి కూడా కష్టమర్స్ వస్తున్నారు" అంటూ దొరస్వామి అనగానే, నాయక్ అన్నాడు. "ఏంచేద్దామండీ... అన్ని ఊళ్ళలోనూ సౌకర్యమైన హోటళ్ళు దొరుకుతాయా? ఈ ఊరికి ఇదే సౌకర్యం. ఏమండీ దొరస్వామిగారూ, మీరు ఈ మధ్య బెంగుళూరు వెళ్ళటం లేదా?" అని ప్రశ్నించాడు.

హెన్రీకి చప్పున ఏదో స్ఫురించింది.

హెన్రీ లారీలో నుండి దిగి దొరస్వామితో చెప్పి వెళదామని అతడికోసం వెదికి, కనిపించకపోయేసరికి పాండుతో, 'డ్రైవర్‌తో చెప్పేయ్" అని చెప్పి వెనక్కు తిరిగినపుడు చిన్న

ప్ప. "అతనూ మన ఊరివాడే, ఇప్పుడు కుమారపురానికి అత్తగారింటికి వెళ్ళిపోయాడు. పొలంపుట్రా అన్నీ ఇక్కడే ఉన్నాయి" అని అనటమూ...

- ఇప్పుడు ఈ హోటల్ యజమాని అతణ్ణి దొరస్వామీ అని పిలవటమూ...

"నా తమ్ముడొకడు, ఉండేవాడు. ఇప్పుడూ ఉన్నాడేమో! ఉండాలి. దొరస్వామి అని పేరు. చదువుకోలేదు. మొరటుగా, బలాదూరుగా తిరుగుతుండేవాడు. కుమారపురంలో మా తాత ఇంట్లోనే ఉండేవాడు..." అని పప్పా తనతో చెప్పటం, వరుసగా ఒక్కోటిగా హెన్రీకి గుర్తుకొచ్చి, అతనికి చప్పున విషయం స్పష్టమైపోయింది.

తనకు స్పష్టంగా తెలిసిపోయిన ఆ విషయాన్ని అతడు ఎవరినీ అడిగి తెలుసుకోవాలని ప్రయత్నించలేదు. ఓ చిన్నపిల్లవాడు దేవరాజులుకు, హెన్రీకి మర్యాదగా టీ పట్టుకొచ్చి ఇచ్చాడు.

"మున్సిఫ్‌ను కలవాలని చెప్పావే, కలిశావా బాబూ" అంటూ టీ తాగుతున్న హెన్రీని అడిగాడు దొరస్వామి. "లేదండీ, రేపటికిగాని కలిసేలా లేమండి. ఆయన బిజీగా ఉన్నట్టున్నారు. నాకేం తొందరలేదు. మిస్టర్ దేవరాజుల ఇంట్లోనే ఇప్పుడుంటున్నాను" అంటూ వివరంగా చెప్పాడు హెన్రీ.

హెన్రీ, దేవరాజులు టీ తాగేసి లేచి నిలబడ్డారు. దొరస్వామి హెన్రీ వద్ద సెలవు తీసుకునేలా అన్నాడు. "అయితే నేను వస్తాను బాబూ, ఈ సార్ ఇంట్లోనే ఉన్నావా? మన ఇల్లూ అక్కడే ఉంది. నాలుగైదు తరాలుగా ఈ ఊరే మనది. కానీ నాకే ఈ ఊరూ, ఆ ఇల్లూ అచ్చిరాలేదు అందుకే... వెళ్ళిపోయాను. వాళ్ళింటికి ఎదురిల్లే అన్న ఇల్లు. మేము పుట్టిందీ పెరిగిందీ అంతా ఇక్కడే" అని చెప్పగానే, దేవరాజులు ఆశ్చర్యపోవటాన్ని చూసి దొరస్వామి నవ్వుతూ ఇలా అన్నాడు.

"సారూ మీకవన్నీ తెలియవు... మీరప్పుడు పుట్టి కూడా ఉండరు. ఈ ఊళ్ళో ఏ పని కావాలన్నా నాతో చెప్పు. నాకు చేతనైనంత సాయం చేస్తాను". అని చెప్పి ఓ కొత్త స్నేహాన్ని ఏర్పరచుకున్నానన్న గొప్ప భావంతో లారికేసి దారితీశాడు దొరస్వామి.

దేవరాజులుకు ఏమీ అర్థంకాక హెన్రీని చూశాడు. "నాకెప్పుడో అంతా తెలుసు" అన్నట్టు హెన్రీ నవ్వాడు. వాళ్ళ చూపులూ, నవ్వూ అర్థం కాని నాయక్, దొరస్వామి గురించి వీళ్ళు ఏదీ తప్పుగా భావించకూడదని, "చాలా మంచి మనిషండీ. ఎప్పుడూ తమాషాగా మాట్లాడతారు. కొన్ని సమయాల్లో మొరటుగా కూడా మాట్లాడ్డం కద్దు. అయితే మనసు మాత్రం వెన్న". అన్నాడు.

దాన్ని అంగీకరిస్తున్నట్టు హెన్రీ కళ్ళు మూసుకొని ముఖంలో ఓ చిర్నవ్వు చిందిస్తూ తల ఆడించాడు.

దొరస్వామి వెళ్ళాక హెన్రీ, దేవరాజులు కాఫీ హోటల్ ముందు నిలబడ్డారు. అంగడి వీధిలో జనాల కదలికలు అధికం కాసాగాయి. కృష్ణరాజపురంలో అవ్వాళ సంతరోజు! ద్రౌపదమ్మ గుడి ముంగిటే సంత జరుగుతుంది. హోటల్ ముందు నిలబడి చూస్తుంటే తిరణాల గుంపులా అనిపించసాగింది.

హెన్రీ వేడుకగా చూస్తూ ఉండటాన్ని చెరపకూడదనుకున్న దేవరాజులు "ఇక్కడే నిలబడండి, నేవెళ్ళి సైకిల్ పట్టుకొస్తాను" అని చెప్పి కిరాయి సైకిలు దుకాణానికి వెళ్ళి సైకిలు తెచ్చాడు.

ఊరి చివరి మట్టి రోడ్డుపైకొచ్చాక దేవరాజులు సైకిల్ పైకి ఎక్కి కూర్చొని హెన్రీ నడక వేగానికి తగ్గట్టు అతడు కూడా సైకిల్‌ను వంపులు తిప్పుతూ నడపసాగాడు.

"మీరు వెనక ఎక్కండి"అని హెన్రీ పక్కగా వచ్చాడు. హెన్రీకి కూడా ఎక్కాలనే ఉంది. సైకిల్ వెళుతుంటే దాన్ని పట్టుకుని ఎగిరి కూర్చోవడం తెలియక తడబడ్డాడు. తన అసమర్థతకు నవ్వాడు. ఇంతలో పేడ ముద్దల్ని ఏరుకుంటున్న కొందరు చిన్న పిల్లలు, మరి కొంతమంది గొల్లవాళ్లు దాన్ని వింతగా చూడ

టానికి పరుగెత్తుకొచ్చారు. దేవరాజులుకు వాళ్ళను దూరంగా తరమాలనిపించింది. దాని కన్నా తెలివిగా అతణ్ణి ఎక్కించుకొని అక్కడ నుండి వేగంగా వెళ్ళిపోవటం మంచిదని భావించి, రోడ్డుకు పక్కగా ఉన్న ఓ రాయిపై ఎడమ పాదాన్ని ఆనించి సైకిల్‌ను ఆపాడు.

"కమాన్ ఇప్పుడు ఎక్కండి" అని పిలవ గానే వెనుక వస్తున్న హెన్రీ పరుగెత్తుకొచ్చి సైకిల్‌ను పట్టుకొని వెనుక ఎక్కి కూర్చు న్నాడు.

"కూర్చున్నారా"

"ఓ, యస్"

"సరిగ్గా పట్టుకున్నారా? ... వెళ్లొచ్చా? ..."

"యస్, రెడీ."

దేవరాజులు ఆ మట్టి రోడ్డుపై సైకిల్ టైర్లు సరసరమంటూ శబ్దం చేస్తుండగా వేగంగా తొక్కాడు. హెన్రీకి ఆనందంగా అనిపించింది. కొన్నిచోట్ల ఎత్తెత్తి కుదేసింది. ఓచోట రోడ్డు మిట్ట పెరుగుతూ పోవటంతో దేవరాజులు సైకిల్‌ను ఆపి, హెన్రీని కూడా దిగి తొయ్యమని చెప్పాడు. మిట్ట పూర్తయ్యేంత వరకూ ఇద్దరూ మాట్లాడుకుంటూ నడవసాగారు. ఉన్నట్టుండి హెన్రీ అడిగాడు. "మిస్టర్ దొరస్వామి ఎవరో మీకు తెలుసా?"

తన సమాధానం కోసం హెన్రీ ఆ విషయం అడగలేదని దేవరాజులుకు అనిపించింది.

"మా పప్పాకు తమ్ముడు! పప్పా కూడా చెప్పారా సంగతి. మా పప్పానే ఆ పాడుబడ్డ ఇంటికి తాళం వేసి వెళ్ళిన మనిషి ఇదిగో ఆ ఇంటి తాళం చెవి" అంటూ జేబులో ఉన్న ఓ పాత తాళాల గుత్తిని తీసి చూపించాడు హెన్రీ.

"ఇతడే ఆ ఇంటికి హక్కుదారుడని నిరూపించటానికి అది మాత్రమే ఎలా సరిపోతుంది?" అని ఆలోచించాడు దేవరాజులు. అతడి ఆలోచనకు సమాధానం చెప్పేలా హెన్రీ అన్నాడు. "పప్పా సంపాదించిన ఆస్తికి రికార్డ్స్, నన్ను 'అడాప్ట్' చేసుకున్నట్టు

ఎప్పుడూ సంతోషంగా ఉండాలంటే మనం పసి పిల్లల్లా ఉండాలని అనిపిస్తోంది. చిన్న పిల్లల్లా ఉన్నప్పుడు ఒక్కో చిన్న విషయమూ ఎంత ఆశ్చర్యంగా ఉంటుంది

తగిన సర్టిఫికేట్, ఆయన నాకు రాసిచ్చిన వీలునామా- అన్నీ తీసుకొచ్చాను" కుతూహలంగా అతడు చెప్పిన విషయాలను విన్న దేవరాజులు కాస్త కలవరపడ్డాడు. 'చట్టపూర్వకంగా, న్యాయంగా అవన్నీ అతడి పప్పాకు తమ్ముడైన దొరస్వామి వద్దే ఇప్పుడు ఉండాలి. ఇన్నేళ్ళుగా వాటన్నిటినీ స్వతంత్రంగా అనుభవిస్తున్నవాడు ఎవరైనా సరే- అంత సులభంగా వాటన్నింటినీ ఎలా వదులుకుంటాడు? అది సరే, అలాగని హక్కుదారుడు వాటిని వదిలిపెట్టి వెళ్ళటానికి వీలవుతుందా?' తన ధోరణిలో ఆలోచనల్లో పడ్డాడు దేవరాజులు.

కొంచెం దూరం వెళ్లాక మళ్లీ ఇద్దరూ సైకిల్ ఎక్కారు. పక్కనున్న అడవి పొదలపై నల్లగానూ, పసుపుగానూ ఉన్న కొన్ని చిన్న చిన్న పక్షులు ఎగురుతూ కనిపించాయి. ఏవేవో విచిత్రమైన శబ్దాలు చేస్తూ వినటానికి హాయిగా అనిపించింది.

కొంతసేపటి క్రితం పశువుల మందను తోలుకెళ్ళిన గొల్లలూ, ఎర్ర తలపాగా కట్టుకున్న ముసలాయనా, హెన్రీ కళ్లబడ్డారు. దూరంగా నలుదిశలా పశువులు మేస్తూ ఉండటాన్ని దేవరాజులు గమనించాడు.

"ఎప్పుడూ సంతోషంగా ఉండాలంటే మనం పసి పిల్లల్లా ఉండాలని అనిపిస్తోంది. చిన్న పిల్లల్లా ఉన్నప్పుడు ఒక్కో చిన్న విషయమూ ఎంత ఆశ్చర్యంగా ఉంటుంది. ఇప్పుడు మీతో నేను అలాగే ఉన్నాను. మీరెప్పుడూ అలాగే పసిపిల్లాడిలా ఉండేలా ఉన్నారు" అంటూ దేవరాజులు సైకిల్ తొక్కుతున్న వాడు

అలాగే తల మాత్రం తిప్పి ఓసారి హెన్రీని చూసి నవ్వాడు. హెన్రీ మరెక్కడో చూస్తు న్నాడు.

"పిల్లలు మాత్రమేనా? ఈ పక్షులూ, మృగా లూ, సీతాకోక చిలుకలూ, తేనెటీగలూ, పువ్వులూ, చెట్లూ, తీగలన్నీ సంతోషంగా ఉంటున్నాయి" అని ఇంగ్లిష్‌లో ఓ కవిత చెప్పినట్లు చెప్పాడు హెన్రీ. అది విన్న దేవ రాజులుకు ఒక విధమైన పారవశ్యం కలి గింది.

దేవరాజులు సైకిల్ వేగాన్ని తగ్గించాడు. ఏటి ఒడ్డు కాస్త దూరంలో కనిపించింది. ఉన్నట్టుండి వస్తున్న దారి పల్లంలోకి జారి నట్టు కిందకు దిగసాగింది. కొంచెం దూరంలో దారికడ్డంగా నది ప్రవహిస్తూ కని పించింది. దేవరాజులు, హెన్రీ ఓ చోట సైకి ల్‌ను ఆపి కిందకు దిగారు.

హెన్రీ నడుముపై చెయ్యి పెట్టుకొని దూరంగా దృష్టిని సారించాడు. ఆకాశం మామూలుగా కనిపించే దానికన్నా దూరంగా ఉన్నట్టు అనిపించింది. చెప్పులు విడిచేసి ఇసుకలో నిలబడ్డప్పుడు చల్లగా అనిపించింది. నదిలో నీరు ప్రవహించే శబ్దం లయగా, అదే సమయంలో గుండె చప్పుడులా ఆగకుండా అలాగే జపిస్తున్నట్టుగా ఉంది.

"ఓ...హో..." అంటూ పెద్ద గొంతుతో తన శక్తినంతా కూడగట్టుకుని గట్టిగా అరి చాడు హెన్రీ.

"ఓ...హో..." అంటూ అతడి గొంతు ఆ కొండల మధ్య ప్రతిధ్వనించింది. ఆ ప్రతి ధ్వనిని విని అతడు చేతులు చరిచి నవ్వాడు.

హెన్రీ మళ్ళీ ప్రతిధ్వనిని వినా లన్న కోరికతో కొండను చూస్తూ రెండు చేతుల్ని నోటి పక్కగా పెట్టుకొని అరిచాడు.

"పప్పా...ఆ..."

"పప్పా... పప్పా... ఆ... ఆ..." అని ప్రతిధ్వనిం చింది.

దేవరాజులుకు హెన్రీ గొంతు గుండెను పిండినట్టై కళ్ళలో నీరు తెప్పించింది. మూడు రోజుల క్రితమే అతడి పప్పా చనిపోయారన్న భావన మనసులో ఓ భారాన్ని కలిగించింది. అతడు ఏ మాత్రం బాధ లేకుండా, దుఃఖం లేకుండా, ఇంత ఆసక్తికరంగా ఉండడం ఎలా వీలౌతోంది? అన్న ఆశ్చర్యమూ, ఆ ఆశ్చర్యా నికి జవాబుగా హెన్రీ అరిచిన 'పప్పా' అన్న అరుపుతో ఓ శోకమూ కలిగి దేవరాజులుకు



కన్నీళ్ళు తెప్పించాయి.

ఆ ప్రతిధ్వని 'పప్పా' అని వినిపించే బదులు, ఇతడికి 'కన్నా' అని వినిపించకూడదా! అన్న ఆశతో కొండకేసి చూశాడు దేవరాజులు.

అయితే హెన్రీ ఎప్పటిలాగే నవ్వు ముఖంతో నిలబడున్నాడు. దేవరాజులు అతడి సమీపానికి వెళ్ళి కొంచెం దూరంలో ఏటి ఒడ్డున ఒక పెద్ద చెట్టూ, దానికి సమీపంలో బాగా పరచుకున్న నీడ, దాని కింద కింద నీటి ప్రవాహంలో ఓ బండ కనిపిస్తున్న చోటును చూపిస్తూ అన్నాడు. "మనం అక్కడికి వెళదాం. బట్టలన్నీ బండమీద పెడదాం. స్నానం అక్కడే చేద్దాం, ఊరికే కూర్చోనూ వచ్చూ నీడగానూ ఉందిగా..."

హెన్రీ, దేవరాజులు ఏట్లో స్నానం చేసి తిరిగొచ్చేసరికి మధ్యాహ్నం రెండైంది. ఏట్లో ఈదులాడి స్నానం చేసిన అనుభవం శరీరానికీ, మనసుకూ హాయిగా అనిపించింది. ఆ కొద్ది గంటల సమయంలో దేవరాజులు,



హెన్రీ ఎన్నో విషయాల గురించి మాట్లాడు కున్నారు.

దేవరాజులు తన సొంత సమస్యలన్నీ మరిచిపోయి, మనిషి ఆంతరంగిక సమస్యల గురించి, వేదాంతంలాగా కాకుండా జీవితం స్వాభావికత గురించి, వాటినే తమ సొంత సమస్యల్లా భావించి మాట్లాడుకున్నదంతా ఒక్కోటిగా గుర్తు చేసుకుంటూ మౌనం వహిం చాడు.

ఊరూ, వీధీ, మనుషులూ, ఇల్లూ రాను రానూ వాటికి సంబంధించిన సామాజిక కార్యాలు, సామూహిక భావనలు మనిషి ఆంతర్యంలో పడేసరికి స్వీయ సమస్యలు ఎంతో దూరాన నిలబడతాయని అతడికి అర్థ మైంది.

ఏటికి వెళుతున్నప్పటికన్నా ఇప్పుడు తిరి గొచ్చి ఆ వీధిలో చొరబడుతున్నప్పుడు హెన్రీ కీ, ఆ వీధికీ ఉన్న సంబంధం దేవరాజులుకు స్పష్టంగా అర్థమైపోయింది. ఎదురింటిని ఒక కొత్త బాంధవ్యంతో చూశాడు దేవరాజులు.




మున్సిఫ్ ఇంటి అరుగుమీద పంచాయితీ కూడారు. అరుగుమీద పెద్ద చాప పరి చారు. దానిపై మున్సిఫ్ గోడకు ఆనుకొని, కాలుమీద కాలు వేసుకుని మడిచి కూర్చుని ఎడమ మోకాలిపై చేతులు రెంటినీ వేసు కుని కళ్లు మూసుకొని ఆలోచనలో మునిగి పోయి ఉన్నాడు.

ఆయన పక్కన కరణం పెళ్ళి కూతురిలా కూర్చుని ఉన్నాడు. అక్కడ జరుగుతున్న విషయాలతో తనకు సంబంధం లేనట్టు, ఒక మర్యాద కోసం కూర్చొని తన ఆలోచ నల్లో తానున్నాడు.

ఆయనకు కాస్త దూరంలో, భారీకాయంతో ద్రౌపదమ్మ గుడి ధర్మకర్త సుబ్బరామయ్య తమ ముందున్న తాంబూలం తట్టలోనుండి కొన్ని తమలపాకుల్ని తన భాగంగా అందు కొని, ఒక్కోటి తొడమీద తుడిచి సున్నం పూసి యంత్రంలా నమలసాగాడు.

ఎదురింటి పోస్టాఫీస్ పంతులు అరుగు మీద కాళ్లు కిందికి జారవిడిచి కూర్చున్నాడు.

హెన్రీ మోకాలి చుట్టూ చేతులేసుకుని స్తంభానికి ఆనుకుని కూర్చున్నాడు. అతడికి సమీపంలో కూర్చున్న దేవరాజులు తన ముందున్న ఏవేవో పత్రాలను అటు ఇటు తిప్పి చూస్తున్నాడు.

అరుగు పక్కగా వెడల్పుగా ఉన్న వసా రాలో పంచెను మడిచి కట్టుకొని, వంచిన తలతో, మీసాల్ని తిప్పుతూ అటు ఇటు పచా ర్లు చేస్తున్నాడు దొరస్వామి. అతడిపైనే తన చూపుల్ని నిలిపి ఒక మూలగా నిలబడు న్నాడు పాండు.

విశ్వనాథం ఆస్తికి హెన్రీయే వారసుడని చట్ట పూర్వకంగా కుమారపురం రిజిస్ట్రార్ ఆఫీ సులో నిరూపణ అయ్యాక వీళ్ళందరూ అక్కడ పంచాయతీ కూడారు.

దేవరాజులు బడికి సెలవు పెట్టి హెన్రీతో తిరిగాడు.

మున్సిఫ్ ప్రారంభంలో హెన్రీకి అనుకూ లంగా లేడు. దొరస్వామి పిల్లా జెల్లా కలిగిన వాడు. ఈ ఆస్తిని ఇన్నాళ్లూ కాపాడుతూ వచ్చిన వ్యక్తి. వాటినన్నిటినీ ఉన్న పళంగా ఒక్క రోజులో వదులుకుని, ఈ ఊరూ పేరూ తెలియని, జాతి లేని, చూడ్డానికి పిచ్చివాడిలా ఉన్న వాడికి ధారాదత్తం చేయాల్సి రావడానికి అనుకూలంగా వీలునామా పత్రాలూ, చట్టం, ఎన్నో ఆధారాలు ఉన్నప్పటికీ అందుకు అంగీ కరించడం, అన్యాయంగా అనిపించింది ఆయ నకు. అయినా అందులో ఇకపై తాను చేయ టానికి ఏమీ లేదని గ్రహించాడు.

దేవరాజులు అదే విషయాన్ని మరోలా చూశాడు. చట్టం, న్యాయం ప్రకారం ఆస్తంతా హెన్రీకే చెందాలని అతడు నమ్మాడు. అయితే హెన్రీ గురించి తెలుసున్నందువలన ఆ ఆస్తంతా అత్యాశతో దొరస్వామి నుండి హెన్రీ పూర్తిగా లాక్కోడనీ అనుకున్నాడు. అందులో కొంత భాగమైనా హెన్రీనే దొరస్వామికి ఇచ్చి పెద్దరికంతో నడుచుకుంటాడని భావించాడు. అయితే తన ఆలోచనను హెన్రీకి చెప్పడం 'హద్దు మీరిన తనంగా' భావించి తన భావాల్ని తనలోనే దాచుకున్నాడు.

దొరస్వామి పట్ల అందరికీ సానుభూతి ఉంది. గుడి ధర్మకర్త సుబ్బరామయ్య దీని గురించే మాట్లాడుతూ దొరస్వామితో రెండు రోజులు గడిపాడు. అతడితో పాటు లారీలో ప్రయాణించాడు. అతడి ఖర్చుతోనే ఆ రెండు రోజులూ కాఫీ, టిఫిన్, భోజనం చేశాడు. ఇప్పుడు ఈ పంచాయతీలో దొరస్వామికి అనుకూలంగా ఒక తీర్పు ఇవ్వటం తన బాధ్యత అని ఆసక్తిగా ఎదురు చూస్తున్నాడు.

మున్సిఫ్ అంతసేపూ- ఇప్పుడు ఎందుకోసం కలిశామో అన్న విషయాన్ని పక్కన పెట్టి దీనికంతటికీ కారకుడైన తన బాల్య స్నేహితుడు విశ్వనాథం గురించి గుర్తు చేసుకోసాగాడు.

ముప్పై ఏళ్లకు మునుపు... భార్యా భర్తలిద్దరూ... ఆస్తి అంతస్తుల్ని విడిచి పెట్టి, దేశాలు పట్టిపోయారన్న విషయాన్ని తాను ధ్రువీకరించినప్పుడు ఏ మానసిక స్థితిలో ఉన్నాడో, అదే స్థితిలో ఇప్పుడూ ఉన్నాడాయన. పదే పదే అదే ఆలోచనలతో ఆయన దీర్ఘంగా నిశ్వసిస్తున్నాడు.

"ఏమయ్యా... భాగవతార్ ఫొటో కానీ ఆయన చిత్రం కానీ ఏదైనా ఉందా? పంచాయతీ పెద్దల కోసం నేను అడగటం లేదు. ఉంటే చూద్దామని ఒక ఆశ. ఆయనా, నేనూ చిన్నప్పటి నుండి స్నేహితులం" అనగానే హెన్రీ ఆలోచనలో పడ్డాడు. అతడి లెదర్ బ్యాగ్‌లో 'పప్పా' ఫొటో ఒకటుంది. అయితే అందులో పప్పాతో పాటు 'మమ్మా' కూడా ఉంది. వీళ్ళకు పప్పా భార్య మమ్మా కాదని తెలుస్తుందన్న ఆలోచనతో కాస్త నిదానించి, 'సరే, దీని పర్యవసానాలెలా ఉంటాయో వేడుక చూద్దాం' అన్న చిర్నవ్వుతో, లెదర్ బ్యాగ్ తెరచి, ఫ్రేముతో ఉన్న ఒక ఫొటోను తీసి ముందుకు చాపాడు హెన్రీ.

మున్సిఫ్ చొక్కా జేబులోంచి కళ్ళద్దాలు తీసి తగిలించుకున్నాడు.

కుర్చీలో కాలుమీద కాలు వేసుకుని కూర్చొని ఉన్నారు విశ్వనాథంగారు. ఆయన తను అంతకు మునుపు చూడనటువంటి వేషధారణలో ఉన్నా మున్సిఫ్ ఆయన్ని గుర్తు పట్టగలిగాడు. కానీ విశ్వనాథంగారి పక్కన- ఆయన కూర్చొని ఉన్న కుర్చీమీద వయ్యారంగా చెయ్యివేసి నిలబడున్న ఆ తెల్లటి యువతిని చూసి మున్సిఫ్ మనసు కుంచించుకుపోయింది. ఆ ఫొటోను తాను చూడ్డంతో సరిపుచ్చుకొని, మరెవరూ చూడకుండా హెన్రీకి తిరిగి ఇచ్చేసి, బ్యాగులో పెట్టమని చెప్పాలని అనుకున్నంతలోనే సుబ్బరామయ్య కరణం మీద పడి, తల చాపి ఆ ఫొటోను చూసేశాడు. అతడి చేష్టలు మున్సిఫ్‌కు కాస్త చిరాకు కలిగించాయి.

ఫొటోలో చూసిన భాగవతార్ ముఖం మున్సిఫ్ మదిలో పాత జ్ఞాపకాలనెన్నింటినో కదలాడేలా చేసింది.

ఆ కాలంలో విశ్వనాథం భాగవతార్ గుళ్ళో ఎందరి చరిత్రలనో చెప్పి కాలక్షేపం చేసేవారు. త్యాగరాజు ఉత్సవాల ప్రారంభంరోజున ఆయన చిత్రపటాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళేవారు. చాలా నిష్ఠాగరిష్ఠుడు. తనకు సమవయస్కుడైనా మున్సిఫ్ ఆయనను మర్యాదపూర్వకంగా గౌరవించేవాడు. ఇద్దరూ ఒకర్నొకరు- "ఒరేయ్" అని పిలుచుకొని ఆడుకున్న ప్రాయమూ ఉంది. పసిప్రాయంలో ఆటల్లో తనతో చేరిన విశ్వనాథం, యవ్వన దశ ఆటల్లో తనతో కలవకుండా దూరమవటంతో, తర్వాత, తర్వాత సమవయస్సు స్నేహితుడైనా

విశ్వనాథ భాగవతార్‌కు మర్యాదిచ్చి ఆయన నుండి తప్పుకుని దూరమయ్యాడు మున్సిఫ్.

భాగవతారూ ఆయన భార్యా-ఆయన చెప్పే కథా కాలక్షేపాలలో వచ్చే భార్యాభర్తల్లా ఎంతో అన్యోన్యంగా జీవించారు! ఏం ఉండి ఏం ప్రయోజనం? పిల్లల్లేరన్న కొరతను గుర్తు చేసుకుంటూ వాళ్ళు ఎంతగా కుమిలిపోయారు? ... సరే... అందుకని...? భర్త జ్ఞాన మార్గంలోకి మళ్ళి స్వామీజీ అయ్యాడంటే- ఊరినీ, మనుషుల్నీ, ఆస్తినీ, అంతస్తుల్నీ వదిలిపెట్టి అతడితో పాటూ తానూ సన్యాసం స్వీకరించటానికి సమ్మతించే భార్య ఎందరికి దొరుకుతుంది...? అలా వెళ్ళిపోయిన వాళ్ళకేం జరిగింది...? తర్వాత ఇదంతా ఏంటీ నాశనం...? ఒక తెల్లదాని పక్కలో అరనిక్కరూ, కోటూ వేసుకొని ఆయన కూర్చొని ఉన్న ఫొటోను ఈ జాతిలేనివాడు పట్టుకొచ్చి చూపిస్తున్నాడే! ఇదేం అన్యాయం? ఇదెలా జరిగింది? ఆయన భార్య ఏమైంది? ఒకవేళ చనిపోయిందా? ఆటు తర్వాత ఈ తెల్లదాన్ని ఆయన చేర్చుకున్నారా...? ఛఛ, భాగవతార్ అలాంటి మనిషి కాడే... ఆ తెల్లది ఏదైనా వశీకరణ మందు పెట్టి ఆయనను లొంగదీసుకుంది? 'మ్... ఈ రోజుల్లో ఎలాంటివాడికైనా ఏమైనా జరుగుతుంది' అని మనసులో బాధ పడ్డాడు మున్సిఫ్.

ఇంతలో ఆయన చేతిలోని ఫొటో సుబ్బరామయ్య చేతిలోకి మారింది. దాన్ని చూసీ చూడగానే ఆయన 'అయ్యయ్యో' అని ముఖం చిట్లించి "ఇదేమిటండీ? " అన్నాడు.

మున్సిఫ్ మౌనంగా బాధతో సుబ్బరామయ్యను, హెన్రీని మార్చి మార్చి చూశాడు. సుబ్బరామయ్య హెన్రీ వైపుకు తిరిగి "ఇది మీ అమ్మా? " అని అడిగాడు. హెన్రీ 'ఔనంటూ' తలాడించాడు.

రెండు మూడు రోజులుగా తెలుస్తున్న సమాచారం ద్వారా 'ఈ ఆస్తికి హక్కుదారుణ్ణంటూ వచ్చిన వాడు విశ్వనాథం భాగవతార్‌కు పుట్టిన వాడు కాడు' అన్న విషయం అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది. అందుకు ఆధారం భాగవతారే స్వహస్తాలతో రాసిచ్చిన వీలునామా. అందులో హెన్రీని గురించి చెప్పినప్పుడల్లా- 'నా దత్తపుత్రుడు' అంటూ రాశారాయన.

సొంత కొడుకుని ఎవడు దత్తత తీసుకుంటాడు? అంతకు మునుపే మరొకడితో సంసారం చేసి ఒక కొడుకును కన్నదాన్ని ఈ మనిషి చేర్చుకున్నాడు. అందుకే తాను గౌరవంగా బతికిన ఊళ్ళోకి రావటానికి ముఖం చెల్లక ఎక్కడో బతికి తన కథను ముగించుకున్నాడు. అయినా ఆస్తిపై మమకారం ఎవరిని వదిలింది కనక? ఎవడికో పుట్టిన, తన ఉంపుడుగత్తె కొడుక్కి వీలునామా రాసిచ్చిఆస్తి హక్కును అనుభవించమని పంపారని ఊహించుకుంటూ హెన్రీని అడిగాడు ధర్మకర్త.

"నేనిప్పుడు అడగబోయే విషయాన్ని తప్పుగా భావించవద్దు. పంచాయతీలో ఇవన్నీ అడగాలని ఒక పద్ధతి ఉంది, ఏమంటారు కరణంగారూ" అని తన హద్దు మీరే తనానికి ఒక అనుమతిని తానుగా అడిగి, స్వీకరించి హెన్రీని ప్రశ్నించాడు. ఫొటోలో ఉన్న స్త్రీని హెన్రీకి చూపించి, "ఈమెకు ఈయన మూలంగా మీరు పుట్టలేదు- అంతే కదూ? "

దాంతో దేవరాజులుకు కోపం ముంచుకొచ్చి తల పైకెత్తాడు. పోస్టాఫీస్ పంతులు కాస్త అమాయకత్వంతో నవ్వి పరిస్థితిని సర్దుబాటు చేశాడు. హెన్రీ అణకువగా నవ్వి నిదానంగా చెప్పాడు. "ఔనండీ, మీరన్నట్టే..."

అయితే హెన్రీ అన్న మాటలు ఎవరికీ వినిపించనంత గట్టిగా, పచార్లు చేస్తున్న దొరస్వామి వాళ్ల వైపుకు తిరిగి- కోపంతో అరిచిన అరుపు అందరినీ గడగడలాడించింది. "ఎవడు ఎవడికి పుట్టాడని ఎవడికి తెలుసు? ఇతరులు చెప్పేదాన్ని బట్టేగా అందరమూ నమ్ముతాం. అది మా అన్నగారే స్వయంగా రాసి ఇచ్చి పంపారుగా? అంతకు మించి ఏమిటి పరిశోధన...? ఇంకేం జరగాలో చూస్తారా...? " అని ఓ ఉరుము ఉరిమి మళ్లీ

పచార్లు చేయటం ప్రారంభించాడు.

సుబ్బరామయ్యకు ఓ క్షణం ఏమీ అర్థం కాలేదు. దొరస్వామి తనను కోప్పడుతున్నాడా లేక హెన్రీ మీద అధికారం చెలాయిస్తున్నాడా? అని అర్థం గాక ఆయన అతణ్ణి చులకనగా చూశాడు. ఆయన చేతిలోని ఫొటోను పంతులు తీసుకుని చూశాడు. కరణం ముందుకు ఆ ఫొటోను చాపినపుడు, 'ఉండనీ, ఉండనీ' అంటూ దాన్ని చేతిలోకి తీసుకున్నా కళ్లతో చూడకుండానే హెన్రీకి తిరిగిచ్చేశాడాయన.

హెన్రీ కాసేపు పప్పాను, మమ్మాను చూశాడు. దేవరాజులు కూడా చూశాడు. అతడికి ఆ ఫొటోలోని ఇద్దరూ నచ్చారు, కానీ వాళ్ళ గురించి అతడు ఒక్క మాట కూడా మాట్లాడకుండా అలాగే పత్రాలను చదవటంలో మునిగిపోయాడు.

సుబ్బరామయ్య గొంతు సవరించుకొని దేవరాజులుతో అన్నాడు. "పత్రాలూ, వీలునామా అన్నీ సరే; పన్నెండేళ్ళుగా దొరస్వామి స్వాధీనంలోనే ఈ ఆస్తంతా ఉంది. అప్పుడే దాని పూర్తి అనుభవ హక్కు వచ్చేసిందతడికి. ఇంత కాలంగా దాని బాగోగులు చూసుకున్నాడే... దాని గురించి కూడా మనం ఆలోచించాలి. కోర్టుకు వెళ్ళినా కూడా..."

హెన్రీ, సుబ్బరామయ్యను చూసి చిర్నవ్వు నవ్వాడు. ఆ నవ్వు అంతరార్థం తెలియక సుబ్బరామయ్య ఆపై మాట్లాడకుండా ఆగిపోయాడు. దొరస్వామి దాన్ని చెవిలో కూడా వేసుకోలేదు.

మున్సిఫ్, సుబ్బరామయ్యను అడిగాడు. "సరేనండీ, అందుకు మనమేం చెయ్యగలం? దొరస్వామే ఏమైనా చెయ్యాలి?"

పచార్లు చేస్తున్న దొరస్వామి అరుగు దగ్గరికొచ్చి నిలబడ్డాడు. ఆ ఫొటోను చూడాలని అతడికీ కోరిక కలిగింది. అందుకే అతడు అక్కడికి వచ్చి నిలబడ్డాడు. అయినా ఇప్పు

## వ్యాయామంతో ఎముకల బరువు



సాధారణంగా మన ఇళ్ళలో హార్లిక్స్, బోర్నవిటాలు అధిక శక్తిని, ఎముకలకి బలాన్ని ఇస్తాయని పాలలో కలిపి పిల్లలకి ఇస్తుంటారు. అలాగే ఆడపిల్లలకు ఎముకల బరువు పెరగడం కోసం అదనంగా కాల్షియం సప్లిమెంట్స్ ఇచ్చే తల్లిదండ్రుల్నీ తరచూ చూస్తుంటాం. అయితే పెనిసిల్వేనియా, జాన్స్ హాప్‌కిన్స్ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు దీనివల్ల పెద్దగా ప్రయోజనం లేదంటున్నారు. వాళ్లు 80 మంది ఆడ పిల్లలపై దాదాపు దశాబ్దం పాటు పరిశోధనలు జరిపారు. 12 నుండి 22 వయసున్న ఆడపిల్లల్లో కాల్షియం అదనంగా ఇవ్వటం వల్ల ఎముకలు పెరిగే బరువుకంటే, వ్యాయామంతో ఆరు రెట్ల బరువు అధికమవుతుందని కనుగొన్నారు. ఆడవాళ్ళలో 40 శాతం ఎముకల బరువు 12 నుండి 16 ఏళ్ళ లోపే పెరుగుతుంది. ముప్ఫయి ఏళ్ళ తర్వాత ఎముకల బరువు తగ్గటం మొదలవుతుంది.

పిల్లలకి పోషక విలువలున్న ఆహారంతో పాటు పాలు ఇవ్వాలి. క్రమం తప్పకుండా వ్యాయామం, వాకింగ్, డ్యాన్సింగ్ వంటివి చేయించడం వల్ల ఆశించిన ఎముకల పుష్టి పెరుగుతుంది. రోజుకి కనీసం 30 నిముషాలు ఈ పనులు చేస్తే చాలు. కాల్షియం సప్లిమెంట్స్ కంటే వ్యాయామమే సకల లాభదాయిని అని గుర్తించండి. అమ్మాయిలూ అలర్టవ్వండి.

డు అదంత ముఖ్యం కాదని భావించాడు. రెండు మూడు రోజులుగా అతడు తన స్వభావానికి విరుద్ధంగా మౌనంగా ఉన్నాడు. ఆ మౌనం పాండుకు భయాన్ని కలిగించింది.

దొరస్వామి చిన్నతనంలోనే ఆస్తిలో తన వాటాను తీసుకుని మొత్తం నాశనం చేసేశాడు. ఎవరికీ లొంగకుండా ఇల్లొదిలి పారిపోయాడు. ఆర్కేపేట క్రాస్ రోడ్లో లారీ వాళ్లకు సాయంగా ఉంటూ, క్లీనర్ పనులు చేసేవాడు. విశ్వనాథం భాగవతార్ ఊళ్ళో ఉన్న కాలంలో ఎప్పుడైనా వచ్చి ఆ ఇంటి అరుగు మీద కూర్చుని ఉండేవాడు. వదిన అతని పట్ల ఎంతో అభిమానాన్ని చూపించేది. బుద్ధి చెప్పేది. ఇంటి పట్టునే గుట్టుగా ఉండమని వేడుకునేది. అలాంటి సమయాల్లో దొరస్వామి మౌనంగా తల వంచుకొని కూర్చునేవాడు. విశ్వనాథం అతడికి ఏదీ చెప్పేవాడు కాడు. చెప్పి ప్రయోజనం లేదని ఆయన అర్థం చేసుకున్నాడు. అయినా తన పట్ల ఆయనకు ఒక మంచి తండ్రికి ఒక కొడుకు పట్ల ఉండే ప్రేమాభిమానాలు ఉండేవని దొరస్వామి గ్రహించాడు. ఏ కారణం వల్లనో ఆ ప్రేమాభిమానాలకు తాను అర్హుణ్ణి కానని తప్పుకొని తప్పుకొని పారిపోయేవాడు.

వదిన అతని పట్ల ఎంతో అభిమానాన్ని చూపించేది. బుద్ధి చెప్పేది. ఇంటి పట్టునే గుట్టుగా ఉండమని వేడుకునేది. అలాంటి సమయాల్లో దొరస్వామి మౌనంగా కూర్చునేవాడు

కొన్నాళ్లకు దొరస్వామి కుమారపురంలో పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఆ విషయం విన్న వెంటనే విశ్వనాథంగారు అతణ్ణి పిలిపించి, ఆస్తిలో అతడి వాటాను మనస్ఫూర్తిగా ఇచ్చేశాడు. కానీ దొరస్వామి పెళ్లి కూతురి తరపు వాళ్లతో ఏదో గొడవ పడగా, ఆ పెళ్లి ఆగిపోయింది. అటు తర్వాత అతడి గురించి ఎన్నో వినకూడని విషయాలు విశ్వనాథం చెవిన పడ్డాయి.

ఆ పరిస్థితుల్లోనే ఆయన ఆ ఊరొదిలి ఎక్కడికో వెళ్ళిపోయిన విషయం దొరస్వామికి తెలిసింది. అతడు ఆయన కోసం ఎక్కడెక్కడో వెదికాడు. ఎందరికో చెప్పి పంపాడు. తన తల్లిదండ్రులపై కూడా అంత అభిమానం లేదని అతడు ఆ తర్వాతే గ్రహించాడు.

మరో దారి లేక ఆరు మాసాల తర్వాత ఎంతో దుఃఖంతో, ఆవేదనతో అన్నగారి ఆస్తి సంరక్షణ బాధ్యతలను స్వీకరించాడు.

అప్పుడు కూడా ఇదే విధంగా ఇదే అరుగు మీద ఒక పంచాయతీ జరిగింది. అప్పుడు దేవరాజులు నాన్న, ఓ బ్రాహ్మణ అయ్యవారు, మరికొంతమందీ ఉన్నారు.

ఆ రోజు దొరస్వామి ఎందుకో పంచాయతీ ముందు ఏడ్చేశాడు. అప్పుడు మున్సిఫ్‌తో అన్న మాటలు ఇప్పుడు, ఈ క్షణంలో చెప్పినట్టే అతడి మదిలో కదలాడాయి.

"బిడ్డల్లేనోళ్ళ సొత్తుకు నేను బాధ్యతగా ఉండబోతున్నందుకు నాకెంతో అవమానంగా ఉంది. దానికి భయపడే నేను ఇన్నాళ్ళూ మా అన్నను వదిలి పరుగెత్తేవాణ్ణి. విధి అలాగే చేసేసింది. మా అన్న జ్ఞాపకంగా ఆ ఇంటిని మాత్రం అలాగే ఉండనివ్వండి. తాళం వేసి వెళ్ళిన ఆయన, ఖచ్చితంగా ఏదో ఒకరోజు తెరవడానికి వస్తారు. ఆయన వచ్చాక నేను అన్నింటినీ ఆయనకు అప్పగించేస్తాను. ఆ ఇంటిని ఇప్పుడు నేను స్వీకరించను. అది మా వంశపరంపరగా మా నాన్న, తాత, అంతకు మునుపు ఉన్నవాళ్ళు పుట్టిన ఇల్లు. నేను అందుకు తగినవాణ్ణి కాను. అన్న పోతే చాలు అని కాచుక్కూచున్నట్టు నేను ఇప్పుడు అందులోకెళ్ళి దూరడం బావుండదండీ. అదలాగే ఉండనీయండి. పాపం జీవాలు కసువూ, కుడితి లేకుండా చావకూడదనే పెరటి తలుపు తెరిచాం. అయినా ఆ ఇంట్లోకి వెళ్ళడానికి మనకు అధికారం లేదు. అలాగే

పాడుబడిపోయినా పోనివ్వండి, మనం తెరవ కూడదు. ఆయనే వెళ్ళిపోయాక ఇంకే ముంది" అని ఏడ్చాడు దొరస్వామి.

అతడి మాట కాదని, తాళం పగలకొట్టి ఆ ఇంటిని తెరవాలని చెప్పటానికి పంచాయతీ సభ్యులెవరికీ ధైర్యం చాల్లేదు. ఈ ముప్ఫై ఏళ్ళుగా దొరస్వామి ఏదో శపథం చేసినట్టు అన్న లేని ఆ ఇంటిని కళ్ళతో కూడా చూడ కూడదన్నట్టు ఉండిపోయాడు.

ఇంతకాలానికి ఆ ఇంటిని తెరవటానికి ఒకడు తాళంచెవితో వచ్చాడు. తాళం వేసిన వ్యక్తే వచ్చుంటే ఇంతకాలం తాను చూసిన ఎదురుచూపులకు ఫలితం దక్కిందని సంతో షపడి ఉండేవాడు దొరస్వామి. వచ్చినవాడు అన్న రక్తసంబంధం కల్గిన కన్నకొడుకై ఉంటే ఇప్పుడు ఏర్పడ్డ అయోమయం దొరస్వామికి కలిగేది కాదు. కానీ అన్ని విధాలుగా, పూర్తిగా మరో రూపు రేఖలు కల్గిన వాడు, తన అన్నకు వారసుడని సర్వహక్కులతో నిలబడ్డం చూసి సంతోషించాలో, దుఃఖించాలో తెలి యక కుమిలిపోయాడు దొరస్వామి.

ఇంతకాలంగా బెంగుళూరులో ప్రాణాలతో ఉన్న అన్న, తనను తలవనుకూడా లేదని తెలుసుకున్నప్పుడు ఎంతగానో వేదన పడ్డాడు దొరస్వామి. ఆస్తినంతా ఇప్పుడు అతడికి అప్పగించటంలో దొరస్వామికి ఆవగింజంత కూడా బాధలేదు. కానీ, తోడబుట్టిన తాను బతికుండగానే, చనిపోయినట్టు ఆ బంధాన్ని ఎందుకు తెంచేసినట్టు? తనపట్ల ఎందుకంత వంచన? తాను చేసిన ద్రోహం ఏమిటి?' అని అనుకుంటుంటే తన పుట్టుకే నిరాదర ణతో కూడినదిగా అనిపించింది దొరస్వామికి.

ఈ ఆలోచనలవల్లా, దానివల్లా కలిగిన దుఃఖం వల్లా మౌనంగా ఉండటంతో దాన్ని వాళ్ళు మరో విధంగా భావించి, చాలా నీచం గా మాట్లాడుతున్నారే? అని అరుగు దగ్గరికొ చ్చాడే కానీ, ఏం మాట్లాడాలో తెలియక తపిం చాడు. ఎలాగో శ్రమపడి నోరువిప్పాడు: "ఆరోజు ఇదే పంచాయతీలో నేను చెప్పిన దాన్నే ఇప్పుడూ చెప్పబోతున్నాను. మీకు జ్ఞాపకం ఉందా?" మున్సిఫ్‌ను చూస్తూ అన్నాడు దొరస్వామి.

"ఈ పంతులుగారూ, ఈ తమ్ముడు మాత్రమే అప్పుడు లేరు. మిగిలిన వారంతా ఉన్నారే! మీకు గుర్తు లేదా...? ఉండదు... ఎందుకంటే, ఏదో గొప్పకు అలా అంటున్నా నని అప్పుడు మీరు భావించి ఉంటారు. ఇప్పుడు, నేను పంచాయతీ పెట్టమనడానికి కారణమేమిటో తెలుసా? ఆ రోజు నేను చెప్పింది వట్టి మాటలు కాదని చెప్పడానికే. నేనేమీ బిడ్డల్లేనోడి సొత్తుకు పుట్టినవాణ్ని కానండీ! మూడు రోజులుగా మన ధర్మకర్త. ఆయన చాలా పెద్ద మనిషి. నా మీద అభి మానం ఉన్న వ్యక్తి. అందువల్ల 'తమ్ముడూ, నువ్వు పిల్లా జెల్లా గలవాడివి, పిల్లలు గలవా డివి' అని పదే పదే అంటున్నారు. 'పిల్లలు గల వాడంటే ఏమిటండీ అర్థం? నేను ఎవరి సొత్తునూ నమ్ముకుని పిల్లల్ని కనలేదే... ఇంత సొత్తు నా భాగానికి నాకూ వచ్చింది. కాదంటారా...? రెండేళ్ళలో అంతా పోగొట్టే శాను. తర్వాత ఎన్నో కష్టాలు పడ్డాను. కానీ, ఒక్క అడుగు భూమిని కూడా అమ్మటం జరి గిందా? అందులో దక్కిన ఫలితాన్ని మేం తిన్నాం. కాదనటం లేదు..." అని అంటున్న ప్పుడు అభిమానం అడ్డొచ్చి కన్నీళ్ళు పెట్టుకు న్నాడు. అతడు ఏడ్వడం చూసి పాండుకు కూడా ఏడుపొచ్చింది.

"అదేంటయ్యా అలా అంటున్నావ్. ఫలితం ఊరికే వస్తుందా? కష్టపడ్డావ్. బాగోగులు చూసుకున్నావ్. గుత్తకు తీసుకున్నోడు కూడా తినటం లేదూ" అంటూ మున్సిఫ్ అతణ్ణి సమాధానపరిచాడు.

హెన్రీ ఏమీ అర్థంగాని వాడిలాగా దేవరా జుల్ని చూశాడు.

తాను బతుకుతున్న ఈ గ్రామీణ జీవి తంలో ఇలాంటి మనుషులూ, ఈ రకమైన ఆచారాలూ ఉండడం ప్రత్యక్షంగా అనుభవిస్తు న్నందుకు అమితమైన 'ఓ మానవీయత' దేవ

రాజులు మదిలో నిండిపోయింది.

"ఇదుగోండి, ధర్మకర్తగారూ... మీరే మీ చేతుల్తో రాయండి. నాకు ఈ ఆస్తిలో ఏమీ అక్కరలేదు. మ్... రాయండి..."

"రాద్దామయ్యా, ఎందుకంత తొందర...? మనమంతా కలిసి మాట్లాడి, ఓ నిర్ణయం తీసుకున్న తర్వాతేగా రాయాలి" అంటూ ధర్మకర్త వెనకాడాడు.

"ఇంకేం మాట్లాడాలి? మ్! నేను ఓ నిర్ణయానికి వచ్చేశాను. దాన్ని చెబుతాను. రాయండి" అంటూ వికసించిన ముఖంతో అందర్నీ ఒకసారి పరికించి చూశాడు దొరస్వామి.

ఏదో కోపంలో దొరస్వామి ఓర్పు నశించి, కొత్తగా వచ్చిన వాడి ముఖాన, అతడి భాగాన్ని విసిరి కొడతాడేమోనని ధర్మకర్త ఊహించాడు. దొరస్వామిని కాస్త పక్కకు తీసుకెళ్ళి మాట్లాడుదామా అని అనుకున్నాడాయన. కానీ పంచాయతీ జరుగుతున్నప్పుడు తాను అతడిని అలా ఏకాంతంగా తీసుకెళ్ళి మాట్లాడ్డం బావుండదని అనుకున్నాడు.



బళ్ళో మధ్యాహ్న భోజనం కోసం గంట మోగింది. పిల్లలు 'ఓ' అని అరుస్తూ వీధిలోకి పరుగులు తీశారు. ఆ గుంపులో కాకీ నిక్కరు తెల్ల చొక్కా తొడుక్కుని వెళుతున్న కరిపిగాణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు హెన్రీ.

ఉన్నట్టుండి ధర్మకర్తకు ఆకలేసింది.

భోజనాలయ్యాక కూర్చుని రాద్దాంలే అని ధర్మకర్త ప్రతిపాదించాడు. కాస్త తర్జన భర్జన పడ్డాక అందరూ అలాగే అంటూ లేచారు.

తపాలా కట్ట తీసుకొచ్చిన పోస్ట్‌మెన్ పరంధామయ్య వాటిని బట్వాడా చెయ్యటానికి బయలుదేరి మొదట మున్సిఫ్ ఇంటిముందు కొచ్చి 'అరుగు మీద కూర్చుని ఉన్న దేవరాజులుకు, అతడి పేరుతో వచ్చిన ఒక ఉత్తరాన్ని ఇచ్చాడు.

ఉత్తరం మీదున్న దస్తూరిని చూడగానే అది తన భార్య వద్దనుండి వచ్చిందని దేవరాజులు అర్థం చేసుకున్నాడు. అక్కడే చింపి చదవటం కన్నా ఇంటికెళ్ళి చదవచ్చని భావించి దాన్ని అలాగే జేబులో దాచుకున్నాడు.

పంతులు ఇంటి సమీపంలో బడి పిల్లలు బొంగరాలు ఆడుతున్నారు.

"నేనూ అలా బజారు వరకూ వెళ్ళొస్తాను" అన్నాడు దొరస్వామి.

"ఉండవయ్యా భోంచేసి వెళ్లొచ్చు" అన్నారు మున్సిఫ్.

"ఫరవాలేదండీ... ముఖ్యమైన పనుంది. నేను దాన్ని చూసుకొని వస్తాను. ఒరేయ్ పాండూ రారా" అంటూ వాణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరాడు దొరస్వామి.

పిల్లలు బొంగరాలు ఆడటాన్ని వింతగా చూడసాగాడు హెన్రీ. దొరస్వామికి హెన్రీతో మాట్లాడాలని ఆశగా ఉంది. బొంగరాలు ఆడటాన్ని చూసే సాకుతో అతడు హెన్రీ పక్క కొచ్చి నిలబడ్డాడు. పెద్దవాళ్ళు వచ్చి వేడుక



చూడటంతో పిల్లల్లో ఉత్సాహం రెట్టింపయింది. హెన్రీ దొరస్వామి ఒకరిని చూసి ఒకరు నవ్వుకున్నారు.

"ఇతడు తనకు ఎంత సొంతమై పోయాడు!" అని భావించిన దొరస్వామి కొద్ది రోజుల క్రితం ఆ కొండ రహదారిపై మొట్ట మొదట అతణ్ణి కలుసుకున్న దృశ్యాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. తన అన్నకు కొడుకుగా పెరిగాడని అనుకోగానే దొరస్వామికి అతడిపై ఒక ప్రత్యేకమైన అభిమానం ఏర్పడింది. కాసేపు బొంగరాలాటను వేడుకగా చూశాక "నేను వెళ్ళి తొందరగా వచ్చేస్తాను" అంటూ వెళ్ళిపోయాడు దొరస్వామి. పాండు అతణ్ణి అనుసరించాడు.

* * *

ఇంటికొచ్చాక దేవరాజులు మేడమీదికెళ్ళి భార్య ఉత్తరాన్ని చదివాడు. అతడికి ఎంతో ఆనందం కలిగింది. ఆ ఆనందం అతడి ముఖంలో ప్రతిబింబించింది. అయినా దాన్ని అణచుకున్నాడు. ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని హెన్రీని భోజనానికి పిలిచాడు.

దేవరాజులు అంతకు ముందే చదివిన, తన భార్యరాసిన ఉత్తరం గురించి దీర్ఘాలో చనలో పడ్డాడు. 'దీని గురించి అక్కమ్మతో చెప్పాలి - హెన్రీతో చెప్పాలి - కానీ ఇప్పుడు కాదు - పంచాయితీ ముగియనీ' అనుకున్నాడు.




భోజనాలు ముగించి సుబ్బరామయ్య, మున్సిఫ్ అరుగుమీద కొచ్చి కూర్చున్నారు. నాగమ్మ తాంబూలం తట్టలో తమలపాకులూ, వక్కలూ, సున్నమూ, ఒక డజను అరటిపళ్ళూ పట్టుకొచ్చి వాళ్ళ ముందు పెట్టింది. మున్సిఫ్ తాంబూలం వేసుకున్నాడు. సుబ్బరామయ్య రెండు పళ్లు తీసుకొని తిన్నాడు.

వీధి చివర్లో దొరస్వామి వస్తూ ఉండటాన్ని ధర్మకర్త చూశాడు. వెంటనే మరోవైపుకు తిరిగి దేవరాజులు, హెన్రీ వస్తున్నారేమోనని చూసి వాళ్లు రాకపోవటంతో సంతోషపడ్డాడు.

"మున్సిఫ్‌గారూ, దొరస్వామి వస్తున్నాడు... మీరైనా చెప్పండి" అంటూ గొంతు తగ్గించి రహస్యంగా అన్నాడు సుబ్బరామయ్య.

దొరస్వామి వచ్చి వాళ్ళు కూర్చొని ఉన్న అరుగుకు ఎదురుగా ఉన్న చిన్న అరుగుమీద తన పైగుడ్డతో దుమ్ము దులిపి కూర్చొని, ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు.

దేవరాజులు, హెన్రీ రావటానికి ముందే ఈ చివరి అవకాశాన్ని ఉపయోగించుకొని, అతనితో మాట్లాడి, అతడి మనసును మార్చాలన్న తొందరలో అన్నాడు ధర్మకర్త: "దొరస్వామి, నువ్వు నీ సొంత బుద్ధితో మాట్లాడుతున్నట్టుగా నాకనిపించటం లేదయ్యా. మేమేమైనా ఎవరి ఆస్తినో ఉంచేసుకోమంటున్నామా...? మీ కుటుంబపు ఆస్తినే కదయ్యా! చట్టప్రకారం ఏమవుతుందో చూద్దాం? ! నువ్వు అలా కాస్త బిగువు చేస్తేనే మేము మధ్యస్తం చెయ్యటానికి వీలవుతుంది. ఏదో నువ్వు సగం వాడు సగం - అని మాట్లాడి తీర్చొచ్చు వాణ్ణి చూస్తే అలా మొండివాడిగా కనిపించటం లేదు. కానీ, ముంగిలా ఉన్నవాళ్ళను నమ్మలేం... అతడు అడగటానికి ముందు నువ్వే ఇచ్చేస్తానంటున్నావ్...? కాస్త ఆలోచించు...ఏమండీ గుర్నాధంగారూ... మాట్లాడకుండా ఉన్నారే... మీరైనా చెప్పండి...!"

మున్సిఫ్-సుబ్బరామయ్య మాటలతో మళ్ళీ కాస్త సందిగ్ధంలో పడ్డాడు. ప్రారంభంలో సుబ్బరామయ్యలాగానే, ఎవడో ఒక పరాయి వాడు వచ్చి దొరస్వామి ఆధీనంలోని ఆస్తినంతా ఆక్రమించుకోబోతున్నాడనే అంగలార్పు మున్సిఫ్ మనసులో ఉన్న మాట నిజం. కానీ దేవరాజుల సాయంతో ఆస్తిపై హెన్రీకి ఉన్న హక్కులు స్థిరంగా నిరూపణయ్యాక ఇక తానేమీ చెయ్యటానికి వీల్లేదని వెనకడుగు వేసి, హెన్రీకే ఈ ఆస్తంతా చెందటం న్యాయమని కూడా ఆయనకు అనిపించింది. కానీ, ఇప్పుడు సుబ్బరామయ్య మాటలు వింటుంటే 'ఉత్తినే ఒక వ్యాజ్యం మోపి, దొరస్వామికి కాస్త అనుకూలం చెయ్యటం ధర్మమైన పనేనా? 'అని ఆయనకూ అనిపించసాగింది. వచ్చిన వాడికి పెళ్ళాం, బిడ్డలూ అంటూ ఎవరూ లేరు. అతడు కొంచెం వదులుకోవచ్చు చూస్తుంటే మంచి కుర్రాడిలా కనిపిస్తున్నాడు... అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు మున్సిఫ్ గుర్నాధనాయుడు.

"ఏమండీ గుర్నాధం గారూ... మీరైనా చెప్పండి" మళ్ళీ అంటూ మౌనంగా ఉన్న మున్సిఫ్‌ను ఉసిగొల్పాడు ధర్మకర్త.

"నన్నేం చెప్పమంటారండీ? వాళ్ళ మధ్య ఏదైనా వివాదం వస్తే మనం తీర్చవచ్చు మనమే వివాదం సృష్టించడం ఏం బాగుంటుంది. దొరస్వామే అంటున్నాడుగా, 'పంచాయితీ పెట్టిందే అందరి ముందూ రాతకోతలు జరిపి అతడికి ఇవ్వటానికేనని'... అది తెలివిలేనితనమనుకుంటే ఆ కుటుంబమే తెలివిలేని కుటుంబంలాగా అనిపిస్తోంది. లేకపోతే అతడి అన్న అన్నింటినీ వదిలేసి పారిపోతాడా? తోడబుట్టిన తమ్ముడు ఒకడు ఊళ్ళో

ఉన్నాడని తెలిసీ ఇంత కాలంగా పట్టించుకో కుండా ఉంటాడా? ఇంత జరిగాక ఇలాంటి వాడిచేత వీలునామా రాసిచ్చి పంపుతా డా? ... ఆ కాలం పోయింది... పరాయివా డొచ్చి మనూళ్ళో ఆస్తి కొని మనతో సమంగా ఉండటమా? అని ఆలోచించడమంతా మారి పోయింది. అలా చూసినా, వచ్చినవాడు దొర స్వామి వద్ద కొనుగోలు చేయటానికికాదుగా వచ్చింది? ... 'ఇవ్వు, ఇవ్వద్దు' అని చెప్పటా నికి!... నాకేమో దొరస్వామి అలా చెయ్యటం చాలా గొప్ప పనిగా అనిపిస్తోంది. దాన్ని మనం కాదనకూడదండీ..." తన అభిప్రాయం చెప్పాడు మున్సిఫ్.

దొరస్వామి వాళ్ళ మాటల్ని తనకు సంబం ధంలేని కథలాగా వింటూ కూర్చున్నాడు. తన కు సంబంధించినంతవరకూ ఇదివరకే పరి ష్కారమై పోయిన ఒక విషయాన్ని అందరి ముందూ ప్రకటించే ఉద్దేశంతో ఉన్నాడతడు.

ఇంతలో పోస్టాఫీస్ పంతులు అక్కడికొచ్చి అరుగు పైకెక్కి గోడవారగా కూర్చున్నాడు.

సుబ్బరామయ్య పంతులు వద్ద ప్రస్తావిం చాడు. "మనలోమాట... ఏమండీ పంతులు గారు, దొరస్వామి అన్నింటినీ వచ్చినవాడికి రాసిచ్చేస్తానని అంటున్నాడే, దాన్నలాగే వది లివేయవలసిందేనా...?" అనగానే పంతులు, దొరస్వామి వైపు చూశాడు. అతడి మీసాలూ, కళ్ళూ చూడాలంటే ఆయనకెప్పుడూ భయమే. దొరస్వామి ఆయనకు చాలాకాలం నుండి తెలుసు. అతడి లారీలో చాలాసార్లు ప్రయా ణించాడు. ముందు సీట్లో కూర్చొని ఉన్న వాళ్ళలో ఎవరో ఒకరిని వెనక్కు పంపి ఆయ నకు చోటిచ్చి మర్యాద చేసేవాడు దొరస్వామి. అయినా ఆయనకు అతడంటే భయమే. దొర స్వామి ఉల్లాసంగా మాట్లాడే బూతు మాటల్ని కూడా రహస్యంగా ఆస్వాదించేవాడు పంతులుగారు.

ఇప్పటిదాకా దొరస్వామి అంటే భయాన్ని మాత్రమే కలిగి ఉన్న పంతులికి ఇప్పుడు అతడు చేసే ఈ మంచిపని అతడి పట్ల మర్యాదను కూడా పెంచింది. సుబ్బరామయ్య అల్పబుద్ధి దాన్ని జీర్ణించుకోలేక తపిస్తోందని పంతులు గ్రహించాడు. కానీ దాన్ని ఖండించి మాట్లాడ్డానికి వెనుకంజ వేశాడు.

"పెద్దవాళ్ళు మీరంతా ఉన్నారు... మున్సిఫ్ గారు ఏమంటున్నారు?" అన్నాడు పంతులు.

"ఇందులో నేను చెప్పడానికి ఏమీలేదు. దొరస్వామి చేసే పని అతడికి ఏ విధంగానూ లోటు కలిగించదు. డబ్బేనా ముఖ్యం? మరొ కరి సొత్తుకు ఆశపడనివాడికి భగవంతుడు ఏ లోటూ కలిగించడు." అంటూ మున్సిఫ్ వేదాంతం మాట్లాడడం మొదలెట్టేసరికి, దొర స్వామి దాన్ని వికసిత వదనంతో అంగీకరిం చటమూ, పంతులు దొరస్వామి చర్యనో లేక మున్సిఫ్ గారి వేదాంతాన్నో మెచ్చుకుంటు న్నట్లు తల ఊపడం చూసి ధర్మకర్తకు కాస్త మంట పుట్టింది.

"నాకు మాత్రం ఏం వచ్చింది పంతులూ? ఎవడి డబ్బైనా తీసి మరెవడికైనా ఇవ్వమంటే అందరికీ గొప్పగానే ఉంటుంది! ఉండదూ మరి? తనదాకా వస్తే అప్పుడు న్యాయం మరో విధంగా ఉంటుంది. ఈ దొరస్వామికి సొంత బుద్ధీ లేదు, చెప్పినా అర్థంగాదు. నా ఆస్తికి ఎవడైనా ఇలా భాగానికొస్తే నేను వది లిపెడతానా? గొప్పగా వేదాంతం మాట్లాడు తున్నారే... తనలాగే ఇతరుల్నీ చూడాలనీ పెద్దవాళ్ళు అంటారు. మీదాకా వస్తే దొరస్వా మిలాగా మీరు వదిలేస్తారేమోగాని, నేను వదులుకోను. అందుకే వదలకూడదని అంటు న్నాను" అన్నాడు ధర్మకర్త.

వీధిలో పిల్లలు బడికి వెళుతున్నారు. కొంద రు ఇంకా బొంగరాలాడుతున్నారు. దూరంగా దేవరాజులు, హెన్రీ వస్తుండటాన్ని ధర్మకర్త గమనించాడు.

"అయితే సరే... దొరస్వామీ చివరిగా నిర్ణయం తీసుకున్నావా? రాసుకుందామా?" అని తొందర పెడుతున్నట్టుగా అడిగాడు ధర్మ కర్త. దొరస్వామి నవ్వుతూ తలాడించాడు.

దేవరాజులు, హెన్రీ అరుగుమీద కొచ్చి

కూర్చుంటుండగా బళ్ళో గంట మోగింది. ఆడుతున్న పిల్లలు బడికేసి పరుగెత్తారు.

మున్సిఫ్ భార్యను పిలిచి లోపలున్న చిన్న 'డెస్క్' తెమ్మని చెప్పాడు. ఆవిడ తేగానే దాన్ని ధర్మకర్త వైపుకు తోశాడు. ధర్మకర్త దేవ రాజులు ముందుకు తోసి, "నువ్వే నీ చేత్తో రాయవయ్యా" అన్నాడు.

దేవరాజులు రాయటానికి సంచిలో నుండి కాగితాలను, పత్రాలను తీసి బల్లపైన పెట్టా డు. మున్సిఫ్ దేవరాజులుతో చెప్పాడు.

"కాస్త ఆగవయ్యా. ఇంకో గంట పోనివ్వు. ఇప్పుడు రాహుకాలం"

"ఓ... ఈ రోజు గురువారమా" అని ధర్మ కర్త ఆలోచనలో పడ్డాడు. అప్పుడు మెల్లగా నడిచి వచ్చి మున్సిఫ్ వెనకున్న స్తంభాన్ని ఆనుకుని కూర్చున్నాడు కరణం.

"పంచాయతీ కూడడానికే రాహుకాలం చూడాలండీ! ఇప్పుడు పంచాయతీ జరుగుతూ ఉందిగా. అందుకని ఆయనను రాయని వ్వండి, తప్పులేదు. సంతకాలు మాత్రం రాహు కాలం పోయాకే పెట్టుకుందాం" అన్నాడు దొరస్వామి. అది అందరికీ సమ్మతంగా అని పించింది. మున్సిఫ్ చిర్నవ్వుతో ధర్మకర్తకేసి చూశాడు. 'దొరస్వామి సొంతబుద్ధితో మాట్లా డ్డం లేదు' అని ధర్మకర్త అన్న మాటల్ని ఇద్దరూ గుర్తు చేసుకున్నారు.

"మీరు పెద్దవారు. చెప్పండి ఏం రాయా లో" అంటూ అందరినీ చూశాడు దేవరాజు లు. దొరస్వామి దేవరాజులుకు వివరించాడు.

ధర్మకర్త మరేమీ మాట్లాడలేదు. దేవరా జులు రాయటానికి ప్రారంభించినపుడు "ఓం" అని రాసి మొదలెట్టయ్యా అన్నాడు.

అతడు రాసి ముగించేంతవరకూ ఎవరూ మాట్లాడలేదు. అతడు పత్రాలన్నింటిని తిప్పి తిప్పి చూస్తూ మధ్యలో ఒక్కో విషయాన్ని సర్వే నెంబర్లతో సహా గుర్తుపెట్టుకున్నాడు.

మున్సిఫ్ మధ్యలో ఒకసారి లేచి వెళ్ళి మంచినీళ్ళు తాగి అందరికీ తాగటానికి పెద్ద చెంబులో నీళ్ళూ గ్లాసుల్నీ పట్టుకొచ్చి పెట్టా డు. దొరస్వామి లేచి మునసబు ఇంటి పక్క నున్న సందులోకెళ్ళి నిలబడి బీడీ తాగి వచ్చాడు. పాండు అతడి వెనకే వెళ్ళి అతడి వెనకే వచ్చి ఒక మూలగా నిలబడ్డాడు.

దేవరాజులు రాసి ముగించటానికి గంటకు పైగానే పట్టింది. రాయటం ముగించాక- "చదువుతానండీ... విని ఏదైనా చేర్చాలంటే చేర్చుద్దాం, తీసేద్దామంటే తీసేద్దాం" అని చెప్పి దేవరాజులు చదవటం మొదలెట్టాడు. అంత వరకూ తల వంచుకుని కళ్ళు మూసుకుని ఉన్న ఊరి కరణం, తన బాధ్యతను నెరవేర్చే ఉద్దేశంతో తల పైకెత్తి కళ్ళు తెరచి అందర్నీ ఒకసారి చూశాడు.

ఆ పత్రంలోని వాక్యాలను వింటున్నాడు, "ఏమైనా చదువుకున్న వాడు కదా" అని మున్సిఫ్ మనసులో దేవరాజుల్ని మెచ్చుకు న్నాడు.

"...పై తెలిపిన ఆస్తికి హక్కుదారుడైన విశ్వనాథ శాస్త్రి దత్తపుత్రుడైన హెన్రీకి..."- అని ఓ చోట చదువుకుంటూ రాగా దొర స్వామి అడ్డుపడి ఇలా అన్నాడు.

"విశ్వనాథ శాస్త్రికి కొడుకైన తర్వాత, వట్టి హెన్రీ అని రాస్తే ఎలాగండీ...? 'హెన్రీ శాస్త్రి' అని రాయండి"

దొరస్వామి ఆలోచనను అభినందించేలా దేవరాజులు తల పైకెత్తి అతణ్ణి చూసి చిర్న వ్వు నవ్వాడు. మున్సిఫ్, ధర్మకర్త కూడా అత డి ఆలోచననూ, అతడు తెలిపిన కారణాన్నీ శ్లాఘిస్తూ మాట్లాడుకున్నారు.

"రాయండి సార్, అందులో మా అభిప్రా యమేముంది? అన్న అతణ్ణి దత్తత స్వీకరిం చారు. తమ్ముడు దాన్ని అలాగే అంగీకరిస్తు న్నారు. బావుంది!... మిస్టర్ హెన్రీ శాస్త్రి" అని ఆ పేరును ఓ సారి ఉచ్చరించి చూశాడు పోస్టాఫీస్ పంతులు.

దేవరాజులు పత్రం డ్రాఫ్టులో హెన్రీ అని వచ్చే చోటల్లా హెన్రీ శాస్త్రి అని మారుస్తూ హెన్రీని చూసి ఇంగ్లిష్‌లో అన్నాడు.

"నేనూ ఇక మీదట మిమ్మల్ని హెన్రీ శాస్త్రి

అనే పిలుస్తాను-హలో! మిస్టర్ హెన్రీ శాస్త్రి" అని అతని ముందుకు చెయ్యి చాపాడు.

"థ్యాంక్యూ, మిస్టర్ దేవరాజులు" అని అతడి చేతిని అందుకుని ఊపాడు హెన్రీ.

దేవరాజులు తాను రాసిన దాన్ని మళ్ళీ మొదటనుండి అందరికీ వినిపించేలా చదవటం ప్రారంభించాడు.

ధర్మకర్త కళ్ళు మూసుకొనీ, దొరస్వామి ఒక్కో మాటకూ తలను ఆడిస్తూ, పోస్టాఫీస్ పంతులు తన కుడిపాదం ఆడించటం ఆపి ఛాతీపై చేతులు కట్టుకునీ, గ్రామ కరణం కళ్ళు తెరచి చూసి ఓ చెవి వెనుక అడ్డుపెట్టి శ్రద్ధగానూ, మున్సిఫ్ చాపపై ఓ చేత్తో ఏవో రాతలూ, చిత్రాలూ గీస్తూ, ఓ మూల నిలబడున్న పాండుకు ఆ వాక్యాలు ఏమీ అర్థంగాక, అయితే మిక్కిలి మర్యాదగానూ... అందరూ చాలా శ్రద్ధగా దేవరాజులు చదవటాన్ని వినసాగారు.

హెన్రీ రోడ్లో వచ్చీ పోయే వాళ్ళను చూస్తూ కూర్చున్నాడు.

చదవటం పూర్తయ్యాక-ఆ పత్రం మీద మొదట దొరస్వామి సంతకం చేశాడు. పంచాయితీ సభ్యులు ఒక్కొక్కరి దగ్గరా సంతకం చేయించుకున్న తర్వాత అందరి సమక్షంలో హెన్రీకి ఇవ్వటానికి అతడు లేచినపుడు, హెన్రీ నిదానంగా, స్థిరంగా ఇలా అన్నాడు, "నేను దీనికోసం ఇక్కడికి రాలేదండీ. మా పప్పా అదే మీరు చెప్పే విశ్వనాథశాస్త్రి... నేను ఆయన కొడుకుని. మిస్టర్ దొరస్వామి చెప్పారే, 'బిడ్డల్లేనోడి ఆస్తికి బిడ్డగా ఉండటమ'ని... చాలా కరెక్ట్... నేను బిడ్డల్లేని వాళ్ళకు బిడ్డగా ఉన్నాను, వాళ్ళ ఆస్తికి కాదు. పప్పా ఉన్నంతవరకూ పప్పానే నేను ఆయనకు కొడుకునన్న ప్రూఫ్... ఐ మీన్..." ప్రూఫ్ అన్న మాటను వాళ్ళకు అర్థమయ్యేలా చెప్పటానికి అతడు తడబడ్డప్పుడు దేవరాజులు అందుకుని. "సాక్ష్యం" అని అర్థం చెప్పాడు.

"ఎస్... థ్యాంక్యూ" అంటూ దేవరాజులతో అని తన మాటలను కొనసాగించాడు. "మా పప్పాకు నేను కొడుకుననటానికి మా పప్పా మాత్రమే సాక్ష్యం. ఆయన ఉన్నంతవరకూ ఈ ఊరిని గురించీ ఇక్కడున్న ఈ ఇల్లూ, పొలం ఇవన్నీ నేను పట్టించుకోను కూడా లేదు. పప్పానే చెబుతుండేవారు. ఆయన చెప్పినదంతా సరిగ్గా ఉంటుందా అని చూడ్డానికే నేను వచ్చాను. నన్ను 'ఎవరు?' అని అడిగితే నేను నా పేరు చెబుతాను. కానీ నా మనసులో 'నేను మా పప్పా కొడుకునని' మననం చేసుకుంటాను. మిస్టర్ దొరస్వామిని చూసిన వెంటనే ఐ మీన్... ఆయన పేరును విన్న వెంటనే ఆయనే మా పప్పా తమ్ముడు

## బ్రహ్మకైన పుట్టు..




తను కనబడడంతోనే అంతా గుటుక్కున మింగేస్తున్నారని బాధపడి, ఎలాగైనా తననీ కష్టాలనుంచి కాపాడమని కోరేందుకు బ్రహ్మను కలిసింది బెల్లం ముక్క.

అది నోరువిప్పక ముందే బ్రహ్మదేవుడు, 'ఓసీ.. బెల్లమ్ముక్కా.. ముందు నువ్వా గోడ చాటుకు వెళ్లు' అన్నాడు.

చాటుకు వెళ్లిన బెల్లమ్ముక్క పరమేష్టి ఎందుకలా చెప్పాడా అని ఆలోచించసాగింది.

దాని అంతర్యం కనిపెట్టిన చతుర్ముఖుడు 'ఏం లేదు.. నిన్ను చూస్తుంటే నాకే నోరూరుతుంది.. ఇప్పుడు చెప్పు ఏంటి నీ సమస్య?' అన్నాడు

'....'

అని నాకు అనిపించింది. అప్పుడే మీతో చెప్ప లేదూ? "అని హెన్రీ, దేవరాజులుని చూశాడు.

దేవరాజులు ఔనన్నట్టు తల ఊపాడు.

"పప్పా, మిస్టర్ దొరస్వామి గురించీ, ఈ ఊరిని గురించీ, తన తోటివాళ్ళను గురించీ, ఎంతో చెప్పేవారు. సో... మిమ్మలందరిని



'ఫస్ట్' సారి చూసినపుడే నాకు బాగా నచ్చారు. మా పప్పా కథ ఎలా చెబుతారో మీకు తెలుసుగా...! ఈ ఊరూ, అన్నీ నాకొక 'రిఫరెన్స్' లాంటిది. 'రెఫరెన్స్'... దానికేం చెప్పాలి మిస్టర్ దేవా? " అని అడిగి తన తెలియనితనానికి నవ్వుకున్నాడు హెన్రీ.

దేవరాజులు కాసేపు ఆలోచించి 'రిఫరెన్స్'కు సరైన తెలుగుమాట దొరక్క తానూ అదేవిధంగా నవ్వాడు.

తర్వాత వాళ్ళకు అర్థమయ్యేలా వివరిచాడు. హెన్రీ కొనసాగించాడు.

"పప్పా నన్ను ఈ ఊరికి వెళ్ళి ఇదంతా 'స్వాధీనం' చేసుకొమ్మని ఏనాడూ చెప్పలేదు. మిస్టర్ దొరస్వామినే పిలిచి అంతా రాసిచ్చుండేవారు, మా పప్పా అలా రాసివ్వకపోయినా అది ఆయనకు చెందుతుందని తెలిసే ఏం మాట్లాడకుండా ఉండిపోయారు. నన్ను ఆయ

న కొడుకుగా చేసుకున్న తర్వాత అది నాకు చెందుతుంది అని చెప్పటం ఆ రిలేషన్‌కు ఒక గుర్తు. అదే ఆయన చేశారు" పప్పా చనిపోయాక ఒక ఫిజికల్ లోన్లీనెస్ ఏర్పడింది నాలో"

దేవరాజులు 'ఫిజికల్ లోన్లీనెస్' అర్థం చెప్పాడు.

"కనీసం కన్నీళ్ళు కూడా పెట్టుకోలేదు నేను" అని తనలో తాను నవ్వుకున్నాడు హెన్రీ. "చావంటే ఏమిటో తెలియనపుడు అందుకు బాధపడొచ్చా? ... 'ఇది చెయ్, అది చెయ్యకు' అంటూ మా పప్పా ఎవరికీ చెప్పరు. నాకోసమే ఇక్కడికి రావాలనిపించింది. 'మన పప్పా ఊరికి వెళితే ఏం? ... అక్కడికే వెళ్ళి ఉండిపోతే పప్పాతో ఉన్నట్టే ఉంటుందని అనిపించింది. ఆయన ఎక్కడెక్కడో బతికారు... ఎక్కడైనా బతకడానికి ఆయన తయారైపోయారు... But ఈ ఊరికి తిరిగొచ్చి బతకాలని మాత్రం ఆయన అనుకోలేదు... Yet he loved this life... ఈ ఊరునీ, ఈ లైఫ్‌నీ, ఇక్కడున్న మనుషుల్నీ, అంతెందుకు మిస్టర్ దొరస్వామినీ...? ఆయన ఈయనను ఎంతగా అభిమానించేవాడో నాకు తెలుసు. ఒకవేళ ఆయన తర్వాత నేను ఇక్కడొచ్చి ఉండాలని ఆయన ఆశ పడ్డారేమోనని నాకు అనిపించింది. అందుకోసమే నేను వచ్చాను. ఆయన కొడుకుగా ఉండటానికి- these are my proofs" అని ఆ పత్రాలను చూపించాడు హెన్రీ.

"అన్-క్లెయిమ్డ్ ప్రాపర్టీస్ ఏవైనా ఆయనకు సంబంధించింది ఉంటే నాకు దానిపై ఒక హక్కు ఉంది. ఈ ప్రాపర్టీలన్నీ నా దగ్గరుండటం కన్నా మిస్టర్ దొరస్వామి వద్ద వుంటేనే ప్రయోజనం ఉంటుంది. అదే న్యాయం కూడా. ఆ ఇల్లు మాత్రం ఎవరికీ స్వంతం కాకుండా ఉంది. సీ, ద ఐరనీ... నాకోసమే మిస్టర్ దొరస్వామి ఆ ఇంటిని అట్టిపెట్టినట్టు ఉంది కదూ! ఆ ఇల్లే ఒక 'సింబల్'... మా పప్పాకూ నాకూ ఉన్న రిలేషన్‌కు ఆ ఇల్లు ఒకటి చాలు. అది కూడా లేకపోతే ఈ ఊరు చాలు నాకు.!

సో మిస్టర్ దొరస్వామి... ఇదంతా ఎప్పటి లాగే మీ దగ్గరే ఉండనీ. మీరు రాసిచ్చిన విధంగా ఈ పంచాయతీలోనే నేనూ అదంతా మీకు రాసిస్తాను"

"నేను ఇంతసేపూ ఎందుకు ఇదంతా చెప్పకుండా ఉన్నానంటే మీరందరూ నన్ను పప్పా కొడుకుగా యాక్సెప్ట్ చేశారా? లేదా? అని తెలుసుకోవడానికే. మొదటే ఇదంతా చెప్పుంటే, అందుకోసమే మీరు నన్ను పప్పా కొడుకని ఒప్పుకున్నట్లు అయిపోయేది. మిస్టర్ దేవరాజులు "Will you please write my statement too?"

అప్పుడే బడి గంటలు మోగాయి. పిల్లలందరూ ఓ అని అరుచుకుంటూ వీధిలోకొచ్చారు. ఆ సందడి తగ్గేంతవరకూ అందరూ మౌనంగా ఉన్నారు.

కళ్ళుమూసుకొని కూర్చొని ఉన్న ధర్మకర్త, కళ్ళు తెరిస్తే ఎక్కడ కన్నీరు బయటపడుతుందోనని భయపడి పై గుడ్డతో ముఖాన్ని తుడుచుకున్నాక హెన్రీని చూశాడు. ఆయన కళ్ళు ఎర్రబడున్నాయి. మున్సిఫ్ ముఖంలో ఓ పారవశ్యం కనిపించింది.

దొరస్వామికి పరిస్థితి చాలా ధర్మసంకటంగా అనిపించింది. హెన్రీ ఆలోచనను ఖండించి తన నిర్ణయాన్ని నిజం చేసుకోవాలన్న ఆతృతే అతడిలో కనిపించింది. కానీ అలా చెయ్యటం అసహ్యమైన పనిగానూ, ఏదో అతడిమీద తనకు కోపమనీ, అందుకే తాను ఇలా మొండితనాన్ని చూపుతున్నట్టు అవుతుందనుకున్నాడు. ఈ విషయంలో తాను ఇక ఏమీ చెయ్యకుండా ఉండటమే మంచిదని భావించి హెన్రీకి ఇవ్వబోయిన ఆ పత్రాలను అందరికీ తెలిసేలా హెన్రీ ముందు చాపమీద పెట్టేసి మునుపటిలా ఎదురుగా ఉన్న చిన్న అరుగు మీద వెళ్ళి కూర్చున్నాడు దొరస్వామి.

వ్యవహారం ఎలా ముగుస్తుందోనని పంతు

# కాలుష్యమంటే గిట్టని కలకంఠి

మనిషికో తీరు మహిలో సుమతీ అన్నదెవరో గానీ మాబాగానే అన్నారనిపిస్తుంది. కొంతమంది అభిరుచులు, నిర్ణయాలు చూస్తుంటే ఈ అభిప్రాయం మరింత బలపడుతూ ఉంటుంది. బార్బరా హాడ్రిల్ అనే 28ఏళ్ల అమ్మణ్ణి నిర్ణయమే ఇందుకో ఉదాహరణ. ఆవిడగారు ఆస్ట్రేలియా వెళ్లాలి. ఆమె ఉంటున్న చోటు నుంచి అది 9770 కిలోమీటర్ల దూరం. ఎంచక్కా విమానమెక్కి ఒక్క రోజులోగానే అక్కడికి చేరుకోవచ్చు కానీ ఆవిడగారికి విమాన ప్రయాణం అస్సలిష్టం లేదు. కారణం-కాలుష్యాన్ని ప్రోత్సహించడం తనకిష్టం లేదట. అందుకే ఆవిడ రకరకాల ప్రయాణ మార్గాలను ఎంచుకుంది. ఆ ప్రయాణ కాలం ఆరు వారాలు. దానికయ్యే ఖర్చు రెండువేల పౌండ్లు.





విమానంలో ప్రయాణిస్తే వెలువడే 5.2 టన్నుల కార్బన్‌డైయాక్సైడ్ ఈ ప్రయాణ రీతుల ద్వారా గణనీయంగా తగ్గుతుందట. తను ప్రయాణించే వాహనాల వల్ల కేవలం 1.4 టన్నుల కార్బన్‌డైయాక్సైడ్ మాత్రమే వెలువడుతుందట. 'నేనేనాడు విమాన ప్రయాణం చేయను. ఇంతంత దూరం రోడ్డు, ఇతర మార్గాల ద్వారా ప్రయాణం చేయడం కాస్త ఇబ్బందికరమే అయినా ఈ భూ మండలానికి చేటు కలిగించడం లేదన్న తృప్తి నాకుంటుందిగా అంటోంది. బార్బరా మాస్కో వరకు 1560 మైళ్లు బస్సులో, అక్కడి నుంచి బీజింగ్ వరకు 3600 మైళ్లు ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం ద్వారా అక్కడి నుంచి సింగపూర్ వరకు 2770 మైళ్లు మరో రైల్లోను ప్రయాణించాలని; సింగపూర్ నుంచి బ్రిస్‌బేన్ వరకు 3840 మైళ్లు నౌకాయానం చేయాలని నిర్ణయించుకుని అందుకు ఏర్పాట్లు చేసుకుంది. ఇంత కష్టపడి ఆమె ఆస్ట్రేలియా వెళ్లేది ఎందుకయ్యా అంటే అక్కడ జరిగే ఓ పెళ్లిలో తోడు పెళ్లి కూతురిగా ఉండడం కోసం. ఇంత కష్టపడి ప్రయాణించినా పెళ్లి సమయానికి చర్చికి చేరుకుంటే చాలు అంటోందామె. అయితే బార్బరా ఇంకా తిరుగు ప్రయాణం గురించి నిర్ణయించుకోలేదు. 'కచ్చితంగా విమానాల్లో మాత్రం కాదు. మరో విభిన్నమైన మార్గంలోనే నా తిరుగు ప్రయాణముంటుందంటోంది. పాఠకులు ఇది చదివేసరికి ఆమె ఆ మార్గంలో ఇంటికి చేరుకుని ఉంటుంది. ప్రత్యామ్నాయ సాంకేతిక పరిజ్ఞానంపై పనిచేస్తున్న ఆమె అడవిలో ఒక బిడారులో కాపురముంటోందటనే ఆమె తీరు తెలియడంలా..

# వారి జోస్యాలకు అర్థాలే వేరులే!



వానరాకడ, ప్రాణం పోకడ ఎవరికీ తెలియవంటారు. రెండోది నిజమే కానీ మొదటిదాన్ని మేం ఒప్పుకోం అంటుంటారు నిత్యం జోస్యం చెప్పడంలో ఆరితేరిన వాతావరణశాఖ వారు. ఆ జోస్యం నిజమేనన్నట్లు వారు చెబుతున్నా అది వారి వారి ప్రారబ్ధ ఫలాన్ని బట్టి ఉంటుందంటారు మిగిలిన వారు. అలాంటి ప్రారబ్ధఫలం బారిన పడి విలవిలలాడిన ఒకావిడ రుసరుసలాడుతోంది. రష్యాలోని ఉల్జనోవస్క్‌కు చెందిన అల్యోనా గవిత్రోవ నా వారాంతపు సెలవుల్ని పాడుచేశారంటూ వాతావరణ శాఖ మీద విరుచుకుపడుతూ కోర్టుకెక్కింది. వాతావరణ నిపుణులు ఉష్ణోగ్రత 28 డిగ్రీలకు తగ్గదని, చక్కటి ఎండ తళతళలాడుతుందని చెప్పడంతో నమ్మేసి వారాంతపు సెలవుల్ని దగ్గరలో ప్రకృతి దృశ్యాలు కనువిందు చేసే ఓ పార్క్‌లో గడపాలని వెళ్లిందావిడ. తీరా అక్కడకు వెళ్లాక ఎండ కన్పించకపోగా ఆకాశం అదేపనిగా జలజలా వర్షం కురిపించేసింది. ఆ జలధారల్లో ఆవిడ తడిసి ముద్దైపోయింది. స్వల్పకాలిక సెలవుల్ని చక్కగా ఆనందంగా గడపడానికి వెళితే ఇలా అయిందేమిటా అని బాధపడిపోతూ ఇంటికి తిరిగొచ్చింది. ఆ బాధ కోపంగా మారడంతో పళ్లునూరుతూ కోర్టు తలుపు తట్టింది. తప్పుడు జోస్యంతో నా సెలవుల్ని పాడు చేశారు కనుక నా ప్రయాణ ఖర్చుల్ని స్థానిక వాతావరణ విభాగం వారు ఇచ్చి తీరాల్సిందేనని డిమాండ్ చేసింది. పాపం ఒక్కసారి జోస్యం తప్పినందుకే ఆవిడలా రుసరుసలాడుతుంటే నిత్యం మన నిపుణులు చెప్పే జోస్యాలకు మండిపడుతూ మనమెన్నెన్ని సార్లు ఎన్నెన్ని కోర్టులు ఎక్కాలో గదా మరి!

లు ఆసక్తిగా ఎదురుచూస్తూ కూర్చొని ఉన్నాడు. దేవరాజులు తన భావాలనూ, సంతోషాన్నీ, పారవశ్యాన్నీ బహిర్గత పరచకుండా తబ్బిబ్బవుతున్నాడు. మున్సిఫ్ దీర్ఘాలోచనలో మునిగిపోయున్నాడు. ఎన్నో వ్యవహారాలను వాళ్ళు అక్కడ ఎదుర్కొని ఉన్నారు. అయితే ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో వాళ్ళకు అర్థం కావటం లేదు.

"నాకు ఒకటి అనిపిస్తోందయ్యా" అని మొదలు పెట్టాడు మున్సిఫ్. "దొరస్వామి చేసింది గొప్పతనం అనుకుంటే ఇది అంతకన్నా మహా గొప్పతనంగా ఉంది. ఆయన చెప్పటమూ న్యాయంగానే ఉంది. ఈయన చెప్పటమూ న్యాయంగానే ఉంది. అందులోనూ చూడండీ. ఒకటి న్యాయంగానూ మరొకటి అన్యాయంగానూ ఉండుంటే తీర్పు చెప్ప టం మనకు తేలిక. ఇరు న్యాయాల మధ్యకెళ్ళి తీర్పు చెప్పనేకూడదు. ఇప్పుడు నేను చెప్పబోతున్నది కూడా ఒక ఆలోచన మాత్రమే. హెన్రీ ఇష్టపడే విధంగా ఆ ఇంటిని తీసుకోనివ్వండి. ఆయన ఊరికి కొత్త. ఈ ఆస్తంతా పెట్టుకుని ఎలా 'కాబందు' చెయ్యాలో ఆయనకు తెలియదు. ఇంతకాలమూ ఈ ఆస్తినంతా పెట్టుకుని కాబందు చేసిన దొరస్వామి ఇప్పుడు హెన్రీతో కలిసి కాబందు చెయ్యనీ. ఇంకేమీ ఎవరూ ఎవరికీ రాసివ్వక్కరలేదు. రాసుకుంటే సమస్యలొస్తాయి. రాసుకోకుండా ఉండటమే చుట్టరికం. ఎలా ఉన్నా వీటికంతా హక్కుదారుడు హెన్రీ అని తేలిపోయింది. ఈ సొత్తుకంతా దొరస్వామి ధర్మకర్తలా ఉండాలి" అని ఆయన అంటుండగా ధర్మకర్త అడ్డుపడి గొప్పగా ప్రశంసించాడు.

"మన ఊరి గుడికే దొరస్వామిని ధర్మకర్తగా చేసేద్దామనిపిస్తోంది నాకు"

అందరూ ఆ మాటలకు మనసారా నవ్వారు.

"అయితే ఏదో ఒక తీర్మానం చేసేద్దాం" అన్నాడు పంతులు.

"ఇంకా తీర్మానం ఏమిటి పంతులూ? పాడుబడిపోయిన భాగవతార్ ఇంట్లో ఇప్పుడు హెన్రీ దీపం వెలిగించబోతున్నాడు. హెన్రీకి సొంతమైన పొలం, పుట్రా, తోపు, మడి, ఇల్లు, పుంజ, నంజ భూములు అన్నీ ఎప్పటిలాగే దొరస్వామి కాబందులో ఉంటాయి. అందులో ఏమైనా వాళ్ళ మధ్య సమస్యలేర్పడితే మనం పంచాయితీ కూడుదాం. సమస్యలు సృష్టించడానికి మనం పంచాయితీ కూడక్కర్లేదు, ఇక లేద్దాం" అన్న మున్సిఫ్, తన మాటలకు అందరూ లేస్తూ ఉండటాన్ని గమనించి, "ఉండండి, ఉండండి... కాఫీ తాగి వెళుదురు" అని తానూ లేచాడు.




పంచాయతీ ముగిశాక మున్సిఫ్ ఇంట్లో అందరూ కాఫీలు తాగారు. మున్సిఫ్ పాండును కూడా వదిలిపెట్టలేదు. పంతులు కూడా మొదట కాస్త జంకి తర్వాత తాగాడు. అయితే మున్సిఫ్ మాత్రం కాఫీ తాగలేదు. అది ఆయన కాఫీ తాగే సమయం కాదు కాబట్టి.

కాఫీ కోసం ఆయన ఇంటి లోపలికెళ్ళి నాగమ్మకు పని పురమాయించినపుడే వెనకున్న అరటితోటలో ఏదో పనిచేసుకుంటున్న రంగన్నను పిలిచి, "పనంతా అయిపోయింది, బండి కట్టి తయారుగా ఉండు" అని చెప్పి వచ్చాడు.

అందరూ వెళ్ళిన తర్వాత మున్సిఫ్ తోటలోని బావి దగ్గరకు వెళ్ళాడు. బావి అరుగు పైకెక్కి రంగన్న నిలబడి బకెట్లు బకెట్లుగా నీళ్ళు తోడి ఆయన తలపై కుమ్మరిస్తుండగా స్నానం పూర్తిచేశాడు. పొడి బట్టలు కట్టుకుని నుదుట కుంకుమ పెట్టుకుని, దేవుడికి నమస్కరించాడు. చేతికర్రతో బయటికొచ్చి నిల

బడి 'శకునం' చూశాడు. తర్వాత బండ్లో ఎక్కి కూర్చొని బయలుదేరాడంటే రాత్రి ఊరంతా సద్దుమణిగాకే ఇంటికి తిరిగొస్తాడు. ఆయన సాయంత్రం సమయాల్లో 'మత్తులో' మునిగి పోతాడు. అందుకోసం ఓ రహస్య ప్రదేశం, కొందరు ఆంతరంగిక స్నేహితులూ ఉన్నారు. ఆ స్నేహితుల మధ్య భేదాలు, వ్యత్యాసాలు బయటి ప్రపంచంలో ఉంటాయే తప్ప అక్కడ మాత్రం అందరూ సమంగానే మెలగుతారు. మున్సిఫ్, అక్కడ పూర్తిగా మరోవ్యక్తిలా ఉండేవాడు. అదంతా ఒక్క రంగన్నకు మాత్రం తెలుసు. నలభై ఏళ్ళుగా తోడుగా ఉంటున్నాడు మరి. ఈ విషయం ఎవరికీ తెలియదని ఆయన నమ్మకం. అదే నిజం కూడా. ఎవరో కొందరికి ఆ విషయం తెలిసిందంటే అందుకు నాగమ్మ కారణం కానీ ఆయన మాత్రం కాదు.

ఏదో పెళ్ళి సంబంధం మాట్లాడి మంగళకరంగా ముగిసినట్టు అందరూ ఎంతో సంతోషంగా బయటపడ్డారు. హెన్రీని, దొరస్వామిని - ఎవర్ని ఎక్కువ పొగడాలో తెలియక మార్చి మార్చి ఇద్దరినీ పొగడ్డంలోనే వాళ్ళ మాటలు కొనసాగాయి. తర్వాత విశ్వనాథశాస్త్రి జ్ఞాపకాలు ఆయనను తెలిసినవాళ్ళ మనసులో పదే పదే గుర్తుకు రాసాగాయి.

దొరస్వామి తన స్వభావానికి తగ్గట్టుగా అందర్నీ నవ్వించసాగాడు. హెన్రీని చూస్తున్నపుడు, అతడి ముక్కు తప్ప అచ్చు తన అన్నను పోలుచుకు పుట్టినట్టే అనిపించింది. ఆ విషయాన్ని అతడు నోరు విప్పి చెప్పినపుడు దేవరాజులు హెన్రీ ఒకర్నొకరు చూసుకొని నవ్వుకున్నారు.

అందరూ సెలవు పుచ్చుకొని లేచి బయలుదేరినపుడు దొరస్వామి, దేవరాజులు హెన్రీతో కలిసి మాట్లాడుతూ నడిచారు. దేవరాజులు ఇంటి సమీపానికి వాళ్ళు ముగ్గురూ వచ్చి నిలబడ్డప్పుడు దొరస్వామి తాను పుట్టిన ఆ పాడుబడ్డ ఇంటిని చూశాడు. అతడి కళ్ళకు ఆ ఇంటికన్నా తలుపుకు వేలాడుతున్న తాళం కప్పే పెద్దదిగా కనిపించింది.

దేవరాజులు దొరస్వామిని తన ఇంట్లోకి రమ్మని ఆహ్వానించాడు.

"ఫరవాలేదు సార్. నా బిడ్డలకు వాళ్ళ అన్నను తీసుకెళ్ళి చూపించొద్దా? రెండు రోజులుగా అడుగుతున్నారు. నా లాస్ట్ కొడుకు 'నేనూ వస్తాను' అని తెల్లారి ఏడ్చాడు. 'వొద్దురా, నేను వస్తున్నపుడు వెంట బెట్టుకొస్తానని' చెప్పి వచ్చాను. మీ ఇంటికి చుట్టంగా వచ్చినా హెన్రీ ఎప్పటికీ మా ఇంటి బిడ్డే" అని చెబుతూ హెన్రీ వైపు తిరిగి "అయితే మనింటికి వెళదామా? " అని ఆప్యాయంగా ఆహ్వానించాడు దొరస్వామి. హెన్రీ అతడి ఆహ్వానానికి సంతోషించి 'థాంక్యూ' అన్నాడు. తర్వాత దేవరాజులు వద్ద అనుమతి కోరేవిధంగా చూశాడు. "రేపు వెళ్ళొచ్చుగా" అన్నాడు దేవరాజులు.

"యస్.నేను కూడా అలాగే అనుకుంటున్నాను" అన్నాడు హెన్రీ.

హెన్రీని వదిలి వుండటానికి దేవరాజులుకు ఇష్టంలేదని గ్రహించిన దొరస్వామి "అలాగైతే రేపు మీరు కూడా మా ఇంటికి రండి" అని దేవరాజును కూడా ఆహ్వానించాడు. దేవరాజులు అందుకు సంతోషంగా అంగీకరించాడు.

"రేపు శుక్రవారం. రేపైనా స్కూలుకు వెళ్ళాలి. వారమంతా వెళ్ళలేదు. తర్వాత శని, ఆదివారాలు సెలవు. రేపు సాయంకాలం వస్తాం"

"మీరు ఐదు గంటలకల్లా తయారై ఉండండి. నేను మన 'రథం'తో వచ్చి నిలబడతాను' అని బయలుదేరాడు దొరస్వామి.

హెన్రీ, దేవరాజులు సరాసరి మేడమీదకు వెళ్ళారు. వాళ్ళిద్దరూ దీర్ఘాలోచనతో ఏం మాట్లాడకుండా మేడ మెట్లెక్కి వెళ్ళటంతో, గదిలోకొచ్చి కూర్చునేంతవరకూ, ఎవరూ దేన్నీ గమనించలేదు. హెన్రీ ఈజీచెయిర్లోనూ తాను మంచంపై కూర్చుని ఉండటాన్ని గుర్తించిన దేవరాజులు కరిపిగాణ్ణి వెదకటం కోసం గది కిటికీ గుండా కిందకి తొంగి చూశాడు. వాడు మేడ మెట్లు ఎక్కుతున్నాడు ఆ సమ

యంలో.

"ఎక్కడ ఈ కరిపిగాడు, కనిపించటం లేదే" అని దేవరాజులు గొణుక్కోవడం విని "ఏంటండీ ఇక్కడే ఉన్నాను" అన్నాడు కరిపిగాడు. అంతలో తానెందుకు వాణ్ణి పిలిచాడో దేవరాజులు మరచిపోయాడు.

"అక్కమ్మ అప్పాలు కాల్చిందట. తీసుకు రానా?" అని వాడు అడిగిన తర్వాత తాను వాణ్ణి పిలిచిన కారణం గుర్తొచ్చింది. మున్సిఫ్ గారి ఇంట్లో కాఫీ మాత్రమే ఇచ్చారు, అదీ అంత బాగో లేదు.

"అప్పాలు పట్టుకురా. తర్వాత చిన్న గ్లాసుల్లో ఇద్దరికీ కాఫీ పట్టుకురా" అన్నాడు.

కరిపిగాడు వెళ్ళాక దేవరాజులు హెన్రీని చూశాడు. హెన్రీ ఈజీ ఛెయిర్లో వెనక్కువాలి కళ్ళు మూసుకొని దేనిగురించో లోతుగా ఆలోచిస్తున్నట్టు కనిపించాడు. అతడి ఆలోచనలను చెరపకూడదన్న భావంతో దేవరాజులు మౌనంగా చొక్కా జేబులోనుండి భార్య ఉత్తరాన్ని తీసి చదవసాగాడు.

అంతలో కరిపిగాడు అప్పాలు పట్టుకొచ్చాడు. అవి వేడిగా ఉన్నాయి. హెన్రీ కళ్ళు తెరిచి కరిపిగాణ్ణి చూసి నవ్వాడు. రెండు అప్పాలను హెన్రీ ముందు చాపాడు కరిపిగాడు. హెన్రీకి అదేమిటో తెలియకపోయినా దాన్ని ఆస్వాదించి తినసాగాడు.

దేవరాజులు తన భార్య దగ్గర నుంచి వచ్చిన ఉత్తరాన్ని అలాగే చదివి వినిపించటమా, లేక విషయాన్ని మాత్రం చెప్పటమా? అని ఆలోచించాడు. ఆ ఉత్తరాన్ని హెన్రీ చదవటానికి ఇవ్వటంలో అతడికెలాంటి అభ్యంతరమూ లేదు. కానీ అతడలా

## ప్రశాంతతే కేశ సంరక్షణి



బట్టతల మేధస్సుకు నిదర్శనమనే అపోహ మాటేమో గానీ పిన్న వయసులోనే చర్మం తేలి తళతళ మెరిసే తలను చూసుకుని వాపోయే వారి సంఖ్య అసంఖ్యాకం. ఎన్ని చిట్కాలు అమలు చేసినా ఫలితం ఉండడం లేదంటూ ఉసూరుమనడమే కాక మోసపూరిత, ఆకర్షణీయ ప్రకటనలు చూసి జేబులు ఖాళీ చేసుకుంటుంటారు.

ఇవ్వాళ... ఈ బట్టతల చాలామందిని వేధిస్తున్న సమస్య. జుట్టు రాలడానికి వంశపారంపర్యత, పౌష్టికాహార లోపం ఇత్యాదులు కారణాలని శాస్త్రవేత్తలు చెబుతున్నా... చిన్న వయస్సులోనే జుట్టు రాలిపోతుండటంతో అనేక మంది బయటకు చెప్పుకోలేని మానసిక వేదనకు గురవుతున్నారు. అలాంటి వాళ్ళు అశాస్త్రీయ కారణాల గురించి బాధపడుతుంటారు. జుట్టు రాలిపోవడానికి అరికట్టేందుకు తీసుకునే ఆహారంలో మార్పు చేసుకోవడం, థైరాయిడ్, అనీమియా వంటి వ్యాధులుంటే మంచి మందులు వాడుతూ, తీవ్రమైన ఆలోచనలకు అడ్డుకట్ట వేసి మానసికంగా, ప్రశాంతంగా ఉంటే ఫలితం ఉంటుంది. అధికంగా కొవ్వు, ప్రోటీన్లు, ఐరన్ ఉండే ఆహారం తీసుకోవడం వల్ల కూడా జుట్టు రాలే ప్రమాదముంది. జుట్టు కత్తిరించటం వల్ల జుట్టు రాలి బట్టతల రావడం జరగదు అని చెప్తున్నారు. తెల్లబడ్డ వెంట్రుకలకు డై వేస్తే జుట్టు రాలదు కాని, చిట్లిపోతుందంటున్నారు టొరంటో యూనివర్శిటీ శాస్త్రవేత్త షరోన్ మిన్ట్జ్.

జుట్టు రాలిపోకుండా సంరక్షించుకోవాలంటే మితిమీరిన ఆలోచనలు మాని... పౌష్టికాహారం తీసుకోండి.

చెయ్యకపోవటానికి కారణం, హెన్రీకి తెలుగు చదవటం వచ్చా రాదా అనే తెలియకపోవటమే కాక, ఆ స్థాయికి, తాను చొరవ తీసుకోవటం సరైనదేనా అన్న సందిగ్ధంలో పడ్డాడు. కనుకే ఉత్తరాన్ని చేతిలో పట్టుకొని దేవరాజులు అతడితో ఇంగ్లిష్‌లో అన్నాడు.

"మీరు చాలా అద్భుతమైన మనిషి మీరు వచ్చినరోజే చెప్పారు, మాకు ఓ బిడ్డ పుడితే మా సంసార జీవితంలో ప్రశాంతత ఏర్పడుతుందని. ఇప్పుడు ఆమె నాకు ఉత్తరం రాసింది"- అని అంటున్నప్పుడే దేవరాజులు సంతోషాన్నీ, ఓ విధమైన హాయినీ పొందాడు. అతడన్న మాటలూ, అతడి భావాలనూ అర్థం చేసుకున్న హెన్రీ అప్పం తింటున్న చేతిని పళ్ళెంలో విదిలించి "కంగ్రాచ్యులేషన్స్, విష్ యూ ఎ బోయ్"అని ఉత్సాహంగా షేక్ హ్యాండిచ్చాడు. దేవరాజులు అతడికి కృతజ్ఞతలు తెలియ జేస్తున్నట్టు తన్నుతాను మరిచిపోయి నవ్వాడు. అతడికి నిజంగానే ఎంతో ఆనందంగా ఉంది. కానీ, తనకుండే సంతోషం ఆమెకు - కనకమాలక్ష్మికి లేదని ఆ ఉత్తరంలోని మాటలు గుర్తుకురాగా, దేవరాజులు ముఖం వాడిపోయింది. అతడు నిట్టూర్చి హెన్రీతో అన్నాడు.

"ఆమె ఇందుకు సంతోషించటం లేదు"

"నో... నో... షి మస్ట్ బి హేపీ"

"కానీ, ఆమె అలా రాసిందే" అని ఉత్తరంలోని చివరి వాక్యాల్ని చదివి వినిపించాడు దేవరాజులు. "ట్రైనింగ్ స్కూల్లో చేరటానికి అన్ని ఏర్పాట్లూ పూర్తిచేసుకున్నాక ప్రకృతి నా జీవితంలో ఇలాంటి ఒక కుట్ర పన్నినందుకు నాకు సంతోషం కలగడంలేదు. అంతా దేవుడి దయ. ఎవరెవరు చేసిన పాపాన్ని వాళ్ళే అనుభవించి తీరాలిగా. ఇక్కడ ఇంట్లోని వాళ్ళందరూ సంతోషిస్తున్నారు. మీకెందుకు పెళ్ళాం బిడ్డలు? అయినా మీకు తెలపటం నా ధర్మం కదా? " అని చదవటం ముగించి కోపంతో ఆ ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకొని ముఖాన్ని గంటు పెట్టుకున్నాడు దేవరాజులు.

హెన్రీ అతణ్ణి దీర్ఘంగా చూశాడు. "మీ భార్యకు నిజంగానే ఈ విషయంలో సంతోషంగా లేదని మీరు అనుకుంటున్నారా? "

"ఆమె అలాగే కదా రాసింది"

"అందుకేగా మిమ్మల్ని అడుగుతున్నాను, మీరు కూడానా? అని"

"అయితే ఆమెందుకు అలా రాయాలి? "

"అసలు విషయం అదే. ఒక భార్య తన భర్తకు ఈ విషయాన్ని ఉత్తరం ద్వారా చెప్పే పరిస్థితి ఏర్పడిందే, ఆ బాధ ఫలితమే ఆ మాటలు. పోను పోను అన్నీ సర్దుకుంటాయి... ముందు మీరు వెళ్ళి అక్కమ్మకు ఈ సంతోషకరమైన విషయాన్ని చెప్పండి" అని అతణ్ణి తోస్తున్నట్టు అక్కణ్ణించి కదిలేలా చేశాడు హెన్రీ.

దేవరాజులు ఉత్తరాన్ని చేత్తో పట్టుకొని మేడమెట్లు దిగి కిందకి వెళ్ళాడు.

అక్కమ్మ కాఫీ ఇచ్చి పంపటానికి కరిపిగాణ్ణి పిలుస్తూ వసారాలోకి వచ్చింది అదే సమయంలో దేవరాజులు మేడ మెట్లు దిగి ఆమెతో ఆ విషయాన్ని చెప్పటమూ, అది విని ఆమె ఛాతీపై తన రెండు చేతుల్ని పెట్టుకుని- కళ్ళు మూసుకుని దేవుడికి కృతజ్ఞతలు తెలిపి, ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవటాన్ని మేడ మీదున్న కిటికీ గుండా చూశాడు హెన్రీ. ఆమె మాటల్లో హెన్రీకి అర్థమైంది 'సుబ్రమన్యానే' అన్న ఒక్క మాట మాత్రమే!




హెన్రీ కుమారపురంలోని దొరస్వామి ఇంటికి చుట్టంగా వచ్చి రెండు రోజులు కావ

స్తోంది.

శుక్రవారం సాయంత్రం దొరస్వామి అంతకు ముందు చెప్పినట్టే- తన రథాన్ని దేవ రాజులు ఇంటి ముందు నిలిపాడు.

దేవరాజులు దొరస్వామిని మేడ మీదికి తీసుకెళ్ళి కూర్చోబెట్టి కాఫీ, టిఫిన్ పెట్టి మర్యాద చేశాడు. దొరస్వామి ఆ ఇంటిని చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు.

"ఇంత అందంగా ఇల్లు కట్టి, ముందు భాగాన ఆ అడ్డుగోడ కట్టి ఎందుకలా పాడు చేశారు? " అని అతడడిగినపుడు, దేవరాజులు నవ్వుతూ ఇలా బదులిచ్చాడు.

"అంతా మీ వల్లే. మీ ఇంటిని మీరు పాడు బెట్టారు. పాడుబడ్డ ఇంటిని చూడకూడదనే వాళ్లు ఎండబోసే చోటుకు ముందు అడ్డుగోడ కట్టి ఈ ఇంటి అందాన్నే చెడగొట్టుకున్నాం" అని అక్కమ్మ పదే పదే చెప్పేది.

"మా ఇంటిని ఈ వీధిలోకెల్లా ఓ అంద మైన ఇల్లుగా ఒక్క నెలలోనే చేసి చూపిస్తాను చూడండి" అని దొరస్వామి అన్నాడు.

సాయంత్రమే వాళ్ళతో కుమారపురానికి వెళ్ళి, దొరస్వామి కుటుంబ సభ్యులతో రాత్రి గడిపి దేవరాజులు, మరుసటి రోజు ఉదయం హెన్రీతో చెప్పి, అత్తగారింటికి వెళ్ళాడు.

కుమారపురంలోని దొరస్వామి ఇల్లు పెంకు టిల్లే అయినా విశాలంగా ఉంది. హెన్రీకి ప్రత్యేకంగా వీధి పక్కనున్న ఓ గదిని కేటా యించారు. దొరస్వామి పిల్లలు అతణ్ణి చుట్టు ముట్టారు. దొరస్వామికి ఐదుగురూ మగ పిల్లలే. ఆరవది ఆడపిల్ల, ఇంకా పసిబిడ్డ. అతడి భార్య నవనీత. హెన్రీ, దేవరాజులూ ఇంటికొచ్చినప్పుడు, ఆ ఇద్దరిలో ఎవరు హెన్రీ నో తెలియక తబ్బిబ్బయింది. తర్వాత దొర స్వామిని పక్కకు తీసుకెళ్ళి అడుగుతుంటే హెన్రీ, తానే ఆమె వద్దకు వచ్చి "నేనే హెన్రీని" అని చెప్పి నమస్కరించాడు. ఆమె కూడా ప్రతి నమస్కారం చేసింది. దొర స్వామి ముసలి అత్త, అల్లుడు లేని సమయం చూసి ఆ గదికి వచ్చి హెన్రీతో మాట్లాడాలని రెండు రోజులుగా కాచుకొని ఉంది.

దొరస్వామి తన పిల్లల్నందర్నీ ఏదో ఒకటి తిట్టే పిలుస్తాడు.

"రేయ్ కడుపోడా" అంటూ ఒక పిల్లవాణ్ణి పిలిచాడు. వాడు దగ్గరకు రాగానే పక్కన కూర్చోబెట్టుకొని ప్రియంగా వాడి పొట్ట తడు ముతూ "వీడే మన మూడో కొడుకు త్యాగ రాజు" అని అభిమానంగా చెప్పాడు. అలాగే అందరినీ హెన్రీకి పరిచయం చేశాడు. "పెద్ద వాడి పేరు బాల మురళీ, రెండవ వాడు బిళ హరి, మూడవవాడు త్యాగరాజు, నాల్గవవాడు సభాపతి" అని అతడు వరుసగా చెబుతుం డగా, ఆ పేర్లన్నీ పప్పా ముందుతరం వాళ్లవ ని హెన్రీకి గుర్తొచ్చింది. అయిదవ వాడికి వివేక్ అన్న పేరును పెట్టినట్టు చెబుతున్న ప్పుడు, 'ఇది మాత్రమే నేనై పెట్టిన పేరు' అని చెప్పి తన ఒళ్ళో నిద్రపోతున్న పసిబిడ్డకు తన వదిన పేరు పెట్టబోతున్నట్టు చెప్పాడు దొర స్వామి. హెన్రీకి ఆమె పేరు తెలియదు. పప్పా ఆమె పేరు ఎప్పుడూ చెప్పలేదు.

"ఒక ఏడు పూర్తయ్యాకే మనూరి గుడికి వచ్చి వెంట్రుకలు తీసి, పేరు పెట్టడం ఆచా రం. ఇంకా నాలుగు నెలలుంది. అంతలో మన ఇంటిని కట్టేద్దాం. చెవులు కుట్టే కార్య క్రమం అక్కడే పెట్టుకుందాం" అని ఉత్సా హంగా ఆ రోజంతా మాట్లాడుతూనే ఉన్నాడు దొరస్వామి.

హెన్రీ రెండు రోజులుగా దొరస్వామి ఇంట్లో తనకు కేటాయించిన గదిలో సంతో షంగా గడపసాగాడు.

దేవరాజులు ఇంటి మేడ మీదనుండి కిటికీ గుండా చూసే దృశ్యాలు ఇక్కడ కనిపించవు. కానీ అతడు అక్కడున్నట్టే... ఆ గదిలో ఏకాంతంలోనూ, దొరస్వామి పిల్లల కేరింత లతోనూ సంతోషంగా గడపసాగాడు.

దొరస్వామి పిల్లల పేర్లన్నీ తెలిశాయే తప్ప, ఎవరెవరి పేరు ఏమిటో తెలియక అప్పుడ ప్పుడు తికమకపడిపోతున్నాడు. వాళ్ళు అతణ్ణి 'అన్న' అని పిలవసాగారు. దొరస్వామి భార్య

అలాగే పిలవాలని చెప్పింది. హెన్రీని తన కొడుకులాగానే ఆమె భావించినా వయస్సు కారణంగా మర్యాదను కాపాడుకోవాలని ఆమె ఎక్కువగా అతడికి కనిపించకుండా ఉంటోంది.

ఎదురు పడినపుడు మనస్ఫూర్తిగా నవ్వి మాట్లాడేది.

దొరస్వామి ఇంట్లో రెండురోజులు అతడికి విశేషంగా విందులు జరిగాయి. దొరస్వామి కుటుంబ సభ్యులు అందరూ వెజిటేరియన్ భోజనాన్నే ఇష్టపడుతున్నట్టు గ్రహించాడు హెన్రీ. దొరస్వామి అప్పుడప్పుడు బయట 'మాంసం' తింటాడట.

దేవరాజులు ఇంటి భోజనానికీ, ఇక్కడ తింటున్న భోజనానికీ ఉన్న వ్యత్యాసం హెన్రీకి అర్థమైంది.

దేవరాజులు ఇంటినుండి హెన్రీ బయలుదేరుతున్నప్పుడే ఆ లెదర్ బ్యాగును పంచాయతీ వాళ్ళకు చూపించిన పప్పా ఫొటోను పెట్టుకున్న బ్యాగును మర్చిపోకుండా పట్టుకొస్తున్నాడా అని గమనించాడు దొరస్వామి. ఒకవేళ అతడు దాన్ని మరచిపోయుంటే దొరస్వామి అతడికి గుర్తు చేసుండేవాడు. తమ కుటుంబంలోని వాళ్ళందరికీ దాన్ని చూపించాలనీ, ఆ సంతోషాన్ని అందరితోను పంచుకోవాలనీ అనుకోవటంతో అప్పటి దాకా ఆ ఫొటో గురించి అడగకుండా ఊరుకున్నాడు.

అందరూ కూర్చొని మాట్లాడకుంటున్నపుడు అప్పుడే గుర్తుకొచ్చినట్టు దొరస్వామి అడిగాడు. "దొరా! ఆ ఫొటో తీసుకొచ్చావు కదూ? అదే అన్న ఫొటో...దాన్ని కాస్త ఇవ్వు. అందరికీ చూపిద్దాం".

హెన్రీ బ్యాగు తెరచి ఆ ఫొటోను తీసి, అందులోని పప్పాను, మమ్మాను చూసి దాన్ని దొరస్వామికి ఇచ్చాడు.

దొరస్వామి ఆ ఫొటోను అందుకుని మన సారా చూశాడు.

అతణ్ణి శోకం చుట్టుముట్టింది.

'ఈయన నిజంగానే చనిపోయారా? పది రోజులైందా...?'

దొరస్వామి ఏడవలేదు. అతడి ముఖం నల్లబడింది. తన అన్న గురించి ఏమేమో అడగాలని మనసులో వేల భావాలు కదలాడాయి. ఎప్పటిలాగానే తొందర ఎందుకని అన్నింటినీ అణచుకున్నాడు.

పిల్లలు ఒక్కరొక్కరుగా ఆ ఫొటోను చూశారు. దొరస్వామి అన్నను గుర్తుచేసుకుంటూ ఆయనకు సంబంధించిన ఒక సంఘటన గురించి వివరించాడు. దొరస్వామి పప్పా గురించి చెబుతున్నప్పుడల్లా హెన్రీకి సంతోషంగా అనిపించేది.

ఆ సందడీ, మాటలూ విని అక్కడ ఏం జరుగుతోందో అర్థం చేసుకున్న నవనీత, గది బయటే, లోపలున్న వాళ్లకు కనిపించకుండా మరుగ్గా వచ్చి నిలబడింది.

పెద్దకొడుకు బాలమురళిని రహస్యంగా సైగచేసి పిలిచింది. ఆ ఫొటోను అందరూ చూశాక పట్టుకురమ్మని వాడితో చెప్పింది. భార్య కొడుకుని పిలవడాన్ని, వెళ్ళి రావటాన్ని గమనించిన దొరస్వామి విషయమేమిటని ప్రశ్నించాడు కొడుకును.

"అమ్మా కూడ ఈ ఫొటో చూస్తుందట తెమ్మంది" అని చెప్పాడు వాడు.

"ఏయ్ గాడిదా, ఇక్కడికి వచ్చి చూడే! ఏం సిగ్గు నీకు? దొర మన బిడ్డే కదా... లోపలికి రా" అని ఆమెను పిలిచి ఫొటోను ఆమె చేతికిచ్చాడు దొరస్వామి. నవ్వుతూ లోపలికొచ్చి ఆ ఫొటో తీసుకొని చూసిన నవనీత కన్నీళ్ళు పెట్టుకొని పైట కొంగుతో ముఖం తుడుచుకుంటూ బయటికి వెళ్ళింది. అమ్మ ఏడుపును చూసి పిల్లలందరి ముఖాలు మారిపోయాయి.

నాలుగేళ్ళ త్యాగరాజు మాత్రం నవ్వుతూ, "నాయనా, అమ్మ ఏడుస్తాంది" అన్నాడు. దొరస్వామి నిట్టూర్చాడు.

ఆ ఫొటోలో ఉన్న ఇద్దరూ ఇప్పుడు లేరు. చాలా కాలం నుండే వాళ్ళు లేని లోటును తట్టుకోవడానికి అలవాటు పడ్డ దొరస్వామి

మనసులో ఆ ఫొటో, శోకాన్ని మళ్ళీ తిరగ తోడినట్టయింది. అయినా ఆ దుఃఖాన్ని వెళ్ళ గక్కుకోవడానికి కూడా తనకు హక్కు లేకుం తడా పోవడం అతడికి ఎంతో ఆవేదన కలి గింది.

'న్యాయంగా చూస్తే ఆ కుటుంబమే ఇప్పు డు దుఃఖంలో మునిగిపోయి ఉండాలి. ఒక ఏడాది వరకూ ఏ శుభకార్యమూ, పండగలూ, విశేషాలూ ఈ ఇంట్లో జరపటానికి వీల్లేదు. కానీ లోపల పాయసం, ఏలకులు, పచ్చ కర్పూరం వాసనలు వీస్తున్నాయి. అతిథు



లకు విందు జరగబోతున్నది. అంతా ఎంత వ్యత్యాసంగా, వినోదంగా జరుగుతోంది" తనలో తాను నవ్వుకున్నాడు దొరస్వామి.

నవనీత బాధ పడటం తనపట్ల ఆమెకున్న ప్రేమేనని అతడికి అర్థమయింది.

ఆమెకు ఆయనెవరో తెలియదు. ఆయన గురించి దొరస్వామే చెబుతుండేవాడు. ఆయ న పోయిన వారమే చనిపోయారన్న వార్త చెప్పినప్పుడు ఇంట్లోని వాళ్లందరూ తలంటి పోసుకున్నారు. ఇంటిని నీళ్ళతో కడిగి శుభ్రం చేసుకున్నారు. ఆ రోజు మాత్రం దుఃఖాన్ని పాటించారు. దొరస్వామికి అది కూడా సమ్మ తంగా లేదు.

'ఆయన కోసం ముప్ఫై ఏళ్ళకు ముందే దుఃఖం అనుభవించాను. ఇప్పుడాయన మతం మార్చుకొని మరో జాతి ఆడదాన్ని పెళ్ళి చేసుకొని, బిడ్డను కని, వాణ్ణి వారసు డుగా రూపొందించి చనిపోయినా ఆయన పరాయివాడే కదూ? వాళ్ళ మతాచారం ప్రకా రం ఆయన చావుకు దుఃఖపడాల్సిన వాడు ఆయన కొడుకైన హెన్రీయే తప్ప, ఆయన తమ్ముడైన - ఆయన చేత వెలి వేయబడ్డ వేరే జాతి వాడనైన- నేను కాదు" అనుకున్నాడు దొరస్వామి. అయినా అతడి భావాలు జాతి మత సమూహ బంధాలకన్నా ఒక మాన వీయ సంబంధానికి ప్రాతిపదిక కావటంతో దుఃఖించకుండా ఉండలేకపోయాడు.

ఆ రోజు భోజనానికి కూర్చునే ముందు పప్పా, మమ్మా ఉన్న ఆ ఫొటోను నట్టింట్లో రెండు పక్కలా దీపాలు వెలిగించి, పూలు జల్లి, ఆ పూట భోజనాన్ని నైవేద్యంగా పెట్టాకే

అందరూ తిన్నారు. నవనీత ఆఖరి బిడ్డను కూడా ఫొటో ముందు బోర్లా పడుకోబెట్టి ఎత్తుకెళ్లింది.

"ఏం జరుగుతోంది? " అని అడిగి తెలుసుకున్నాడు హెన్రీ. అతడు ఎలా సాష్టాంగ నమస్కారం చెయ్యాలో తెలపటానికి దొరస్వామి తానూ ఒకసారి సాష్టాంగపడి నమస్కరించాడు.

హెన్రీ సాష్టాంగపడి చేతుల్ని రెండూ జోడించి, కళ్ళు మూసుకొని 'పప్పా పప్పా' అని మనసులో గట్టిగా అనుకున్నాడు. మూడవసారి అతడు అన్నప్పుడు అది ఇతరులక్కూడా వినిపించింది. దొరస్వామికి దుఃఖం పొంగుకొచ్చింది. మరో వైపుకు తల తిప్పుకున్నాడు.

"నువ్వింకా నిద్ర పోలేదా? " అంటూ ఒత్తిగిలి పడుకున్నాడు. "ఒక్కోసారి అలాగే మా అన్న మాట్లాడుతున్నట్టే ఉంటుంది. నేను వొట్టి మొద్దుని. ఆయన ఎలా చనిపోయారు? ... కాయలా పడ్డారా? ... మా వదిన ఏమైంది? ... ఆమె ఎప్పుడు చనిపోయింది? ... అని అడగనేలేదు..." నిరుత్సాహంగా అన్నాడు దొరస్వామి.

"పదిరోజులే అయిందట ఆయన చనిపోయి! ఆ కుర్రాడి మొహంలో దిగులనేదే లేదు. చిన్న పిల్లల్తో చేరి ఎంతగా ఆడిపాడుతున్నాడని!" అని ఆశ్చర్యపోయింది నవనీత.



దొరస్వామికి అంత రాత్రైనా నిద్రపట్టలేదు. అతడు హెన్రీతో ఏమేమో మాట్లాడాలని ఆశపడ్డాడు.

అతడు కళ్ళు మూసుకొని ఉన్నా నిద్రపోవడం లేదని అర్థం చేసుకుంది నవనీత. ఆమెకూ నిద్రపట్టడం లేదు.

"చాలా మంచివాడండి... పసిబిడ్డ మనసు..."అని నవనీత హెన్రీ గురించి చెప్పింది.

"బాధ లేకుండా ఉంటుందా? బాధపడి ఏం చెయ్యాలి...? ఆరోజు పంచాయతీలో ఒక మాటన్నాడు, దాంతో నేను అర్థం చేసుకున్నాను- అన్నపైన అతడికి ఎంత ప్రేముందో? 'ఆయనున్న ఊళ్ళో ఉంటే ఆయనతో ఉన్నట్టే ఉంటుందనీ ఇక్కడికొచ్చాను. ఆయన గుర్తుగా ఈ ఇల్లు ఒక్కటే చాలు. అదీ లేకపోతే ఈ ఊరే చాలు. అని చెప్పాడు. అంటే

ఏమిటర్థం! మనమంతా అతడి నాన్న బంధువులం కాదూ? ఆయన మీదున్న ప్రేమ వల్లనే మనతో ఉండటానికే ఇక్కడికొచ్చాడు".

"అది సరే, ఆ అబ్బాయి క్రైస్తవుడా ?" చాలా సేపటినుంచి తనలో మెదులుతున్న సందేహాన్ని అడిగింది నవనీత. ఫొటోలో చూసిన 'మమ్మా'ను గుర్తుచేసుకుంది ఆమె. దొరస్వామి కాస్త ఆలోచించి జవాబిచ్చాడు. "తెలియటం లేదు 'హెన్రీ' అన్న పేరును బట్టి చూస్తే అలాగే అనిపిస్తోంది. వాళ్ళమ్మ క్రైస్తవులు, అందుకని పేరు అలా పెట్టుండొచ్చు. దాంతో మనకేం పని? మా అన్న మారకుండా ఉండుంటే ఇతడెలా క్రైస్తవుడవుతాడు? ఆయన మతం మారారా, లేదా అని తెలియటంలేదు. మారుంటే మారుండాలిగా? పత్రాల్లో, వీలునామాలో ఎక్కడా అలా మారినట్టు తెలియటంలేదు. సరేలే, ఈ కాలంలో ఇంకా జాతి, మతాలు కూడానా? నాకు తెలిసినవాడొకడున్నాడు. మనలాగే లారీ తోలుతాడు. చౌదరి అని పేరు. అతడు హిందువు. అతడి భార్య క్రైస్తవ మతం... దానికేమంటావ్?"

"మరి పిల్లలూ?" అని అడ్డు తగిలింది నవనీత.

"పిల్లలంటే పిల్లలే. ఏదో ఒక మతమై ఉండాలా ఏం? వాళ్ళకు వయసొచ్చాక నాన్న జాతి కావాలో, అమ్మజాతి కావాలో వాళ్ళే నిర్ణయించుకుంటారు. లేకపోతే ఏ జాతీ లేకుండా మన హెన్రీలాగా ఉండిపోతారు..." అని అంటున్న దొరస్వామి, ఆ సాయంత్రం అన్న ఫొటోను పెట్టి నమస్కరించినపుడు, అతనూ సాష్టాంగపడి నమస్కరించి నుదుట విబూది పెట్టుకోవడాన్ని గుర్తుచేసుకుంటూ అన్నాడు.

"అతడు మన మతమే! గాడిదా... నువ్వు గమనించలేదా? సాయంత్రం నుదుట విబూది పెట్టుకున్నాడు" అన్నాడు దొరస్వామి.

వీధి చివర్లో ఉన్న పోలీస్ స్టేషన్‌లో రెండు గంటలు కొట్టటం వినిపించింది.

"రెండైంది. ఇక నిద్రపో" అని లాంతరు దీపాన్ని తగ్గించి కళ్ళు మూసుకుని పడుకుంది నవనీత.




ఆ సాయంత్రం దొరస్వామి తొందరగానే ఇంటికొచ్చాడు.

పగలంతా హెన్రీ ఆ గదిలో పిల్లల్తో మాట్లాడుతూ, ఆడుతూ కాలక్షేపం చేశాడు. మధ్యాహ్నం భోజనానికి మాత్రం అతడు గదిలోనుండి బయటికొచ్చాడు. కాఫీ, టిఫినూ, పళ్ళూ, అన్నీ గదిలోకే పిల్లలు పట్టుకొచ్చారు. ఆది లక్ష్మమ్మ అప్పుడప్పుడూ వచ్చి గదిలోకి తొంగి చూసేది. "ఈ వానర సైన్యం ఉందే ఎలాగబ్బా?" అని గొణుక్కుంటూ వెళ్ళిపోయేది.

వీధిలో లారీ శబ్దం విన్న వెంటనే "నాన్న వచ్చేశాడు... నాన్న వచ్చేశాడు" అని పిల్లలు అరుస్తూ ఎగురుకుంటూ పరుగెత్తుకెళ్ళారు.

"ఔను-మీ నాన్న ఏనుగు మీద వస్తున్నాడు" అని ఆదిలక్ష్మమ్మ వాళ్లను కసురుకుంది.

సాయంత్రం దీపాలు వెలిగించాక, బిడ్డను భుజంపై పడుకోబెట్టుకొని ఇంటి ముందున్న వసారాలో పచార్లు చేస్తున్నాడు దొరస్వామి. హెన్రీ అరుగు మీద మోకాళ్ళు చుట్టూ చేతులేసుకుని కూర్చున్నాడు. పిల్లలు వీధిలో ఆడుకుంటున్నారు.

ఎదురింట్లో వీధి అరుగు పక్కనున్న గూట్లో, ఓణీ వేసుకున్న ఒక అమ్మాయి నూనె దీపాన్ని వెలిగించి వెళ్లింది. అందరి ఇండ్ల ముందూ అదే విధంగా దీపాలు వెలగటం హెన్రీ గమనించాడు. కాసేపయ్యాక ఇక్కడా నవనీత గూట్లో దీపం వెలిగించింది. గూట్లో

నుండి కారిన నూనె చారిక గోడమీద చిత్రం లాగా అందంగా కనిపించింది. పచార్లు చేస్తున్న దొరస్వామి హెన్రీ ముందుకొచ్చి నిల బడి అన్నాడు.

"ఏం దొరా? నాకో ఆలోచన తోస్తోంది. నువ్వు కృష్ణరాజపురంలో మన ఇల్లు కట్టి ముగించేంత వరకూ ఇక్కడే ఉండి రోజూ ఒక దఫా అక్కడికెళ్ళొస్తే పోలా? ఎలాగూ రోజూ లారీ వెళుతుంది. సాయంత్రం తిరిగి వస్తుంది. ఆలోచించి చూడు, దేవరాజులుతో నీకు ఎంత స్నేహమో, ఎంత పరిచయమో నాకూ తెలుసు... ఎంతైనా అది పరాయివాడి ఇల్లేకదా... ఈ ఊరు వచ్చిన వెంటనే ఆయన నీతో చాలా సన్నిహితమయ్యారని తెలుస్తోం ది. అయినా ఇది మనిల్లు... ఇక్కడ ఉంటేనే బావుంటుంది. నువ్వే ఆలోచించి చూడూ... నీకు ఏది మంచిది అనిపిస్తే అలా చేద్దాం" అ న్నాడు నవ్వుతూ దొరస్వామి.

అతడు ఏం చెబుతున్నాడో హెన్రీకి అర్థ మైంది. అర్థం చేసుకున్నాడు.

"మీరు చెప్పినట్టే చేద్దాం! మిస్టర్ దేవరా జులు ఒంటరిగా ఉంటున్నారు. ఆయన వైఫ్ కూడా ఊళ్ళో లేదు. అక్కడ మేడ మీద గది ఉంది. నేను ఆయనతో ఉండటం ఆయనకు తోడుగా ఉన్నట్టుంటుంది. అందుకని వారం లో ఒక రోజు ఆయనతో ఉంటే ఆయనకు సంతోషంగా ఉంటుంది..." అన్నాడు హెన్రీ. అతను తను సూచించిన దానికి అంగీకరించి నట్లు మాట్లాడ్డంతో దొరస్వామి చాలా సంతో షించాడు.

కొద్దిసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపో యారు.

"ఔనూ, అన్న... అదే మీ నాన్న ఎలా చని పోయారు?... ముసలి తనమొచ్చి చనిపో యారా?... చాలా బాయలా పడ్డారా? నా గురించి మాట్లాడేవారని చెప్పావే... ఏం మాట్లాడేవారు...?" అని చాలా ఆతృతగా మృదువైన స్వరంతో హెన్రీ ముఖాన్నీ, కళ్లనీ దీక్షగా చూస్తూ అడిగాడు దొరస్వామి.

"పప్పా వజ్ సిక్స్టీ ఫైవ్..." అని ఇంగ్లీ షులో చెప్పటం మొదలెట్టిన హెన్రీ కాస్త నిదా నించి, "ఆయనకు అరవై ఇదు దాటి ఉం టాయి." అని భాషాంతరం చేసి చెప్పాడు. "ఆయన మంచం ఎక్కలేదు. చెప్పాలంటే పది రోజులు పడకపై ఉండుంటారు. అదీ ఆ లాస్ట్ వన్ వీక్ హాస్పిటల్లో ఉన్నారు. నేను ఎప్పుడూ ఆయనతోనే ఉండేవాణ్ణి. అది నా అలవాటు. ఆయన రిటైర్ అయ్యి పదేళ్ల యింది. పప్పా కంటే మూడేళ్ళ ముందు మమ్మా చనిపోయారు. ఆయనకు కడుపులో ఏదో ప్రాబ్లం వచ్చింది..." అని చెబుతున్న ప్పుడు అతడు మళ్ళీ కాస్త నిదానించాడు.

'పప్పా తాగుతాడన్న విషయం వీళ్లకు తెలిసి ఉండే అవకాశం లేదు. కాబట్టి ఆ విషయం ఇతనితో చెప్పకూడదు' అని నిర్ణ యించుకున్నాడు హెన్రీ.

'ఏ ఉద్యోగంలో ఉండి ఆయన రిటైర్ అయ్యారో'నని దొరస్వామికి అర్థంకాక ఆలోచ నలో పడ్డాడు.

"ఆయన ఏం పని చేసేవారు?"

"ఓహ్, యూ డోంట్ నో దట్" అని ఓసారి నవ్వి, పై పెదవిని వేళ్ళతో తట్టి, అతడు పప్పాను హాఫ్‌ప్యాంట్, చొక్కాతో చేతిలో టిఫిన్ బాక్స్‌తో పనికెళ్ళే దృశ్యాన్ని ఊహించుకొని చెప్పాడు.

"రైల్వేలో ఫైర్‌మేన్‌గా ఉండేవారు. నాకు ఊహ తెలిసినప్పటి నుంచి ఆయన ఆ పనే చేస్తుండేవారు. అంతకు మునుపు ఆర్మీలో ఉన్నారు. బర్మాలో కూడా ఉన్నారట. అక్కడే మమ్మాను మీట్ అయ్యారు. నేను ఆ పైనే కదా? అందుకనీ అంతకు మునుపు జరిగిన వన్నీ ఆయన చెబితేనే నాకు తెలిసింది"

"అయితే మా వదిన గురించి నీకేమీ తెలి యదా?" అని చాలా నిరుత్సాహంగా అడి గాడు దొరస్వామి.

"తెలుసు. పప్పా చెప్పారు. ఈ ఊరొదిలి వెళుతున్నప్పుడు పప్పా ఎంతో మనస్తాపంతో ఉన్నారు. ఆ సమయంలోనే ఇట్ సీమ్స్..

హి లాస్ట్ హర్. దాంతో ఎంతో కుంగిపోయి ఆయన ఎక్కడెక్కడో ఒంటరిగా తిరుగుతూ కాలం గడిపారు. ఆమెను తలుచుకుని ఆయన పదే పదే ఏడ్చేవారు. ఆ ఏడుపు ఆయన చనిపోయేంతవరకూ కొనసాగింది. కొన్ని సమయాల్లోనే ఏడ్చేవారు. తర్వాత దాన్ని తలచుకొని ఆయనే నవ్వుకునేవారు. అయితే మా మమ్మా చనిపోయినపుడు ఆయన ఏడవలేదు. తలచుకుని తలచుకుని ఏమీ ఏడవలేదు. అప్పుడే ఆయన చెప్పారు, 'చావంటే ఏమిటో తెలియనప్పుడు దానికి మనం ఎందుకు బాధపడాలి? అని' తమ సంగతులు చెబుతున్న హెన్రీ తన నోటి నుండి పొరబాటున ఏమైనా నిజాలు వస్తాయేమోనని కాసేపు మౌనం వహించాడు.

దొరస్వామి తను ఈ విషయాలతో ఓ రకంగా తన అన్న జీవితాన్ని ఊహించగలిగాడు. కానీ ఆయన ఇక్కడికి శాశ్వతంగా రాకపోవటానికి కారణమేమిటో తెలుసుకోలేకపోయాడు.

"ఎందువల్ల ఆయన ఈ ఊరినీ, మమ్మల్నీ అంతగా అసహ్యించుకున్నారు? " అని బాధగా అడిగాడు దొరస్వామి.

"నో... నో! ఆయనకు ఎవరినీ అసహ్యించుకోవడం చేతకాదు. ఒకవేళ, ఆ మొదటి వైఫ్ అదే మీ వదినెతో కలిసి బతకడానికి వీల్లేకపోవటంతో ఈ ఊరికి తిరిగిరావటానికి ఆయన మనస్సు ఒప్పుకోలేదేమో? ... మా మమ్మాతో ఇక్కడికొచ్చి జీవించడానికి ఆయనకు కష్టంగా ఉండి ఉండొచ్చు అదీగాక మతాంతర వివాహం చేసుకున్న విషయం తెలిస్తే ఈ ఊళ్ళో తనకున్న గౌరవమర్యాదలు తగ్గిపోతాయనుకున్నారో ఏమో? కానీ ఆయన మిమ్మల్నంతా ఖచ్చితంగా అసహ్యించుకోలేదు. ఆ విషయం నేను చెప్పగలను..." అని స్పష్టం చేశాడు హెన్రీ.

"ఆయన మీ గురించి చెబుతున్నప్పుడు కళ్ళు మూసుకొని మిమ్మల్ని ఊహించుకునేవారు. 'నాకొక తమ్ముడున్నాడు. మా అమ్మ వాణ్ణి 'దొరా' అని పిలిచేది. వాడు నా కన్నా చాలా చిన్నవాడు. మొరటువాడు. ఎవరికీ భయపడకుండా ఊళ్ళు తిరుగుతూ ఉండేవాడు. ఇప్పుడు వాడూ పెద్దవాడైపోయి పెళ్ళి చేసుకొని పిల్లల్ని కని పిల్లాపాపలతో గడుపుతూ ఉంటాడు. ఎక్కడున్నా వాడు బావుండాలని అంటూ మీ కోసం దేవుణ్ణి ప్రార్థించేవాడు" హెన్రీ చెప్పిన మాటలకు ఊc... కొడుతున్న దొరస్వామి కళ్ళు కన్నీటితో నిండిపోయి అతడికి తెలియకనే బుగ్గలపై జారి కిందపడ్డాయి.

"...ఇంతగా మీ మనసులో అభిమానం ఉందే, వెళ్ళి మీ తమ్ముణ్ణి చూసి రావచ్చుగా? అని చెప్పాలని నీకెందుకు అనిపించలేదు దొరా? " అడిగాడు దొరస్వామి.

హెన్రీ దానికేం సమాధానం చెప్పాలో తెలియక దొరస్వామి ముఖాన్ని నిశితంగా చూశాడు.

అప్పటికి బాగా చీకటి పడిపోయింది. వాళ్ళు మాట్లాడుకుంటున్న సమయంలో నవనీత వచ్చి గూట్లో దీపాన్ని లోపలికి తీసుకెళ్ళింది. దొరస్వామి ముఖం చీకట్లో సరిగ్గా కనిపించలేదు. లోపల పిల్లలు గట్టిగా చదువుకుంటున్నారు.

"పప్పాతో-ఇలా చెయ్యండి, అలా చెయ్యకండి అని నేను ఏనాడూ ఏం చెప్పలేదు. ఆయనా నాకూ అలా చెప్పిందీ లేదు"

"ఔను. ఆయన అలా చెప్పరు" అని హెన్రీ మాటల్ని ఒప్పుకుంటున్నట్లు తలాడించాడు దొరస్వామి.

"ఏం దొరా? ఆయన క్రైస్తవులుగా మారిపోయారా? " కుతూహలంగా అడిగాడు దొరస్వామి.

"లేదు. మమ్మానే క్రిస్టియన్. ఆయన ఎప్పటిలాగానే ఉండేవారు. గణపతి గుడికెళ్ళేవారు. హిందూ ప్రేయర్, సాంగ్స్ - అన్నీ పాడేవారు. నన్ను కూడా క్రిస్టియన్‌గా మార్చాలని మమ్మా చెప్పేది. 'అదంతా వాడి ఇష్టాయిష్టాలకే వదిలెయ్యాల'ని పప్పా చెప్పేశారు.

స్టిల్ ఐ హేవ్ నో ఎనీ రిలిజియన్! నాకు మతం లేదు"

"మరి దేవుడికి మొక్కుతున్నావే..." అడ్డు పడి అడిగాడు దొరస్వామి.

"ఎస్, దానికేముందీ? దేవుడికీ మతానికి ఏమిటి సంబంధం? " అని అతడు ప్రశ్నించటం దొరస్వామిని ఆలోచనల్లోకి నెట్టేసింది. అతడు చెప్పింది ఎంత కరెక్టో, ఆలోచించే కొద్దీ స్ఫురించసాగింది దొరస్వామికి. ఉన్నట్టుండి తలాడించి నవ్వుతూ అతణ్ణి ప్రశంసించాడు దొరస్వామి. "దేవుడికీ మతానికి ఏమిటి సంబంధం...! శెభాష్ దొరా... మా బాగా చెప్పావ్? "

విశ్వనాథం గురించి ఏమేమో అడిగి తెలుసుకోవాలన్న దొరస్వామికి అన్నీ తెలిసిపోయినట్టు అనిపించింది. కొన్ని విషయాల గురించి అడగటం తనకు తాను చేసుకునే అమర్యాదగా భావించాడు. ఆ రోజు పంచాయితీలో సుబ్బరామయ్య అడిగిన విధంగా అడగడానికి వీలౌతుందా?

అయినా, ఆయన క్రైస్తవులుగా మారలేదంటే హెన్రీ వాళ్ళ అమ్మను ఎలా పెళ్ళి చేసుకోవడానికి వీలౌతుందీ?

'ఒకవేళ పెళ్ళంటూ చేసుకోకుండా చేర్చుకుని ఉంటారా? ' అని ఆలోచించటమో- అదే నిజమైన పక్షంలో దాని గురించి మాట్లాడ్డమో చేస్తే అది అన్న మీద తనకున్న మర్యాదను పలుచన చేసినట్లే అవుతుందని భావించాడు దొరస్వామి.

"సరే, అవన్నీ ఏమంత ముఖ్యమైన విషయాలా" అని తన సహజ ధోరణిలో మనసులోనే దాచుకున్నాడు.

"హెన్రీనే అంటున్నాడుగా, 'ఆయన చివరి వరకూ మతం మారలేదు' అని, తనక్కూడా ఏ మతమూ లేదనినూ? "

దొరస్వామి మదిలో కదలాడిన ఓ ప్రశ్నకు అతడు అడగకపోయినా తానుగా బదులిచ్చాడు హెన్రీ.

"పప్పా! అన్నిటి గురించీ చాలా క్లీన్‌గా వీలునామా రాసి పెట్టారు. బెంగుళూరులో కనకరామయ్య అని ఒక లాయర్ ఉండేవారు. అప్పుడప్పుడు పప్పా ఆయనను కలవడానికి వెళ్ళేవారు. నేనూ తోడు వెళ్ళేవాణ్ణి. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నప్పుడు నేను కూడా ఉండేవాణ్ణి. నా గురించి వాళ్ళు మాట్లాడుతున్నప్పుడు కూడా నేను ఏమీ అడ్డుమాట్లాడేవాణ్ణి కాను. పప్పా నన్ను పదేపదే చూసేవాడు, కానీ ఏమీ అడిగేవారు కారు. ఆ వీలునామా రాస్తున్నప్పుడు నేను కూడా ఉన్నాను... ఇప్పటికీ ఆ వీలునామా నాబ్యాగులోనే ఉంది. ఆయన చనిపోతే తనకెలా దహన క్రియలు జరిపించాలో అందులో ఆయన రాశారు. తానే రాసి, ఆ వకీల్‌నూ, నన్నూ ముందు పెట్టుకుని చదివి వినిపించారు. చేతిలో ఆ కాగితాన్ని పెట్టుకుని కళ్ళు మూసుకుని కంఠస్థం చేసినట్టు చదివి చూపించారు"

## సన్యాసి భూతదయ




ఇద్దరు బుర్ర తక్కువ మనుషులకు ఓ తాబేలు దొరికింది. దాన్ని చంపి తినాలని పెంకుమీద కర్రతో బాదసాగారు. ఎంత కొట్టినా అది చావడం లేదు. అంతలో ఆ దారిన పోవుచున్న ఓ సన్యాసి వారి అవస్థను చూసి 'మేము సమస్త భూతములయందు దయగల సన్యాసులం. జంతు వధకు ఉపాయాలు మేము చెప్పకూడదు. కానీ మీ బాధ చూసి మా గుండె కరిగినది.. దానిని వెల్లకిలా తిప్పికొట్టుడు' అని సలహా ఇచ్చి తనదారిన తాను పోయాడు. వాళ్లు ఆయన చెప్పినట్లే చేసి తమ ఆకలి తీర్చుకున్నారు.

అని వివరించినపుడు దొరస్వామి కళ్ళు మూసుకుని ఆ దృశ్యాన్ని ఊహించుకుని తన అన్న గొంతును స్పష్టంగా విన్నాడు.

హెన్రీ ఆ వీలునామాలోని వాక్యాలను ఆ రోజు పప్పా చదివి వినిపించినట్టుగానే ఇప్పుడు అతడికి చదివి వినిపించాడు. అతడు తనకు చేతనైనంత వరకూ పప్పా రాసినట్టుగానే తప్పులు లేకుండా చెప్పాడు.

ఇద్దరూ చీకట్లో కూర్చుని ఉన్నారు. దొరస్వామికి హెన్రీ కంఠం తన అన్న కంఠంలాగానే వినిపించింది.

"నేనొక హిందువును. మా ముత్తాతలందరూ శైవ మతాన్ని నమ్మి జీవించి ఎలా శివ సాన్నిధ్యాన్ని పొందారో, అలాగే వెళ్ళటానికి ఇష్టపడుతున్న వాణ్ణి నేను. నేను చనిపోతే హిందూ వైదిక ఆచారాల ప్రకారం నన్ను దహనం చెయ్యాలి. నా పేరుతో ఒక్క పిడికెడు బూడిద కూడా మిగలకూడదు. 'నేను' అంటే ఈ విశ్వనాథ శాస్త్రినో, ఈ శరీరమో కాదు. అందుకని ఈ విశ్వనాథశాస్త్రికి బంధువు అని ఎవరైనా ఉంటే వాళ్ళు ఆ బంధుత్వాన్ని వాళ్ళ చేతుల్తోనే చెరిపివేయటానికి గుర్తుగా వాళ్ళ చేతుల్తోనే తల కొరివి పెట్టవలసింది. ఇది ఒక బలవంతమో, నా కోరికో కాదు. ఇది ఒక పద్ధతి, దీన్ని చెయ్యవలసిన వాడు నా దత్తపుత్రుడైన హెన్రీనే"

అలా అంటున్నప్పుడు హెన్రీ కంఠం కాస్త తడబడింది. దొరస్వామి మౌనంగా, కాసేపు పరిశీలనగా చూశాడు. హెన్రీ ఇంకా మాటలు కొనసాగిస్తున్నట్టూ, తాను ఇంకా వింటున్నట్టూ... కళ్ళు మూసుకొని కూర్చుని ఉన్నాడు దొరస్వామి.

హెన్రీ ఆ వీలునామాలోని వాక్యాలను చదవటం ఆపి "అందులో విశేషం చూడండీ, పప్పా నన్ను ఎదుట ఉంచుకునే ఈ వీలునామాను చదివి వినిపించారు"

"మ్.. తర్వాత? ఆ వీలునామాలో ఇంకా ఏమి రాసుకున్నారు? " అని కళ్ళు తెరవకుండానే తాను చూస్తున్న దృశ్యాన్ని బెదిరిపోకుండా, ఎదుట కూర్చోనున్న హెన్రీతో అన్నాడు దొరస్వామి. ఎన్నోమార్లు చదివీ చదివీ కంఠోపాఠం అయిపోయిన ఆ వీలునామాలోని వాక్యాలను చదవటం కొనసాగించాడు హెన్రీ.

"నా పెంపుడు కొడుకు హెన్రీని నేను నా మతానికో, నా నమ్మకాలకనుగుణంగా బలవంతంగా మార్చటానికో ఇష్టపడ్డం లేదు. అతడి పెంపుడు తల్లి క్రీస్తు మతానికి చెందినది కావటం వల్ల ఒకవేళ అతడు క్రీస్తు మతంలోకి మారినా మారవచ్చు. అలాంటి పరిస్థితులు ఏర్పడితే నాకు చెయ్యవలసిన కర్మక్రియలు హిందూ సాంప్రదాయాల పట్ల నమ్మకమున్న ఎవరైనా ఒక అనామకుడితో చేయించి, ఆ కర్మక్రియలు చేసినందుకుగాను అతడికి వెయ్యి రూపాయలు ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.

దీనికంతా ఏ ప్రత్యేకమైన అర్హతా అక్కరలేదని నాకు తెలుసు. ఎక్కడో బర్మా యుద్ధంలో నేను చనిపోయుంటే వీటన్నిటికీ అర్థం లేదు. భగవంతుడు నాకు బతకటానికి మంచి సందర్భమూ, వసతులూ కల్పించినందు వల్ల ఇదంతా రాసిపెట్టుకుంటున్నాను. అటు తర్వాత ఆ భగవంతుడి సంకల్పం. అని వీలునామాను వేరుగా రాశారు పప్పా"

"నువ్వే కదూ ఆయనకు అన్ని కార్యాలూ చేశావు? " అని దొరస్వామి కళ్ళు తెరిచి- ఒళ్ళో నిద్రపోతున్న బిడ్డను ఎత్తుకొని లేస్తూ అడిగాడు.

హెన్రీ కూడా లేస్తూ - "మరి...? .. నేనే అన్నీ చేశాను" అన్నాడు.

"అయితే, మీ పప్పా నీతో ప్రత్యక్షంగా దీని గురించి ఏమీ మాట్లాడలేదా? "

"పప్పా నాతో ఎన్నో విషయాలు మాట్లాడేవారు. నాకు బుద్ధి తెలిసినప్పటి నుండి నాతో మాట్లాడుతూనే ఉన్నారు. అయితే ఇలాంటి సొంత విషయాలేవీ నాతో ఎక్కువ మాట్లాడేవారు కారు. చనిపోయిన శవాన్ని కాల్చటం ఎంత సరైన పనో చెప్పేవారు. అందుకు అం

భగవంతుడు నాకు బతకటానికి మంచి సందర్భమూ, వసతులూ కల్పించినందువల్ల ఇదంతా రాసిపెట్టుకుంటున్నాను. అటు తర్వాత ఆ భగవంతుడి సంకల్పం.

దుకు ఉదహరణగా పురాణాల్లోని ఎన్నో కథల్ని చెప్పేవారు. తక్కినవన్నీ నన్ను పక్కన పెట్టుకునే చేశారు. మాట్లాడేందుకు ఏముంది. ఆయన ఎంతో ప్రశాంతంగా, సంతోషంగా కళ్ళు మూసుకొని నిద్రపోతున్న ట్టుగానే చనిపోయారు. నేను పక్కన కూర్చుని ఉన్నాను. కళ్ళు మూసుకొని ఏదో ఆలోచించి చెప్పబోతున్నారని చూస్తూ కూర్చుని ఉన్నాను. నా చేతిని పట్టుకునున్న ఆయన చెయ్యి ఉన్నట్టుండి బరువుగా మారి నట్టు అనిపించింది. దట్స్ ఆల్!" అని మిఠా యిని చప్పరించినట్లు నాలుకతో 'ప్చ్' అన్నాడు హెన్రీ.

"వెంటనే మిస్టర్ కనకరామయ్య పెరుగెత్తు కొచ్చేశారు. తర్వాత పప్పా ఫ్రెండ్స్ ఇద్దరు ముగ్గురు రిటైర్డ్ జెంటిల్‌మెన్... వచ్చి తోడుగా ఉన్నారు... పప్పా పదేళ్ళ క్రితమే రిటైర్ అయ్యారు. బ్యాంకులో ఆయన సేవిం గ్స్, ప్రావిడెంట్ ఫండ్ డబ్బంతా కలిపి వన్ లాక్ ట్వెంటీ సిక్స్ థౌజండ్- దటీజ్... లక్షా ఇరవై ఆరు వేల రూపాయలు ఉంది. మూడ వ రోజు పాలు పోసే దినమటగా... అంత వరకూ నేను అక్కడే ఉన్నాను. తర్వాత ఆ మనిషి- అదే ఆ కార్యక్రమాన్నంతా చెయ్యటా నికి వచ్చిన అయ్యగారిని అడిగాను. 'నేనింకా ఇక్కడే ఉండాలా?' అని" హెన్రీ చెప్పిన విష యాలన్నీ జాగ్రత్తగా విన్నాడు దొరస్వామి.

"ఆ డబ్బంతా అక్కణ్ణించి పట్టుకొచ్చేశా వా? అక్కడే ఉందా? "అని ప్రశ్నించాడు దొర స్వామి. "అతడు మళ్ళీ బెంగుళూరుకు తిరిగి వెళ్ళాలనుకుంటున్నాడేమో? " అని తెలుసుకోవ టానికే అలా అడిగాడు.

"నో... నో. ఇకపై అక్కడ ఇంకేమీ లేదు. నేనిక్కడ సెటిల్ కావాలనే కదా వచ్చాను. దేవరాజులు సార్ వచ్చిన వెంటనే రేపు వెళ్ళి ఆ డబ్బును ఏదైనా బ్యాంకులో డిపాజిట్ చెయ్యాలి.... బ్యాంకులన్నీ ఈ ఊళ్ళోనేగా ఉన్నాయి" అని అడిగాడు హెన్రీ.

"బ్యాంకులో వెయ్యకుండా నీ దగ్గరే పెట్టు కునున్నావా? "

"ఎస్, నా దగ్గరే అంటే ఇక్కడ లేదు. దేవ రాజులు ఇంట్లో ఆ పెద్ద బ్యాగుంది కదూ అందులో ఉంది" అని అతడు చెప్పిన విష యాన్ని విని ఆశ్చర్యపోయాడు దొరస్వామి.

'వీడేం పిల్లవాడు. ఇంత డబ్బును బ్యాగ్‌లో పెట్టుకుని ఒక పరదేశిలాగా నడుచుకుంటూ వచ్చేశాడే? ... ఏదో ఒక పాత సామానులాగా ఇంటి మేడ మీద దాన్ని పడేసి వచ్చాడే" అ నుకున్న దొరస్వామి 'మ్... సరేలే. భూతం నిధిని కాపాడినట్టు డబ్బుకు కాపలా ఉండటా నికి వీలౌతుందా ఏం? ' అని తనలో తాను సరిపెట్టుకున్నాడు.

దొరస్వామి చొక్కా జేబులో నుండి బీడీని, ఒక చిన్న పొట్లాన్ని తీసి, బీడీని విప్పదీసి, పొట్లంలోని ఆకును అందులో పెట్టి, ఒక్క టిగా ఐదారు బీడీలను చుట్టాడు. హెన్రీ ఆ తతంగాన్నంతా విచిత్రంగా చూస్తూ కూర్చు న్నాడు.

"అందులో మీకు మత్తు కలుగుతుందా? " అడిగాడు హెన్రీ.

"తాగితే వచ్చినంతగా మత్తు రాదు. ఇది మరోలా ఉంటుంది. మనసుకు బాగుం టుంది. ప్రపంచమంతా ఒక వింతగా అనిపి స్తుంది. నువ్వొకటి తాగి చూడూ" అని ఒక బీడీని తీసి అతడి ముందుకు చాపాడు.

"థ్యాంక్స్, నేను స్మోక్ చెయ్యను" అని దాన్ని తిరస్కరించాడు. దొరస్వామి ఒక బీడీ తాగేంతవరకూ కళ్ళు మూసుకునే ఉన్నాడు. ఆ పొగ వాసన సుగంధంలా అనిపించింది హెన్రీకి. దొరస్వామి కళ్ళు తెరిచి హెన్రీని చూసి మాట్లాడినపుడు అతడి కళ్ళు ఎర్రగా

కనిపించాయి.

"పాండు వెధవకి ఒక డ్రైవింగ్ లైసెన్స్ తీసి చ్చేస్తే లారీని వాడికి అప్పగించేయొచ్చు కొత్తదే ఒక లారీని కొనిచ్చి వాణ్ణి తోలమంటే అది వాడికీ ఒక భుక్తిగానూ ఉంటుంది. మనకూ పద్ధతిగా ఇంటికి డబ్బొచ్చి చేరు తుంది. ఈ నాయాళ్లనంతా ఇక్కడే వొదిలేసి నేనూ నీతోనే వచ్చి అక్కడున్న మన పొలాలూ, మడీ అవీ చూసుకునేవాణ్ణి" అని ఏదో వయస్సు మీద పడ్డట్టు మాట్లాడసాగాడు దొరస్వామి. హెన్రీ డబ్బును, అతణ్ణి కాపాడా లన్న బాధ్యతా, బరువూ, చింతా కలిగాయి దొరస్వామిలో.

## 11

సాయంత్రం నాలుగుగంటలకు దేవరాజులు వచ్చాడు. అతడొచ్చినపుడు హెన్రీ చిన్ని పాపాయితో ఆడుకుంటూ కనిపించాడు. బాల మురళీ మాత్రం తోడు కనిపించాడు. తక్కిన పిల్లలెవరూ కనిపించలేదు. దేవరాజులు పిల్ల లకోసం బిస్కెట్లూ, చాక్లెట్లూ, ఒక సంచి నిండా కమలఫలాలు కొనుక్కొచ్చాడు. చాక్లె ట్లు మనిషికొకటి తీసుకొని పిల్లలొస్తే పంచ టానికి తన దగ్గరే ఉంచుకున్నాడు. మిగతా వన్నీ బాలమురళికి ఇచ్చాడు. వాడు తీసుకెళ్ళి నవనీతకిచ్చాడు.

హెన్రీ, దేవరాజులును పరిశీలనగా చూశా డు. అతడు సంతోషంగా ఉన్నట్టు అర్థం చేసు కున్నాడు. అక్కడి విషయాలు అతడుగా చెప్పా లని మౌనం వహించాడు. అయినా చివరికి అడిగాడు. "హవ్ ఈజ్ యువర్ మిసెస్? "

దేవరాజులు ఆమె బాగానే ఉందన్న విష యాన్ని తెలియచేసి, "నేను వెళ్ళి చూడ్డంతో ఆమె ఎంతో ఆనందించింది. నేనూ ఆమె లెటర్లో రాసిన విషయాన్ని గురించి ఏమీ అడగలేదు. "ఊరికి వస్తావా" అని అడిగాను. అక్కమ్మకు చాలా సంతోషం కలిగిందని చెప్పాను. మీ గురించి కూడా చెప్పాను. ఒక బిడ్డ పుడితే అంతా సర్దుకుపోతుందని మీరు చెప్పారే, అది గుర్తుకొచ్చి మీ గురించి చెప్పా ను. నేను తొందరపెట్టి ఉంటే ఇప్పుడే ఆమె నాతో వచ్చుండేది. కానీ తానుగా వెళ్ళినట్టు, తానుగా రానీ అనుకున్నాను. 'ఎప్పుడైనా నువ్వు రావచ్చు' అని చెప్పి మిన్నకుండి పోయాను. బహుశా వచ్చేవారం రావచ్చు. రాకపోతే రమ్మని చెప్పి నేనే ఉత్తరం రాద్దా మని నిర్ణయించుకున్నాను. ఏం, నేను చేసింది సరైనదే కదూ? " అన్నాడు దేవరాజులు.

అంతా విన్న హెన్రీకి ఎంతో ఆనందంగా అనిపించింది. నిన్న రాత్రి దొరస్వామి తనను ఇక్కడే ఉండమన్న విషయాన్ని అతనితో మాట్లాడాలనుకున్నాడు హెన్రీ.

దొరస్వామి ఇంటికి వచ్చేసరికి దీపాలు పెట్టే వేళైపోయింది. హెన్రీ అరుగుమీద కూర్చొని వీధిలో వచ్చే పోయేవాళ్ళను చూ స్తూ కూర్చున్నాడు. దేవరాజులు అతడి పక్క న కూర్చొని మాట్లాడుతున్నాడు. హెన్రీకి అటు పక్క దొరస్వామి కూతురు కూర్చొని ఖాళీ సిగరెట్ ప్యాకెట్‌ను చేత్తో పట్టుకొని నలి పేస్తూ, నోట్లో పెట్టుకొని కొరుకుతూ ఆడుకుం టోంది. మధ్యాహ్నం భోజనం చేస్తున్నప్పుడే - ఆ పాప హెన్రీ దగ్గరకు పాకుతూ వచ్చి ఒళ్ళోకి ఎక్కి, ఆకులో చెయ్యి పట్టి అట్టహాసం చెయ్యగా, అతడు ఒక చేత్తో పాపను ఒళ్ళో కూర్చోబెట్టుకొని గట్టిగా పట్టుకొని దొరస్వామి లాగానే కొద్దికొద్దిగా అన్నం తినిపించడంతో- హెన్రీకి ఆ పాప మాలిమైపోయింది. నవనీ తానికి అది చాలా ఆశ్చర్యంగా అనిపించింది. అటు తర్వాత ఆదిలక్ష్మమ్మ పాపను తీసు కొచ్చి అతడి చేతికిచ్చి వెళ్ళటం ప్రారంభిం చింది. మధ్యాహ్నం అన్నం తినిపించాక నిద్ర పుచ్చే సమయం తప్ప తక్కిన సమయమంతా పాప హెన్రీ వద్దే ఉంది. అదేమీ అతనికి భారంగా అనిపించలేదు. పాపతో ఆట్లాడ్డం అతడికి మంచి కాలక్షేపంగా అనిపించింది. ఒంటరిగా వున్న పాపాయికి బొమ్మ దొరికిన ట్టుగా ఉంది.

మిగతా పిల్లలందరూ అరుగుమీద, వీధిలో, వసారాలో దుంకుతూ, ఎగురుతూ ఆడుకుం

టున్నారు.

దీపం చేత్తో పట్టుకుని ద్వారం వద్దకు వచ్చిన నవనీత దాన్ని గూట్లో పెట్టి "చీకటి పడింది, చదవడానికి రండ్రా!" అని పిల్లల్ని పిలిచి లోనికి వెళ్ళింది. ఆమె మాటని మన్నించి "అమ్మ పిలుస్తోందిరా, ఆడింది చాలు" అని వాళ్ళూ ఆట్లాడ్డం ముగించుకుని ఇంట్లోకెళ్లారు. అదే సమయంలో వీధి చివర్లో లారీ వస్తూ కనిపించింది.



దొరస్వామి లారీలో నుంచి దిగాడు. షెడ్లో లారీని నిలిపేసి వచ్చిన పాండుతో - "రేయ్, టీ తీసుకురారా" అని జేబులోనుండి చిల్లర తీసిచ్చాడు. వచ్చి కూతుర్ని ఎత్తుకున్నాడు.

"ఒళ్ళంతా చెమట కంపు. నువ్వు మీ అన్న దగ్గరే కూర్చుని ఆడుకో. నాన్న వెళ్ళి స్నానం చేసేసి పరుగెత్తుకొచ్చేస్తాడు" అని చేతిలో ఉన్న పాపను అరుగుమీద కూర్చోబెట్టాడు. "ఏం దొరా, రోజంతా నీ దగ్గరే ఉందా? ఎత్తుకునే వాళ్ళుంటే చాలదూ, ముసిల్ది తీసుకొచ్చి ఇచ్చేసుంటుందే" అని చెబుతూ లోనికెళ్ళాడు.



హాల్లో లాంతరు దీపాన్ని పెద్దది చేసి మధ్యలో పెట్టుకొని పిల్లలు పెద్ద గొంతుకతో చదువుతున్నారు. గోడవారగా కాళ్ళు చాపుకొని కూర్చొని ఉన్న ఆదిలక్ష్మమ్మ గుడ్డి కళ్ళతో ఎక్కడో చూస్తూ, వాళ్ళింటాయన జ్ఞాపకాలతో పక్కన పెట్టుకున్న ఇనుప రోలులో వక్కాకు దంచుకోసాగింది. దొరస్వామి వచ్చిన విషయం కూడా ఆమెకు తెలియదు.

దొరస్వామి స్నానం చేసి వచ్చాడు. భార్య "వడలు, పాయసం చేశాను. పెట్టనా" అనడిగినా "టీ తెమ్మన్నాను. ఇప్పుడొద్దు. తర్వాత తింటాను" అని చెప్పి దేవరాజులు, హెన్రీల వద్దకు వచ్చి కూర్చున్నాడు.

"ఈ రోజు ఒక వింత జరిగింది..." అని ఆ రోజు తను చూసిన విశేషం గురించి చెప్పడం మొదలెట్టాడు దొరస్వామి. అతడి చూపులు ఆకాశంలో వెలిగిపోతున్న చందమామపై ఆ రోజుతను చూసిన విశేషం గురించి చెబుతున్నాయి. "దొరా, నీకు జ్ఞాపకముందా, ఆ రోజు లారీలో వస్తున్నప్పుడు రోడ్డు పక్కగా ఒక స్త్రీ స్నానం చేస్తూ కనిపించింది..."

దేవరాజులు ఆ విషయాన్ని మరిచిపో లేదు. అతడి మనసులో ఆనాటి సంఘటనా, సంభాషణా అలాగే గుర్తుండిపోయింది.

"ఆడది నీళ్లు పోసుకోవటాన్ని అలా చూస్తు న్నావే? " అని ముఖం మీద కొట్టినట్లు హెన్రీ ని దొరస్వామి కసురుకోవటమూ, అందుకు హెన్రీ నవ్వు ముఖంతో చెప్పిన సమాధానమే కదా దేవరాజులు అతడితో ఇంతగా సన్ని హితం కావటానికి కారణమైంది.

హెన్రీ కథ వినేవాడిలాగా, "మ్... జ్ఞాపక ముంది చెప్పండి..." అని ఉత్సాహపరిచాడు. దొరస్వామి చెప్పాడు.

"ఆ పిల్ల స్నానం చేస్తున్నప్పుడు మాత్రమే కాదు, ఎప్పుడూ నగ్నంగానే తిరుగుతోంది. హైవేస్‌లో నేను రెండు మూడుసార్లు చూశా ను. నిన్న ఆర్కేపేట క్రాస్ రోడ్ దగ్గరికే వచ్చే సింది. ధర్మా టీ కొట్టు దగ్గరే కూర్చుండిపో యింది. అందరూ పిచ్చిదంటూ వింతగా చూశారు. అక్కడ తిరుగుతుండే పోరంబోకు నాయాళ్లు ఆ పిల్లను చుట్టుముట్టి గలాభా చేశారు. నే వెళ్ళి ఇద్దర్ని 'ఛీ, వెళ్లండ్రా, గాడిద ల్లారా' అని తరిమి, అక్కడున్న ఒక పుల్లను తీసుకొని ఆమెనూ రెండు దెబ్బలేసి తరిమే శాను. నేను దాన్ని కొట్టేశానే కానీ ఆ పిల్లను చూస్తుంటే మన పాపను చూసినట్టుగానే ఉంది నాకు... ఆ పిల్లా, పాపం, ఒక పసి పాప లాగానే భయపడుతూ పరుగెత్తింది... ఆ పిల్ల ఎవరో ఏమిటో ఎవరికీ తెలియదు.

"ఇవ్వాళ సాయంకాలం వస్తున్నప్పుడు ఆ పిల్లను ఇక్కడ మన ఊళ్ళో చూశాను. చాలా ఒయ్యారంగా ఒక చెట్టుకు ఆనుకుని చింతకా యలు తింటూ కనిపించింది. నేను లారీని కాస్త ముందుకు తీసుకెళ్లి నిలిపాను. పాండు కూడా ఉన్నాడు. నేను లారీ నుండి కిందకు దిగి చేతులు చరిచాను. ఆ పిల్ల తిరిగి చూళ్ళేదు. తర్వాత నేనే దగ్గరికెళ్ళాను. నాకూ ఓ చింతకాయ ఇచ్చింది. చాలా లేత వయ సు. ఇరవై లోపే ఉంటుంది వయస్సు. నాకు ద్రౌపదమ్మను చూస్తున్నట్టే ఉంది. మాటలు కలిపాను. 'నువ్వెవరని' అడిగాను. దానికి నా గొంతూ వినిపించలేదు. నేను నిలబడి ఉండ టమూ కనిపించనట్టుంది. లేచి నిలబడి నిటా రుగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. అది చేతులూపుతూ నడిచి వెళ్ళటం ఎంత అందంగా ఉందో తెలుసా? "

"ఆమె పిచ్చిదై ఉండాలి" అన్నాడు దేవరా జులు. హెన్రీ దీర్ఘాలోచనతో నవ్వి, ఒక నిట్టూర్పు విడిచి అన్నాడు.

"యూ ఆర్ రైట్! అలా తిరిగితే అలాగే అంటారు".

దేవరాజులు హెన్రీని పరిశీలనగా చూశా డు. 'ఇతడు కూడా అలా తిర్గగలడు. అలా తిరిగితే మనమంతా ఇతణ్ణి పిచ్చివాడనుకుం టామని తెలిసే ఇతడు అలా తిరక్కుండా ఉన్నాడేమో!' అని అనుకున్నాడు. దేవరాజు లు, అతడి మనసులో ఆ రోజు బావిలో అతడు నగ్నంగా స్నానం చేసిన దృశ్యం కద లాడింది.

"దేన్నీ పరిశీలించకుండా చెప్పలేం. ఒక మనిషి నగ్నంగా తిరగడాన్ని మాత్రం దృష్టిలో పెట్టుకొని వాణ్ణి పిచ్చివాడని ఎలా చెప్పగలం? కావాలంటే వాళ్ళ నడత మీ పద్ధతి ప్రకారం "ఇన్‌డీసెంట్ అనండి. బట్ట లేగా మన నాగరికతను కనీస చిహ్నం" అని ఇంగ్లీష్‌లో అన్నాడు హెన్రీ.

దొరస్వామి మౌనంగా కూర్చున్నాడు. ఆమె ఇచ్చిన చింతకాయ చొక్కా జేబులో ఉన్న విషయం గుర్తొచ్చింది అతడికి.

"ఆమెలాగా నగ్నంగా మనమూ తిర్గగలమ నుకుంటే అలా తిరగొచ్చు. మన భార్యలు కూడా అలా తిరగొచ్చు అయితే మనం అంత "రీసంట్" గాదే అన్నాడు దొరస్వామి- అతడికి "డీసెంట్" అన్నమాటకు అర్థం తెలి సినా, చెప్పను చేతకాక తప్పుగా పలుకుతూ మాట్లాడసాగాడు! దేవరాజులుగానీ హెన్రీగానీ దాన్ని సరిదిద్దాలని ప్రయత్నించలేదు.

"మన రీసంట్"కు బట్టలూ కావాలి, దాన్ని విప్పి చూపించనూ కావాలి. వాళ్ళంతా ఆ

స్థితి దాటేసిన వాళ్ళు సార్. ఏం దొరా, అంతే కదూ?" అని ఏదో పూనినట్టు మాట్లాడసాగాడు దొరస్వామి.




పాండు వీధి చివరి నుండి పరుగెత్తుకు వచ్చాడు. అతడు వచ్చే తీరులోనే ఏదో విపరీతం జరిగిపోయినట్టు దొరస్వామికి అర్థమైంది.

"ఏంట్రా, ఏంటీ? ఎందుకలా పరుగెత్తుకొస్తున్నావ్?" అని అరుగుమీద నుండి దిగటానికి తయారై తానూ కంగారుపడ్డాడు దొరస్వామి.

పాండు సరిగ్గా మాట్లాడలేకపోయాడు. ఆయాసం వస్తోంది. మాటలు తడబడుతున్నాయి. కొన్ని సెకన్ల తర్వాత అన్నాడు.

"మన మున్సిఫ్‌గారు లేరూ... ఆయన్ను... పోలీసులు పట్టుకెళ్ళారు. స్టేషన్‌కు తీసుకెళ్ళి అందరినీ లాకప్‌లో తోస్తున్నారు. ఆయనతో పాటు ఇంకా నలుగురైదుగురున్నారు. అందరూ సారాయి తాగారట. స్టేషన్ దగ్గర ఒకటే గుంపుగా ఉన్నారు" అని అతడు చెప్పగానే అరుగుమీద కూర్చుని ఉన్న ముగ్గురూ ఒకర్నొకరు చూసి, ఏం చేద్దాం' అన్న ఆలోచనతో, ఏదైనా చెయ్యాలన్న తలంపుతోనూ కిందికి దిగారు.

దేవరాజులు పంచె మడిచి కట్టుకున్నాడు. దొరస్వామిని చూసి అడిగాడు "ఇప్పుడు కొత్తగా వచ్చిన ఎస్సైని ఎవరు? ముందున్న రమణ నాకు బాగా తెలుసు. ఎంత కష్టకాలం! ఇప్పుడు వచ్చినతను ఎలాంటివాడో?

ఎవరతను? ... మీకు తెలుసా? ... సరే, ఎవరైతేనేం? .. చట్టప్రకారం మనం చెయ్యవలసింది చేద్దాం... ముందు వెళ్ళి ఆయనకు జామీన్ ఇద్దాం... అది వీలౌతుంది కదా... బయలుదేరండి వెళదాం! మిస్టర్ హెన్రీ, మీరు అక్కడికి రాకండి. మేం వెళ్ళొస్తాం" అని హెన్రీతో చెప్పి పోలీస్ స్టేషన్‌కు వెళ్ళటానికి తయారయ్యాడు. దొరస్వామి తన చేతిలో ఉన్న పాపను హెన్రీ చేతికిచ్చి చొక్కా వేసుకోవటానికి లోపలికి వెళ్ళాడు.

"ఎవర్ని పట్టుకెళ్ళారు? ఎందుకు?" అని నవనీత కలవరపడుతూ అతడి దగ్గరకు వచ్చి అడిగింది. 'నువ్వెళ్ళాలా దానికి?' అని అడుగకుండానే అలాంటి భావం ఆమె కళ్ళలో కనిపించింది.

"ఆయన మా ఊరాయన. చాలా పెద్దమనిషి.. ఏదో తప్పు జరిగింది. ఊళ్ళోనే ఉండి వెళ్ళకుండా ఉండకూడదు... వెంటనే వచ్చేస్తాను. నేనూ, దేవరాజులు, సారూ వెళుతున్నాం. దొర ఇక్కడే ఉంటాడు. పిల్లలు తింటున్నప్పుడు దొరను కూడా తినేయమను" అని చెబుతూ వీధిలోకి దారితీశాడు దొరస్వామి. నవనీత వీధి ద్వారం వరకూ తోడుగా వచ్చి మళ్ళీ ఇంట్లోకి వస్తున్నప్పుడు దగ్గరకు వచ్చి పాపను ఎత్తుకుంది.

వెనక్కు తిరిగి చూసిన దొరస్వామి అరుగు మీద ఒంటరిగా కూర్చొని ఉన్న హెన్రీని చూసి తన వెనకే వస్తున్న పాండుతో అన్నాడు "నువ్వెందుకురా వస్తున్నావ్? దొర ఒంటరిగా ఉన్నాడు. అతనితో మాట్లాడుతుండు. నేను వచ్చాక నువ్వు ఇంటికి వెళ్ళొచ్చులే..."

పాండు తలాడించి వెనక్కు వచ్చి అరుగు మీద కూర్చున్నాడు.

'మున్సిఫ్ కూతుర్ని ఇచ్చిన ఊరు ఇదే కనుక, ఆయన అల్లుడికో, వాళ్ళింట్లోని వాళ్ళకో ఈ విషయం తెలియకూడదని' మనసులో అనుకున్నాడు దేవరాజులు. అదే ఆలోచన, దొరస్వామిలోనూ కలిగింది. దాని గురించి మాట్లాడ్డానికి మనసు రాక వాళ్ళు పోలీస్ స్టేషన్‌కి పరుగుపెట్టారు. హెన్రీ మౌనంగా మున్సిఫ్ గారి గురించి ఆలోచిస్తూ కూర్చు

న్నాడు.

పంచాయతీ జరిగిన రోజున ఆయన పెద్దరికంతో నడుచుకున్న విధమూ, గంభీర మైన విగ్రహమూ హెన్రీకి పదేపదే గుర్తుకు రాసాగింది. 'ఆ గొప్ప తనమంతా తగ్గేలా పోలీసోళ్ళ ముందు ఆయన తలొంచుకుని నిలబడగలరా? ' అని ఊహించగానే ఆయన పట్ల అతడికి సానుభూతి కలిగింది. తాను బతికిన ఊళ్ళోనూ- పప్పాకున్న అలవాటు గానూ, తాగటమన్నది ఒక సాధారణమైన విషయమై ఉండగా, ఇక్కడ దీన్ని ఇంత పెద్ద తప్పుగా, ఎంచి ఒక పెద్ద మనిషిని నేరస్థుడిగా భావించడం అతడికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

దేవరాజులును ఆ రోజు అడిగినపుడు అతడు దాన్నొక సాధారణమైన విషయంగా భావించి మాట్లాడడం గుర్తుకొచ్చింది.

పాండు, హెన్రీ తనతో ఏదైనా మాట్లాడు తాడేమోనని ఎదురు చూశాడు. చివరకు తానే మొదలెట్టాడు, "కావాలనే పట్టుకున్నారండి ఆ ఇన్‌స్పెక్టరు... ప్రపంచంలో ఎవరూ తాగ నట్టు విచిత్రంగా ఆయన మాత్రమే తాగా డా...ఏం? అందరూ 'పబ్లిగ్గానే' తాగుతున్నా రుగా. మున్సిఫ్‌వారు తాగుతారని కూడా తెలి యదండీ. అలాంటి ఆయనను పట్టుకుపోతు న్నారు చూడండి. అయితే మర్యాద లేకుండా ఏమీ నడుచుకోలేదండీ... నేను చూశానుగా, ఒక స్టూలు మీద కూర్చోబెట్టి ఏదో అడిగి రాసుకున్నారు. మిగతా ఇద్దరు ముగ్గుర్ని లోపల- లాకప్‌లోకి తోసేశారు. ఆ రంగన్న వెనకాలే బండి తోలుకుంటూ వచ్చి ఏడుస్తూ నిలబడ్డాడు. ఆయ న్ను చూశాకే నేను గుర్తు పట్టాను. మున్సిఫ్‌గారు పిడుగు పడ్డట్టు తల మీద వేసుకున్న పైగుడ్డ తీయకుండా అలాగే కూర్చున్నారు. చూడ్డానికి అయ్యో అనిపిం చింది. నన్ను చూస్తే ఏదైనా మాట్లాడుతారే మోనని కిటికీ దగ్గరే నిలబడ్డాను. కానీ ఆయన వంచిన తల పైకెత్తితే గదా? తర్వా తే ఇక్కడికొచ్చి మా గురువుగారికి చెబుదా మని పరుగెత్తుకొచ్చాను. మా గురువుగారికి పోలీసుల్లో మంచి గ్రిప్ ఉంది".

పాండు మాటలను హెన్రీ ప్రశాంతంగా విన్నాడు. వాడు 'గురువుగారని' చెప్పటం దొరస్వామి గురించే అని అర్థమైంది అతడికి.

"అయితే మీ 'గురువుగారు' వెళితే రిలీజ్ చేసేస్తారా? " అడిగాడు హెన్రీ.

"ఈ పోలీసోళ్ళని నమ్మడానికి వీల్లేదండీ. వాళ్ళు కేసులు పట్టుకోవాలటగా! అందుకే ఎవర్నైనా పట్టుకుని కేసులు రాసేసుకుంటా రట" అని కోపంగా అన్నాడు పాండు.

"అలా ఉండదు. చట్ట ప్రకారం వాళ్లు నడు చుకోవద్దూ? " అని అతడికి జవాబిచ్చాడు హెన్రీ. "ఇలాంటి ఒక చట్టం ఉంటే చట్టానికి భయపడి, దానికి గౌరవమిచ్చి తాగకుండా ఉండాలి. లేకపోతే చట్టం విధించే శిక్షను అనుభవించాలి, మరేం చేద్దాం..."

"ఇదేం చట్టమండీ? అన్యాయమండీ. ఒక ఊళ్ళో తాగొచ్చు మరో ఊళ్ళో తాగకూడద టగా. డబ్బున్న వాళ్ళు తాగొచ్చు.. బీదోళ్ళు తాగకూడదట" అని తాను విన్న వాదాలను, ఇతరులు చెప్పిన న్యాయాలను మనసులో పెట్టుకుని మాట్లాడాడు పాండు.

పాండు ఆవేశంతో మాట్లాడే ఉత్సాహాన్ని చెదిరి పోనీయకుండా ఆస్వాదిస్తూ వినసా గాడు హెన్రీ. పాండు ఎంతో ఆవేశంతో ప్రభుత్వాన్నీ, చట్టాన్నీ, పోలీస్ అధికారుల గురించి మాట్లాడటాన్ని వింటున్న హెన్రీకి, 'వీడికి ఇన్ని విషయాలు ఎలా తెలిశాయ బ్బా? ' అని ఆశ్చర్యపోయాడు.

నవనీత తొమ్మిది గంటల వరకూ ఎదురు చూసి తొమ్మిది గంటల సైరన్ మోగుతున్న ప్పుడు పిల్లల్తో కలిసి భోజనం చెయ్యటానికి హెన్రీని పిలవటానికి బయటికొచ్చింది.

"ఎవరదీ...పాండూనా? వెళ్లిన వాళ్లు ఇంకా రాలేదే. నువ్వెళ్ళి చూసొస్తావా? " అంది.

"అయ్యయ్యో? అన్న తిడతారండీ. వచ్చేం తవరకూ ఇక్కడే ఉండరా అని చెప్పి వెళ్లాడు" అన్నాడు పాండు.

"బాబూ... నువ్వొచ్చి భోంచెయ్యకూడదూ..." హెన్రీతో అంది నవనీత.

"ఫరవాలేదండీ... వాళ్లిద్దరూ రానివ్వండి. నాకూ ఆకలిగా లేదు..." అని చెప్పి లేచి వీధి కేసి దృష్టి సారించాడు హెన్రీ. వాళ్లొస్తున్న జాడ ఏమీ కనిపించలేదు.

వీధంతా చీకటి అలుముకుంది. ఎక్కడో సినిమా టాకీస్‌లో నుండి వింత వింత శబ్దాలు, అప్పుడప్పుడు గాలిలో తేలుతూ వచ్చి అతడి చెవిని సోకాయి.

నవనీత, పిల్లలందర్నీ పిలిచి భోజనం పెట్టింది. చదవటం పూర్తయ్యాక వాళ్ళు ఒక్కొక్కరుగా వచ్చి హెన్రీని తమతో భోం చెయ్యవలసిందిగా ఆహ్వానించారు. బాలమురళీ మాత్రం తాను తర్వాత భోంచేస్తానని అరుగు మీదకొచ్చి హెన్రీతో కలిసి కూర్చున్నాడు.

తొమ్మిదిన్నర దాటాక దేవరాజులు, దొరస్వామి ఇంటికి తిరిగొచ్చారు.

"ఏమైంది?" అని అడిగాడు హెన్రీ.

"దొరస్వామి నాతో ఉండటం వల్ల ఏదోలా జామీన్ తీసుకొని మున్సిఫ్ గారిని ఊరికి పంపించేశాం. పాపం! ఆ రంగన్న అదే మున్సిఫ్ బండి తోలే వ్యక్తి అలాగే నడి వీధిలో నా కాళ్ళ మీద పడిపోయాడు. ఆయన ఒక్కమాట కూడా మాట్లాడలేదు. వంచిన తలను పైకెత్తలేదు..." అని దేవరాజులు చెబుతుండగా దొరస్వామి కోపంతో అడ్డుపడి అన్నాడు.

"నాకొచ్చిన కోపాన్నంతా అణచుకొని మున్సిఫ్ గారికి కలిగిన అవమానాన్ని తలచుకుని మాట్లాడకుండా ఉండిపోయాను దొరా! అంత మానస్థుడైతే ఎందుకురా తాగుతాడు? అని ఆ ఇన్‌స్పెక్టర్ రైటర్‌ను అడిగాడే... అప్పుడు నేను తట్టుకోలేక పోయాను. సార్... మీరు పెద్ద ఉద్యోగస్థుడై ఉండొచ్చు ఆయన నిజంగానే పెద్ద మనిషి. అందుకని

## అదీ రోగ లక్షణమేనట!



'కాసేపు కుదురుగా కూచోలేవుట్రా! ఏమిటా! కాళ్ళూపటం' తరచూ మన ఇళ్ళలో విన్పించే మాట ఇది.

చాలామంది కాస్త విశ్రాంతి దొరికితే చాలు... వాళ్ళకి తెలీకుండానే కాళ్ళూపుతుంటారు. ఇది ఓ అసంకల్పిత చర్య. ఏ కారణం వల్ల ఇలా జరుగుతుందో ఇంతవరకూ ఎవరూ కనిపెట్టలేదు గానీ, ఖచ్చితంగా ఇది నరాల సంబంధ వ్యాధి అని చెప్తున్నారు 'రెస్ట్‌లెస్ లెగ్ సిండ్రోమ్ ఫౌండేషన్ ఆఫ్ అమెరికా' నిపుణులు. అనేకమంది కూచున్నపుడు, పడుకున్నపుడు మన ప్రమేయం లేకుండా కాళ్ళూపటం జరిగిపోతుంటుంది. ఒకవేళ బలవంతంగా కాళ్ళూపటం ఆపేస్తే, ఏదో కోల్పోయినట్టు, ఎవరో కట్టిపడేసినట్టు అన్పిస్తుంటుంది. మళ్ళీ కాళ్ళు కదిపితేనే రిలీఫ్‌గా ఉంటుంది. రాత్రిళ్ళు నిద్రించే సమయంలో కాళ్ళు కదలకపోవటంతో, కాళ్ళు లాగినట్టు, దురదలు వంటి మానసిక రుగ్మతలు అలాంటి వాళ్లలో మొదలవుతాయి. పైలక్షణాలకి డ్రగ్ థెరపీ తీసుకోవచ్చు. అయితే ఆల్కహాలు, కెఫీన్ తాగటం మానేస్తే, డ్రగ్ థెరపీతో అంతగా అవసరం ఉండదు.

'ఏమిటో, కదిలినా, మెదిలినా రోగమేనా'!- అని విసుక్కోకండి. ప్రస్తుతానికి కాళ్ళూపటం మానడాన్ని అభ్యాసం చెయ్యండి చాలు.

అనవసరంగా మాట్లాడకండి. తాగటం చట్ట ప్రకారం తప్పనుకుంటే మీరు చెయ్యవలసిం దేదో చెయ్యండి. జామీన్‌తో తీసుకెళ్ళటానికి మేమొచ్చాం. వాడు, వీడని మాట్లాడ్డం బాలే దు అన్నాను. ఎస్సై ఒక్క నిమిషం అవాక్క యిపోయాడు. లేకపోతే ఏం దొరా? ఆయ నకు అరవై ఐదేళ్ల వయసు. నలభై ఏళ్ళుగా తాగుతున్నారు. మనలాంటి ఇద్దరు ముగ్గురికి మాత్రమే తెలుసు ఆ విషయం. ఆయన



ఎలాంటి యోగ్యుడో, మంచి మనిషో ఊరికంతా తెలుసే. మొన్న మీరు తెచ్చిన చట్టమూ, నిన్న వచ్చిన ఒక పోలీస్ ఇన్‌స్పెక్టరూ ఆయన కన్నా గొప్పా ఏం? మనుషుల పెద్దం తరం చిన్నంతరం తెలియకపోతే ఏంట్రా, మీ చట్టం!..." అని కోపంగా తిట్టటం ప్రారంభించాడు దొరస్వామి.

"పాపం, అలాగే కుంచించుకుపోయాడు మనిషి. ఆయన అల్లుడు ఊళ్లో లేడో ఏమో? రాలేదు. కానీ మున్సిఫ్ గారిని పోలీసులు పట్టుకెళ్ళారన్న విషయం మా ఊరికి చేరిపో యినట్టుంది. అక్కడనుండి మనుషులు వచ్చారు..." అన్నాడు దేవరాజులు.

మున్సిఫ్ తనకు జరిగిన ఈ అవమానం తట్టుకోలేకపోతున్నాడని తెలిసిన దొరస్వామి, దేవరాజులు ఏదో గొణుగుతూనే ఉన్నారు.

భోజనం చేస్తున్నప్పుడు, తాను మరుసటి రోజు ఉదయాన్నే ఊరికి వెళ్ళాల్సిన విషయాన్నీ, బడికి సంబంధించిన పనుల గురించీ దేవరాజులు చెప్పాడు. దొరస్వామి తనను ఇక్కడే ఉండమని చెప్పిన విషయాన్ని హెన్రీ అందరి ముందూ దేవరాజులుతో చెప్పాడు. ఆ వెంటనే తాను అప్పుడే దొరస్వామితో చెప్పిన సమాధానాన్ని కూడా చెప్పాడు. చివరిగా మరుసటి రోజు ఉదయం దేవరాజులుతో హెన్రీ కూడా బయలుదేరి కృష్ణరాజపురం వెళ్లేటట్టు, ఆ ఇంటి మరమ్మత్తు పనులు ప్రారంభించేటట్టు ముగ్గురూ ఏకాభిప్రాయానికి వచ్చారు.

## 13

మున్సిఫ్ గారిని పోలీసులు అరెస్ట్ చేశాక వారం రోజుల్లో ఏవేవో జరిగిపోయాయి.

నిర్ణయించుకున్న విధంగా విశ్వనాథం ఇంటిని బాగు చేయించే పనిని ప్రారంభించడం రెండు రోజులు ఆలశ్యమైంది. ఇప్పుడు మూడు రోజులుగా ఆ పనులు ప్రారంభమై ముమ్మరంగా జరుగుతున్నాయి. ఇంటి వెనుకున్న తోటలో చేదబావికి సమీపంగా గుడారంలాంటి ఒక కొట్టం వేసి, హెన్రీ అక్కడే నివాసముండటం మొదలుపెట్టాడు. ఆ కొట్టం నిండా కొయ్య పలకలు, పైకప్పు కోసం కొబ్బరి మట్టలూ, చేంతాళ్ళు ఇంకా కొన్ని సామాన్లు పేర్చి పెట్టారు. మరోపక్క వడ్రంగులు పనిచెయ్యటానికి కింద పట్ట పరిచారు. చెట్టు కింద రంపంతో కొయ్యడానికి ఓ పెద్ద గుంత తవ్వించి ఉంచారు. బండ్లలో తీసుకొచ్చిన ఇసుక, ఎత్తుగా పేర్చబడిన ఇటుకరాళ్ళు, మరోవైపు సిమెంట్ బస్తాలు, వీటితో ఆ ఇంటి వెనక భాగం ఒక పెద్ద కర్మాగారంలా అన్పిస్తోంది.

పైభాగానికి సిమెంట్ రేకులు వెయ్యాలని కొందరు, మంగుళూర్ పెంకులు వేద్దామని మరి కొందరు చెప్పిన ఆలోచనలకు మారుగా హెన్రీ నాటు పెంకులు వెయ్యటానికే ఇష్టపడ్డాడు.

దేవరాజుల ఇంట్లోనుండి కరిపిగాడు భోజనమూ, టిఫినూ కొట్టం వద్దకే తీసుకొచ్చి ఇస్తున్నాడు. బడికి వెళ్ళే సమయం తప్ప తక్కిన సమయమంతా దేవరాజులు అక్కడికొచ్చి అతడితో గడపసాగాడు. అక్కడున్న ఇటుకలు, ఇసుక, సిమెంట్ బస్తాలు, పెంకులు అన్నీ దొరస్వామి తన లారీలో తీసుకొచ్చి పేర్చినవే. కుమారపురం నుండి ఇళ్లు కట్టే మేస్త్రీ కన్నప్పను దొరస్వామి తీసుకొచ్చాడు.

అన్ని పనులూ అతడి బాధ్యతతోనూ, దేవరాజులు పర్యవేక్షణలోనూ జరుగుతున్నాయి. హెన్రీ అక్కడ కూర్చొని కూలీలు చేసే పనులను చెట్టుమీద పక్షులు గూడు కట్టడాన్ని చూసే విధంగా వేడుకగా చూస్తున్నాడు.

దేవరాజులూ, హెన్రీ బస్సులో కుమారపురం వెళ్ళి అక్కడి గ్రామీణ బ్యాంకులో అకౌంట్ ఓపెన్ చేసి డబ్బు జమచేసి వచ్చారు. దొరస్వామి జమా ఖర్చులన్నీ చూసుకొమ్మని దేవరాజులును బతిమాలి ఒప్పించాడు. అక్కడ పనిచేసేవాళ్ళు తమకు కావలసిన డబ్బుకోసం హెన్రీని అడగకుండానే 'దేవరాజులు రానివ్వండి' అని ఎదురు చూసేవారు. ప్రతిరోజూ సాయంత్రం దొరస్వామి అక్కడికి రాగానే అతడిని హెన్రీ అడిగేవాడు.

"మునుపటిలాగానే కదూ ఇల్లు కడుతున్నారు. అందులో ఏం మార్పులు లేవు కదూ? ...వీలైనంతవరకూ, మీకు తెలిసినంతవరకూ, మునుపటిలాగానే కట్టమని చెప్పండి"

అదే ఆలోచనతో, ఆ ఇంటిని గురించి పప్పా చెప్పిన విషయాలను మనసులో పెట్టుకుని, రోజంతా అక్కడ పనిచేసేవాళ్ళతో తానూ ఒక్కడుగా కలిసిపోయాడు హెన్రీ.

మనుషుల్ని పెట్టి ఇంట్లో పెరిగిపోయిన తీగలూ, పొదలూ, అన్నింటినీ నరికి శుభ్రం చేసిన తర్వాత తోట మధ్యలో ఆ కొట్టం వేశారు. కొత్తగా రెండు నులక మంచాలు

కొన్నారు. ఒక లాంతరు దీపం కొనుక్కొచ్చాడు హెన్రీ. ఇంటి చుట్టూ ప్రహరీ గోడలు నడుము వరకూ పైకి లేచాయి.

మొన్న సాయంత్రం అక్కడకు వచ్చిన దొరస్వామికి నాయక్ హోటల్ నుండి భోజనం వచ్చింది. హెన్రీ ఆ రాత్రి దొరస్వామితో కలిసి భోంచేశాడు. రాత్రి పది గంటలకు హోటల్ మూసేశాక నాయక్ చేతి కర్రల సాయంతో అక్కడికి వచ్చి చేరాడు. నాయక్ ఎడమకాలు పూచికపుల్లలా ఉండటాన్ని గమనించాడు. హెన్రీ తప్ప మిగిలిన ముగ్గురూ గంజాయి దమ్ము పీల్చారు. దొరస్వామిలాగా నాయక్ బీడీలో చుట్టి పీల్చకుండా మరోరకంగా ఒక మట్టి పైపు పెట్టి పీల్చటం హెన్రీకి వింతగా అనిపించింది. ఏదో అనుకున్న ప్రకారం పని ఆగకుండా జరగాలని ఆ ఇంటి పనులు ప్రారంభించారే తప్ప, ఆ సంతోషంలో పదేపదే ఒక శోకపూరిత మౌనం అక్కడ ఒక్కొక్కరిలోనూ గూడుకట్టుకుని ఉండటం హెన్రీ గుర్తించాడు. అందుకు కార ణం అతడికీ తెలుసున్నందువలన ఆ మౌనశోకంలో తానూ భాగం పంచుకున్నాడు.

హెన్రీ, దేవరాజులూ ఒక మంచంపైనా, నాయక్, దొరస్వామి మరో మంచంపైనా ఎదురెదురుగా కూర్చున్నారు. పైనుండి కిందికి వేలాడుతున్న ఓ తాడూ, ఆ తాడుకు తగిలించబడ్డ ఒక లాంతరూ వాళ్ళ మధ్య వేలాడుతున్నాయి. రెండు మూడు రౌండ్లు పైపు చేతులు మారింది.

కృష్ణరాజపురంలోనూ ఆ చుట్టుపక్కల గ్రామాలలోనూ పాకి, అవ్వాళ తెల్లవారి ఒక పత్రికలో వార్తగా వచ్చింది- కృష్ణరాజపురం మున్సిఫ్ పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళొచ్చిన అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకున్నారని. బాధాకరమైన ఆ విషయాన్ని గురించే ఆలోచనలు ముసురుకోగా, నిట్టూర్పులు విడుస్తూ లోలోన కుమిలిపోతున్న దొరస్వామి నాయక్‌ను చూసి ఉన్నట్టుండి అన్నాడు.

"అప్పుడే, పోలీస్‌స్టేషన్ నుండి వచ్చారుగా- వచ్చిన వెంటనే ఉరేసుకున్నట్టుంది. శవ విచారణలో తెలిసిందని చెప్పుకుంటున్నారు. ప్రాణం పోయిన రెండు గంటల తర్వాతే, విషయం తెలిసుండాలి"

"ఔనండీ, అర్ధరాత్రప్పుడు మొదట ఆయన భార్య గొంతే ఊరికంతా వినబడింది. గుంపు చేరిపోయారు. నేను నమ్మలేకపోయానండీ. ఇలాంటి దానికా ఒక మనిషి ఇలా చేసుకుంటాడు? " అని నాయక్ గొణిగాడు. దేవరాజులుకు జరిగిందంతా తెలుసు. ఆ రోజు రాత్రంతా మున్సిఫ్ కూతుర్ని ఓదారుస్తూ- మరొకరి ఇంటి గడప తొక్కని అక్కమ్మ వాళ్ల ఇంట్లోనే ఉండిపోయింది.

ఉదయాన్నే కుమారపురం నుండి వాళ్ళందరూ లారీలో బయలుదేరిన కాసేపటికల్లా ఆ వార్త వాళ్ళకెదురేగి వచ్చింది.

హెన్రీ ఏమీ మాట్లాడకుండా, దేన్నీ అర్థం చేసుకోనివాడిలా, ఎక్కడో దూరంగా జరిగిన ఒక సంఘటన గురించి వాళ్ళు మాట్లాడుకుంటున్నారన్నట్లు మౌనంగా కూర్చున్నాడు. ఆ వార్తను విన్నప్పటినుండీ అతడు అలాగే అయిపోయాడు. అలాంటి విషయాలలో అతడికి ఇప్పుడిప్పుడు స్పందనలు తగ్గిపోతున్నాయి.

మరుసటిరోజు ఆ చావుకు గ్రామ పెద్దలంతా వెళ్ళినపుడు వాళ్ళతో కలిసి హెన్రీ కూడా వెళ్ళాడు. పంచాయతీ జరిగిన అరుగు మీదా, వసారాలో, పక్కింటి, ఎదురింటి అరుగుల మీదా చావుకొచ్చిన జనాలు నిలబడున్నారు. దేవరాజులు పక్కన ఒక పసిపిల్లవాడిలా అతుక్కుని నిలబడ్డాడు హెన్రీ. దేవరాజులు కూర్చుంటే అతడితో పాటు కూర్చుని, లేస్తే తానూ లేస్తూ, అక్కడ జరుగుతున్న తతంగాన్నంతా చూస్తూ ఆ గుంపులో ఒకడిగా ఉన్నాడు హెన్రీ.

దేవరాజులు పదేపదే హెన్రీని గమనించసాగాడు. శవం ఊరేగింపులో మంచి ఎండలో

వాళ్ళతో పాటూ అతడూ నడిచాడు. అప్పుడు చేతిలో కొరివి కుండతో వెళుతున్నవాడే మున్సిఫ్ కూతురి మొగుడని దేవరాజులు చెప్పగా హెన్రీ తెలుసుకున్నాడు.

మున్సిఫ్‌గారు ఏమీ రాసి పెట్టి చావలేదు. ఓ క్షణికావేశంలో ఆయన ఆ నిర్ణయానికి వచ్చుంటాడని భావించిన దేవరాజులు, ఆ రోజు పోలీస్‌స్టేషన్‌లో తలవంచుకుని ముఖం దాచుకుని ఆయన కూర్చునున్న దృశ్యాన్ని గుర్తుచేసుకుంటూ- "లేదు, నాకప్పుడే అనిపించింది. కానీ వచ్చీరాగానే ఆయన అలా చేసుకుంటారని నేననుకోలేదు. మనసు విరిగితే- అలాంటి ఆలోచన రావటం మామూలే! తర్వాత సర్దుకుంటాడులే అనుకున్నాను" అని నాయక్‌తో అన్నాడు దేవరాజులు! అక్కమ్మా, కరిపిగాడూ తనకు చెప్పిన ఆనాటి విషయాల్ని ఇప్పుడు వాళ్ళకు చెప్పాడు.

"మున్సిఫ్‌గారిని పోలీసోళ్ళు పట్టుకెళ్ళారని ఊరంతా తెలిసిపోయింది. మనం స్టేషన్‌లో నుండి బయటికి తీసుకొచ్చి బండ్లో ఎక్కించి పంపామా, అంగడి వీధిలో నుండే గుంపులు గుంపులుగా జనాలు ఆయనను వింతగా చూస్తూ వెంబడించారట. ఆ నాగమ్మ దెయ్యముందే, విషయం తెలిసిప్పటినుండీ వీధిలో వాళ్లందరికీ తెలిసేలా అరవటం మొదలెట్టిందట. పాపం, మనిషి అలాగే కుంగి కృశించిపోయి వచ్చారట. బండ్లోనుండి దిగిన వెంటనే ఆ నాగమ్మ కాళికాదేవిలా ఆయన ముందు విరుచుకుపడిందట. "నీకు మానముందా... ఈసముందా? ఇట్టేనా ఒక పెద్దమనిషి నడుచుకునేది? సిగ్గూ శెరమూ లేని మనిషి సస్తే ఏం? బతికితే ఏం? " అని ఆ రాత్రంతా ఆయనను తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతూనే ఉందట. వచ్చిన వెంటనే ఆయన గదిలోకెళ్ళి తలుపేసుకున్నారట. పాపం, ఆయన కూతురు, ఆ ముచ్చుమొహం మొగుడు పెట్టిన కష్టం చాలదని,తండ్రి గౌరవమర్యాదలు ఇలాగయ్యాయని బాధపడుతూ పడుకుని ఏడుస్తుండి పోయిందట. ఏమైనా కన్నతండ్రి కదా?

పన్నెండు అయ్యుంటుందట. నాగమ్మ నోరు విప్పితే ఇక ఆగుతుందా? మున్సిఫ్‌గారి

## మరణం రాకుండా మందు




వనమూలికల వైద్యంలో దిట్టగా ప్రసిద్ధుడైన ఓ సిద్ధుడు ఒక ఊరికొచ్చాడు. తనకు అడిగిన దినుసులు సమకూర్చితే మరణం రాకుండా మందు తయారుచేస్తానని అందరికీ చెప్పాడు. అంతా ఆయన కోరినదల్లా ఇచ్చారు. భోజనవసతి సౌకర్యాల నుంచి డబ్బు, బంగారం వగైరాల వరకూ సమస్తం సంపాదించుకున్న వైద్యుడు ఎన్నాళ్లకూ మందు మాట ఎత్తకపోవడంతో ఊరివారికి మండింది. అంతా కలిసివచ్చి ఓరోజు అతన్ని గట్టిగా నిలదీశారు.

వెంటనే అతను 'కేవలం మూడు తప్ప మందు తయారీకి అన్నీ సమకూరినట్లే! అవి కూడా మీరు తెప్పిస్తే వారంరోజుల్లో మందు మీ చేతుల్లో పెడతాను' అని హామీ ఇచ్చాడు. సరే ఇన్ని ఇచ్చినవాళ్లం ఆ మూడూ ఇవ్వలేమా అనుకుని వారు ఇంకా ఏం కావాలి అని అడిగారు.

'ఆం ఏముంది ఓ మానెడు నల్లి రక్తం, ఓ కుండెడు దోమ మూత్రం, ఓవీసెడు తలుపుల కిరకిర తెస్తే చాలు..' అన్నాడతను తెలివిగా.

తెల్లమొగాలేయడం జనం వంతైంది.

ఏడు తరాలనూ లాగి నోటి కొచ్చినట్టు మాట్లాడిందట. కూతురే చూసీ చూసీ తట్టుకోలేకుండా అందట. "ఇక వదిలిపెట్టమ్మా పాపం! ఆయన కుంగిపోయున్నారు. పిలుచుకెళ్ళి అన్నం పెట్టమందట. నీ కక్కురగా ఉంటే నువ్వే పిలుచుకెళ్ళి నీ బంగారు నాన్నకు అన్నం పెట్టవే. ఆ మనిషిని చూస్తేనే నాకు మండుతోంది" అని అన్నం పెట్టనందట ముసల్ది.

"ఛీ! నువ్వొక ఆడదానివా? నీ వల్లే మా నాన్న తాగుబోతుగా మారారు. పెళ్ళాం ఇలా రాక్షసిగా ఉంటే ఏ మగాడైనా అలాగే అవుతాడు. అన్నిటికీ నువ్వే కారణం" అని నాగమ్మను తిట్టిందట. వెంటనే నాగమ్మ తగులుకుందట. "మొగుడు వొదిలేసిన దానివి. ఇక్కడికొచ్చి కూర్చొని నీకేంటే ఇంత నోరు? కట్టుకున్న మొగుడితో కలిసి బతకటానికి బొగిసి లేదు. ఇకమీదట నీ దగ్గర నీతులు చెప్పించుకుని నా మొగుడితో నేను సంసారం చెయ్యడం నేర్చుకోవాలా...? "అని అరుస్తూనే ఉందట నాగమ్మ. సరే, ఈ శనిగ్రహం ఏదైనా మాట్లాడి చావనీ. తనైనా తండ్రికి అన్నం పెడదామని- బిడ్డను కని, ఇంకా తల స్నానం కూడా చెయ్యని ఆడకూతురు లేచి వెళ్ళింది. అప్పటికి ఆయన తలుపేసుకుని రెండు గంటలు పైనే అయింది" అని అక్కమ్మ తనతో చెప్పి నట్టే అన్నింటినీ వివరించాడు దేవరాజులు.

"ఔనూ, ఆయనకు మీరెవరైనా జామీన్ ఇచ్చారా? " అని అడిగాడు నాయక్.

"ఇచ్చుంటే ఏమయ్యా? " అని కఠినంగా అన్నాడు దొరస్వామి.

"ఊరికే అడిగాను" అన్నాడు నాయక్.

"ఆయనకు మరొకరు జామీన్ ఇవ్వటమేంటీ? తన సొంత పరపతితోనే ఆయన బయటికి వచ్చారు" అన్నాడు దేవరాజులు.

హెన్రీ నవ్వుకున్నాడు.

ఆ రాత్రి దొరస్వామి మానవ జీవితంలోని స్థితిగతుల గురించి మాట్లాడుతూనే ఉన్నాడు. మున్సిఫ్‌గారి గురించిన జ్ఞాపకాలు... అందరిలోనూ నిండి ఉండటం గమనించిన దేవరాజులు మాట మార్చడం మంచిదనుకుంటూ దొరస్వామితో అన్నాడు.

"సరేనండి. ఇంటి పని మొదలు పెట్టేశాం. ఇక ఇంట్లో దీపం పెట్టడానికి ఒక పిల్ల కావద్దూ? హెన్రీకి మీరేకదా అంతా? దాని గురించి ఏదైనా ఆలోచించండి" అని పరిహాసమాడాడు.

దొరస్వామి దాని గురించి దీర్ఘంగా ఆలోచించాడు. అది తన బాధ్యత అన్న భావమూ ఏర్పడింది అతడిలో. అయినా వీడికి ఏ జాతిలో పిల్లను చూడాలి అనుకున్నాడు. ఆ రోజు పంచాయతీలో సుబ్బరామయ్య అడిగిన ప్రశ్నలకన్నా అనాగరికమైన ప్రశ్నలు అడుగుతారే? పంచాయతీలోనే దాన్ని సహించలేని తాను అలాంటి మాటల్ని విని తట్టుకోగలడా? తన ఆలోచనలు బయటపడకుండా దేవరాజులుకు బదులిచ్చాడు దొరస్వామి.

"ఔనౌను! ఇల్లు కట్టాక మొదట ఒక పెళ్ళి కూడా ఈ ఇంట్లో జరిపించాలి. అయినా చేసుకోబొయ్యేవాడు ఏం అనుకుంటున్నాడో తెలవద్దూ? "

హెన్రీ నవ్వాడు. "నాకు అదంత అవసరమని అనిపించటం లేదు"




రాత్రి పదకొండు గంటలవరకూ పరీక్షల కొరకు ఇంటి ముందున్న దీపస్తంభం కింద చదువుకున్న కరిపిగాడు పుస్తకాలను మూసేసి అక్కడికి వచ్చాడు. అతడు వస్తున్నప్పుడు వీధి దీపాలన్నీ వెలుగుతూ కనిపించాయి. కాసేపటికి అన్ని దీపాలూ ఆరి

పోయి వీధంతా చీకటి అలుముకుంది.

కరిపిగాడు- నాయక్, దొరస్వామి కూర్చొని ఉన్న నులకమంచం వెనక నేలమీద ఒక చెక్క పలకమీద కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ వినోదంగా పొగ పీల్చటాన్ని వింతగా చూశాడు.

కొంచెం సేపయ్యాక నాయక్ "వెళతానంటూ" లేచాడు. అక్కడున్న సామానులు తగిలి అతడు ఎక్కడ పడిపోతాడోనన్న భయంతో కరిపిగాడి చేతికి లాంతరు ఇచ్చి తోడు పంపాడు దేవరాజులు.

ఎత్తుగా పేర్చి ఉన్న ఇటుకల వరుసను దాటుకుని వాళ్ళు వెళుతుండగా ఉన్నట్టుండి నాయక్, "ఎవరదీ? ... దొరస్వామీ... ఇలా రండి, ఎవరో ఇక్కడ దాక్కుని ఉన్నారు? " అని తడబడకుండా ధైర్యంగా పిలిచాడు. కొట్టంలో నుండి దొరస్వామి, దేవరాజులు గబగబ పరుగెత్తుకొచ్చారు. హెన్రీ వాళ్ళ వెనుకే వచ్చాడు.

మనిషెత్తుకు పేర్చబడున్న ఇటుకల వరుసల మధ్య 'ఆమె' నగ్నంగా నిలబడుంది. ఆమె తల వెంట్రుకలు ముఖంమీద, ఛాతీ మీద పరుచుకుని ఉంది. నడుముకి కింది భాగం ఇటుక వరుసల నీడ - నాయక్ ఎత్తి పట్టుకొని ఉన్న లాంతర్ వెలుతురు ఆమె మీద పడి, ఎవరికీ భయం కలిగించని విధంగా ఆమె కనిపించింది.

"ఛీఛీ! శని గ్రహమా, ఇక్కడికీ తగలడ్డావా? పోపో... మ్... దెబ్బలు తింటావ్..." అని ఆమెను భయపెట్టి తరిమాడు నాయక్.

"మధ్యాహ్నం మా బడి దగ్గరకొచ్చింది ఈ పిచ్చిది..." అన్నాడు కరిపిగాడు.

"ఔనౌను. తెల్లారి మా కాఫీ హోటల్ దగ్గరికొచ్చింది. గుడ్డలిస్తే తలకు చుట్టుకుంది. ఏయ్... అప్పుడిచ్చిన గుడ్డలేవీ? పోపో... ఇంకెక్కడికైనా పో" అని కాస్త జాలి కలిగిన ధోరణిలో అని నాయక్ వెనక్కు తిరిగినప్పుడు అందరూ ఏం చెయ్యాలో తెలియక నిలబడున్నారు.

దొరస్వామి మాత్రం ఆమెను చూసి ఏ భావమూ కలగనివాడిలా నిలబడున్నాడు. వీళ్ళెవరూ అక్కడ లేనట్టు, వాళ్ళ మాటలు పట్టించుకోకుండా అలాగే రాళ్ళ మధ్య గొంతుక్కూర్చుండి పోయింది-ఆ అమ్మాయి.

"సరే సరే, రండి. పిచ్చిది తానుగా వెళ్ళిపోతుంది. ఎవడో దొంగ వెధవ రాళ్ళు దొంగలిస్తున్నాడేమోననుకుని నేను దొరస్వామిని పిలిచాను"అంటూ ముందుకు కదిలాడు నాయక్.

అతడు మెట్లు దిగి వీధిలోకి అడుగు పెట్టేంతవరకూ కరిపిగాడు లాంతరు పట్టుకొని నిలబడ్డాడు. తర్వాత లాంతరును దేవరాజులుకు ఇచ్చేసి వెళ్ళిపోయాడు.

దేవరాజులు దొరస్వామి మౌనంగా ఇవతలికి వచ్చేశారు. హెన్రీ అక్కడే అలాగే నిలబడున్నాడు. ఆమెను అలాగే చీకట్లో, ఆ ఇటుకల మధ్య వదిలి రావటానికి మనసు రాక నిలబడున్నాడు. బట్టల్లేకుండా ఉన్న ఆమెను బయటకు రమ్మనో, కొట్టంలో ఉండమనో చెప్పటానికి వీల్లేదే అని సందిగ్ధంలో పడ్డాడు.

హెన్రీ రాకుండా అక్కడే నిలబడి ఉండటం దొరస్వామినీ, దేవరాజులునూ కాస్త ఆలోచనలో పడేసింది. అతణ్ణి పిలవటానికి వాళ్ళకు మనసు రాలేదు. అతడు ఏం చెయ్యబోతున్నాడో అర్థంగాక వాళ్ళు అలాగే నిలబడున్నారు.

హెన్రీ ఆమె చీకట్లో దాక్కుని ఉన్న చోటుకు ఎదురుగా వెళ్ళి నిలబడ్డాడు. ఆమెను ఎలా పిలవాలో తెలియక తడబడ్డాడు. 'ఆమెను ఏ పేరుతో పిలిస్తే ఏమిటి? ' అని ఆలోచించాడు. ఆమె ఒక పాపాయి లాంటిదే నన్న భావన కలుగగా,

"బేబీ... ఏయ్ బేబీ" అని మెల్లగా చిన్ని పాపను పిలుస్తున్నట్టు పిలిచాడు.

ఆమె పాపాయిలాగానే నవ్విన శబ్దం వినిపించింది. ఆ నవ్వు విన్న దొరస్వామి, దేవ

రాజులు ఒకరినొకరు చూసుకున్నారు.

హెన్రీ ఆమెతో ఇంగ్లిష్‌లో మాట్లాడాడు. "బేబీ... రా... రా... బయటికి రా.... నీకు సిగ్గుగా లేదూ... నువ్వు మంచి అమ్మాయివి కదూ... స్వీట్ గర్ల్! కమాన్ కమాన్..." అని పిలిచాడు.

ఆమె నవ్వింది. అది గజ్జెలు ఒక్కసారిగా కిందపడి చెదిరినట్టుగానూ... పడవనీటి తరంగాల శబ్దాల లాగానూ... వెళుతూ వెళుతూ పియానో మెట్లపై గబగబ స్వరాలు పలికించినట్లూ ఆ అనుభూతికి లోనయ్యాడు హెన్రీ. నవ్వు ఓ మౌన భాషలా అతడికి స్పష్టంగా అర్థమైంది. అతడి చెవులకు మాత్రమే ఆ మాటలు అర్థమయ్యేలా మాట్లాడింది.

'నువ్విష్టపడితే నేను సిగ్గుపడతాను' అని నవ్వుగా ధ్వనించిన ఆ మాటలు, ఆ మానవాతీత భాషలో అతడు విన్నాడు.

"యస్- ఐ విష్ దట్- కమాన్ బేబీ" అని హెన్రీ తన భాషలో ఆమెకు జవాబివ్వటాన్ని విన్న దొరస్వామి, దేవరాజులు అతణ్ణి ఓ మంత్రగాడిని చూసినట్టు చూశారు. కానీ అతడేమో- దాక్కుని బయటకు రావటానికి ఇష్టపడని ఒక పాపను, ఆమె ఆట జతగాడు ఆప్యాయతతో పిలుస్తున్నట్టు పిలిచాడు.

"మిస్టర్ దేవరాజులు... ఏదైనా ఒక గుడ్డ- అదుగో, ఆ ధోవతిని ఇలా అందుకోండి" అని చెయ్యి చాపాడు హెన్రీ.

మంచంపైనున్న ఒక తెల్లటి ధోవతిని తీసుకొని వచ్చాడు దేవరాజులు.

"బేబీ... రా... దీన్ని కట్టుకో... నువ్వు చెప్పావ్‌గా... నువ్వు సిగ్గుపడాలని నేను కోరుకుంటే సిగ్గుపడతానని. రా, సిగ్గుపడు... ఈ ప్రపంచంలో కలిసిపోయి ఆడుకో... ఓ ఏంజెల్! నువ్వు దేవతవే. కానీ ఇది మనుషుల లోకం కదేః" అని ఆమెతో ఇంగ్లిష్‌లో చాలా మృదువైన కంఠంతో పలికి చేతిలో నున్న వస్త్రాన్ని చీకట్లోకి చాచాడు హెన్రీ. ఇటుకల మధ్యనుండి లేచి హెన్రీ చేతిలోని వస్త్రాన్ని అందుకుంది ఆమె.

ఆమె ఆ వస్త్రాన్ని చీరలాగా కాకుండా ఒంటికి అలాగే చుట్టుకుని బయటకొచ్చి నిలబడింది. దేవరాజులు లాంతర్ వెలుతురును ఇంకాస్త పెంచి ఆమెను పరిశీలనగా చూశాడు. హెన్రీ చెప్పింది నిజమే, ఆమె ఒక దేవతలాగా ఉంది అనుకున్నాడు. "ఆమె ఎవరై ఉండొచ్చు...? ఎవరో ఈమెను కని పేరు పెట్టుంటారు కదాః ఆమె ఇలా పిచ్చిదై తిరగటానికి లౌకికమైన కారణమేదో ఖచ్చితంగా ఉండుంటుంది" అని ఆలోచించిన దేవరాజులు ఆమె గురించి ఆలోచించటం కూడా ఒకరకంగా పిచ్చే అనుకున్నాడు.

హెన్రీ చెప్పింది విని అలా నడుచుకోవటానికి సిద్ధంగా ఉన్నట్టు ఆమె వెలుతుర్లో నిలబడి ఎదురు చూడసాగింది. ఆమె దృష్టి దేనిమీదా స్థిరంగా ఉండడం లేదు. హెన్రీని తప్ప తక్కిన వాళ్ళను ఆమె గుర్తించ కలుగుతోందంటానికి ఆధారం లేని విధంగా ఆమె చూపులున్నాయి.

దొరస్వామి ఛాతి కింద చేతులు కట్టుకుని నిలబడున్నాడు. అతడి మనసెందుకో బాధపడుతోంది. పెదాలు కొరుకుతూ అతడు కన్నీళ్ళ పర్యంతమయ్యాడు. ఎందుకో తెలియని బాధలో ఓ సుఖమూ గోచరించింది. చాలా కాలంగా ఒక ఆడపిల్ల కోసం ఆశపడి కొన్ని మాసాల క్రితమే ఆడపిల్ల పుట్టినపుడు ఏర్పడ్డ స్పందనలకు సమమైన ఓ అనుభవాన్ని అతడిప్పుడు పొందాడు.

ఆమెకు తినడానికి ఏమైనా పెట్టాలన్పించింది దొరస్వామికి. అయితే ఆ కోరికను బయటకు తెలియచేయలేదు. అలాంటి భావం హెన్రీలో కలిగి అతడామెకు ఏదైనా ఇస్తే బావుణ్ణని అనుకున్నాడు 'కానీ, ఇక్కడ తినడానికి ఏముందీః' అనుకుని 'నాయక్ హోటల్ నుండి రాత్రి భోజనం పట్టుకొచ్చిన

టిఫిన్ క్యారియర్‌లో ఏదైనా మిగిలి ఉందా?' అని ఆలోచించాడు. కానీ దాన్ని తాను పూర్తిగా ఖాళీ చేసేసిన విషయం గుర్తుకొచ్చింది.

హెన్రీ ఆమెను కొట్టంలోకి తీసుకొచ్చాడు. ఆమె ఎంతో సాధికారంగా వచ్చి, చాలా కాలంనుండే ఆ పరిసరాలు పరిచయం ఉన్నట్టు, అంతకుముందు దేవరాజులు, హెన్రీ కూర్చున్న మంచంపైన ఒక పక్కగా కూర్చుని, కాలుమీద కాలు వేసుకుని మోకాలిపైన రెండు చేతులూ పెట్టుకుని - ఒక యజమానురాలినన్నంత గాంభీర్యంతో అతణ్ణి చూసి నవ్వింది. ఆమె నవ్వు పాపాయి నవ్వు లాగానే అనిపించింది. అంతసేపూ చేతిలో పట్టుకొని ఉన్న లాంతరును దేవరాజులు మునుపటిలాగానే ఇనుప చువ్వకు తగిలించాడు.

దొరస్వామి అక్కడున్న కొయ్య పలకనొకదాన్ని తీసి నేలమీద పెట్టి దుమ్ము దులిపి కూర్చొని బీడీ అంటించాడు.

దేవరాజులు, హెన్రీ మరో నులకమంచంపై ఆమెకు ఎదురుగా కూర్చున్నారు. దేవరాజులు ఆమెనే చూడసాగాడు. ఆమె అతడికేసి తిరిగినపుడు, ఆలోచన లేకుండా అడిగాడు, "నువ్వెవరు?"

ఆ ప్రశ్నను పట్టించుకోకుండా ఆమె తన స్వభావరీత్యా మౌనంగా ఉండిపోయింది.

హెన్రీ నవ్వాడు. ఆ నవ్వు అతడి స్వభావానికి విరుద్ధమైనదిగా అనిపించింది. అతడి అంతరంగంలో వుండి ఆమే నవ్వినట్టుగానూ ఆ నవ్వు ప్రతిఫలించింది. ఆ నవ్వు అంతరార్థం దేవరాజులుకు అర్థమైంది, 'అతణ్ణి అలాంటి ప్రశ్న అడిగినా అతడు కూడా అలాగే బదులిస్తాడు. ఎవరిని ప్రశ్నించినా అలాంటి జవాబే సరియైనదేమో? 'హెన్రీ' అనో 'దేవరాజులు' అనో తాము చెబుతున్నట్టు ఆమెకు చెప్పడం తెలియటం లేదు. హెన్రీ పిలిచినట్టు ఆమె 'బేబీ' అని తెలుసుకోవలసిందే" అనుకున్న దేవరాజులు హెన్రీని చూసి నవ్వాడు.

"దొరా, ఈ అమ్మాయిని ఇక్కడే ఉంచుకుంటే ఏం? మీ దగ్గర మాత్రమే ఈ అమ్మాయి చెప్పినట్టు వింటోంది. 'ఇక్కడే ఉండు' అని చెబితే వింటుంది. ఎవరైనా వెదుక్కుంటూ వస్తే పంపేద్దాం. మనలాగా అందరూ ఈ అమ్మాయిని బేబీలా చూడలేరు. ఆ రోజు హైవేస్‌లో చూసినప్పటి నుండి నాకు ఈ ఆలోచనే ఉంది. మంచి కాలం, తానుగా ఇక్కడికొచ్చి చేరింది. ఎందుకైనా మంచిది నువ్వు దాంతో చెప్పు దొరా. ఇక్కడే ఉండమని..." అన్నాడు దొరస్వామి.

హెన్రీ లేచి వెళ్ళి మంచినీళ్ళు తాగాడు. ఆమెకు ఒక గ్లాసు మంచినీళ్ళు తీసుకొచ్చి ఇచ్చాడు. ఆమె అతణ్ణి తల పైకెత్తి చూసిం

> హెన్రీ కూర్చున్న మంచంపైన ఒక పక్కగా కూర్చుని, కాలుమీద కాలు వేసుకుని మోకాలి పైన రెండు చేతులూ పెట్టుకుని - ఒక యజమానురాలినన్నంత గాంభీర్యంతో అతణ్ణి చూసి నవ్వింది. ఆమె నవ్వు పాపాయి నవ్వు లాగానే అనిపించింది

ది. తర్వాత మంచి నీళ్ళ గ్లాసు అందుకొని కరుచుకొని తాగకుండా గ్లాసు పైకెత్తి తాగింది. తర్వాత లేచి వెళ్ళి మంచినీళ్ళ కుండపై గ్లాసు పెట్టి వచ్చింది. ఆ చర్య దొరస్వామికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆనందంగానూ అనిపించింది.

దేవరాజులు చేతి గడియారంలో టైమ్ చూశాడు. పన్నెండయింది. నిద్రగానీ, ఆవులింతలు గానీ లేకుండా తెల్లారేంత వరకూ కూర్చొని మాట్లాడుకోవచ్చు అన్నంత ఉత్సాహంగా ఉంది అతడికి.

"నాకూ ఒక బీడీ ఇవ్వండి" అని దొరస్వామిని అడిగాడు దేవరాజులు. దొరస్వామి

## నేనే అసత్యవాదినైతినేని...




భర్త ఇంటికోసం తెచ్చిన నెలవారీ సరుకుల్ని ఇరుగుపొరుగమ్మలకు అమ్ముకుని నగా నట్రా చేయించుకోవడం ఓ ఇల్లాలికి అలవాటుగా మారింది. నెల తిరక్కుండానే మళ్లీ మళ్లీ సరుకులు తెమ్మని గోల చేసేది. ఆమె విషయం కనిపెట్టిన భర్తగారు ఓ రోజున 'నాకంతా తెలుసు. నీ దొంగబుద్ధి మానుకో. లేకుంటే ఊరుకోను' అంటూ హెచ్చరించాడు.

వెంటనే ఆమె 'అనవసరంగా నిందలు వేయకండి. ఒకవేళ నాదే తప్పయితే ఆర్నెల్లలోగా నా పసుపు కుంకుమలు పోవాలి. తప్పు మీదైతే ఆర్నెలల్లో నా ఉసురు తగిలి మీరే పోతారు సరేనా?' అంది తెలివిగా.

రెండువైపులా తనకే ఎసరు పెట్టిన భార్య గడసరితనానికి బదులివ్వలేక నిలువు గుడ్లేసుకుని చూశాడు భర్తగారు.

ఇచ్చిన బీడీని, వెలుతుర్లో చూసి, "మన బీడీ నేగా" అనడిగాడు.

"మన దగ్గరున్న బీడీలన్నీ మన బీడీలే" అంటూ దొరస్వామి అగ్గిపుల్ల గీసి దేవరాజులు బీడీ అంటించడానికి సాయపడ్డాడు.

"తెల్లారగానే ఈ అమ్మాయిని మా అక్కమ్మ దగ్గరకు తీసుకెళ్ళి ఎవరో ఏమిటో చెప్పి విడిచి పెడితే చాలా ప్రేమగా చూసుకుంటుంది. ఈ అమ్మాయి ముఖాన్ని చూశారా... ఆ ముఖాన్ని చూస్తే ఎవరికైనా ఆమె మీద ఒక అభిమానం ఏర్పడుతుంది. మనం తరిమేసినా కూడా ఈ అమ్మాయి మనల్ని వదిలి వెళుతుందని నాకనిపించటం లేదు" పొగ పీలుస్తూ అన్నాడు దేవరాజులు. దొరస్వామి ఆ అమ్మాయిని చూశాడు. తన గురించే మాట్లాడుకుంటున్నారని, ఆమె గ్రహించలేక పోతోందని చలనం లేని ఆమె ముఖాన్ని చూస్తుంటేనే తెలిసిపోతోంది.

"ఎవరు కన్న బిడ్డో!" అని దొరస్వామి నిట్టూర్చినపుడు, హెన్రీ తనను గురించే ఊహించుకుంటున్నాడప్పుడు.

హెన్రీ ఆమెనే చూస్తూ దేవరాజులుతోనూ, దొరస్వామితోనూ మాట్లాడాడు. "ఈ అమ్మాయి గురించి ఏమైనా తెలుసుకుందామన్న ఆశ నాకు లేదు" అని చెప్పి ఇంగ్లీష్‌లో కొనసాగించాడు. "ఈ ఇంటికి ఈ అమ్మాయే మొదటి చుట్టం. అయితే ఆమె కూర్చున్న ధోరణి చూస్తుంటే ఈ ఇంటికి ఆమే యజమానురాలేమో అని నాకనిపిస్తోంది. నేను అడగకుండానే, ఆమె ఇక్కడ ఉంటుందని నేను నమ్ముతున్నాను. అయితే ఇప్పుడొచ్చినట్టుగానే చీకటి పడ్డాక, చుట్టుకున్న ఆ వస్త్రాన్ని తీసి పారేసి ఆమె వెళ్ళినా వెళ్లిపోవచ్చు ఆమె అలా చేసినా దానికి నేనేమీ బాధపడను. కానీ, మీరు అందుకు బాధ పడతారేమో ననుకుంటున్నాను"

"కచ్చితంగా" దేవరాజులు ఇంగ్లీష్‌లో అన్నాడు. దొరస్వామికి హెన్రీ చెప్పింది అర్థం కానందువల్ల, దేవరాజులుతో "ఏంటీ... ఏం అన్నారు దొర?" అని అడుగుతూ దగ్గరికొచ్చి కూర్చున్నాడు. హెన్రీ దొరస్వామితో 'అయాం సారీ' అని మన్నించమని కోరుతూ తెలుగులో విడమరచి చెప్పాడు. అతడు చెప్పాక దొరస్వామి అన్నాడు.

"బాధపడి ఏం ప్రయోజనం? ఈ అమ్మాయి ఇక్కడే ఉండి, బుద్ధి మారి అందరిలాగా ఉండాలని మనకూ ఉంది. కానీ మన చేతిలో ఏముందయ్యా! పోతే పోనీయండి, ఉంటే సంతోషం" అన్న దొరస్వామి "దానికి ఆకలేస్తోందో ఏమో. ఈ సమయంలో తినటానికి ఏం దొరుకుతుంది? " అన్నాడు.

"ఏదైనా తింటావా? " అని ఆమెతో మూగవాళ్లతో సైగ చేసి అడిగినట్టు అడిగాడు దొరస్వామి. భాష అర్థం కానిదానిలా ఆమె అతణ్ణి అయోమయంగా చూసింది.

"నేను ఇంటికెళ్ళి ఏమైనా పట్టుకొస్తాను" అని దేవరాజులు పైకి లేచాడు.

"ఇప్పుడేం వద్దండీ... తెల్లారాక చూసుకుందాం" అని అతణ్ణి వారించి కూర్చోబెట్టాడు హెన్రీ.

కొట్టంలో ఒక మూలగా పొడవైన కొయ్య పలక గురించి, నులక మంచం పైనున్న ఒక బెడ్‌షీట్ తీసి దానిమీద పరచి, ఆమెకు పడుకోవడానికి వసతి చేశాడు హెన్రీ. తర్వాత ఆమె దగ్గరికి వచ్చి, "గెటప్, నువ్వు అక్కడికెళ్ళి పడుకొని మంచి పాపగా నిద్రపో" అన్నాడు. ఆమె మునుపటిలా గలగలమని నవ్వింది. తర్వాత అతడు చెప్పినట్టు లేచి వెళ్ళి ఆ మూలలో పడుకుని మరో వైపు ముఖాన్ని తిప్పుకుంది.

దొరస్వామి ఆశ్చర్యంగా హెన్రీని అడిగాడు, "దొరా, నువ్వు ఏది చెప్పినా ఆ అమ్మాయి వింటోంది? విషయమేమిటో నాకర్థం కావటం లేదు! నువ్వంటే ఇంగ్లీష్‌లోనే మాట్లాడుతున్నా అర్థం చేసుకుంటోంది ఆ అమ్మాయి. మేం తెలుగులో మాట్లాడితే శబ్దం చేసినట్టు కూడా లేదు దానికి"

"నాకూ అదే ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు హెన్రీ. కొద్ది కొద్దిగా అందరి మాటలూ వింటుందనిపిస్తోంది నాకు. ఇప్పుడు కూడా మాట్లాడే భాషను అర్థం చేసుకుని నడచుకుంటోందని నేననుకోవటం లేదు"

"కరెక్ట్! దాని మనసుకు అర్థమయ్యే విధంగా మీరు మాట్లాడుతున్నారు" అన్నాడు దేవరాజులు.

"అదేం కాదు. నాకూ ఆ అమ్మాయి మనసు ఏమిటో అర్థం కావటం లేదు. 'మనసు, ఆలోచన' అనే భావాలు ఆమెకున్నాయనుకోవడం సందేహమే" అని దేవరాజులు మాటలను ఖండించాడు హెన్రీ.

దొరస్వామి తాను కూర్చున్న పలక మీద వెల్లకిలా పడుకొని కొట్టం బయట కనిపించిన ఆకాశాన్ని చూశాడు.

దేవరాజులుకు పడుకోవడానికి సౌకర్యంగా ఉండాలన్న భావంతో తన మంచం దగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు హెన్రీ. తర్వాత దీపం వెలుతురును కాస్త తగ్గించి వచ్చి పడుకున్నాడు. ఎవరికీ నిద్ర పట్టలేదు. అయినా ఆ ముగ్గురూ వేర్వేరుగా ఆమె గురించే ఆలోచిస్తూ, ఒకరి గురించి మరొకరు నిద్ర పోయారనుకుని పడుకుండిపోయారు.

తెల్లారుతుండగా, ఆమె పడుకున్న చోటు నుండి లేచి మోకాళ్ళు చుట్టూ చేతులేసుకుని కూర్చుంది. తక్కిన ముగ్గురూ నిద్ర పోతున్నారు.

మొదట దేవరాజులు నిద్ర లేచాడు. లేస్తూనే 'ఆమె ఉందా? ' అని చూశాడు. ఆమెతో మాట్లాడినా, నవ్వినా, ఆమెనుండి ఏ విధమైన ప్రతిచర్యా కనిపించదని అతడికి తెలుసు కనుక ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు.

కరిపిగాడు వచ్చాడు. వీధిలో, బడి ముందు పెద్దవాళ్ళు తరుముతూంటే, పిల్లలు చుట్టూ

నాకూ ఆ అమ్మాయి మనసు ఏమిటో అర్థం కావటం లేదు. 'మనసు, ఆలోచన' అనే భావాలు ఆమెకున్నాయనుకోవడం సందేహమే

నిలబడి వేడుక చూస్తుంటే, గుడ్డలేకుండా తిరిగి ఈ పిచ్చిది ఇప్పుడు గుడ్డలు కట్టుకుని నిశ్శబ్దంగా కూర్చుని ఉండడం చూసి వాడికి ఆశ్చర్యం కలిగింది.

వాడు వస్తూ అందరికీ టిఫిన్, కాఫీ తెచ్చాడు. దేవరాజులు ఇంటికెళ్లి బ్రష్ చేసుకుని, స్నానం చేసి టిఫిన్ తింటానికి అక్కడికే వచ్చాడు. అందరికీ ఇడ్లీలు ఆకుల్లో పెట్టి అందిస్తూ 'ఆమెకు ఆకు వెయ్యాలా వద్దా? తెల్లారి నిద్ర లేచినప్పటినుండి అదే చోటులోనే కూర్చోనుందే? పళ్ళు కూడా తోముకోలేదే' అని కరిపిగాడు సందేహించినపుడు దేవరాజులు హెన్రీతో అన్నాడు.

"నేను అక్కమ్మతో అన్నీ వివరంగా చెప్పి వచ్చాను. ఈ అమ్మాయిని అక్కడికి తీసుకురమ్మంది. మీరే చెప్పి కరిపిగాడితో పంపండి".

హెన్రీ తల గోక్కొని ఓ క్షణం ఆలోచించాడు. 'సరే, చూద్దాం' అని మనసులో అనుకొని ఆమె సమీపానికి వెళ్ళాడు.

"మ్... గెటప్! ఉదయం నుండి ఇక్కడే కూర్చుంటే ఎలా? వెళ్ళి స్నానం చేసి రా. అక్కమ్మ నిన్ను రమ్మందట. అక్కమ్మ



ఎవరంటే ఈయనకు సిస్టర్. యు గో విత్ హిమ్" అన్నాడు. ఆమె లేచి నిలబడింది. అందరినీ చూసింది.

"మ్... రా... రా..." అని ధైర్యంగా కరిపిగాడు ఆమెను పిలిచాడు. ఆమె వాడి వెంట నడిచింది.

"చూశారా? కరిపిగాడు మాట్లాడుతున్నది కూడా దానికి అర్థమవుతోంది? " అని ఆశ్చర్య

పోయాడు దేవరాజులు.

కరిపిగాడు ఆమెను దేవరాజులు ఇంటి ముందు ఆగమని చెప్పి అక్కమ్మను పిలుచుకు రావటానికి లోపలికి పరుగెత్తాడు.

"అక్కమ్మా... అక్కమ్మా, ఆ పిచ్చిది వచ్చింది. రండి, బయట నిలబడుంది" ఏదో పన్లో మునిగిపోయున్న అక్కమ్మ దగ్గరకు వచ్చి తొందర పెట్టాడు.

"పిచ్చిదనకురా, పాపం!" అంటూ అక్కమ్మ బయటికొచ్చి ఆమెను చూసింది.

"అయ్యో పాపం చిన్న వయస్సే! లక్షణంగా ముక్కూ మొహంతో ఉన్నావు కదే. నీ నెత్తిన ఆ భగవంతుడిలా రాసిపెట్టాడే" అంది చెంపకు చేతినానించుకొని. ఆమె అక్కమ్మను చూసి శబ్దం లేకుండా నవ్వింది.

"నవ్వు చూడూ... బుగ్గలు రెండు పక్కలా ఎలా గుంతలు పడుతున్నాయో! ఎలా మురికి పట్టిందో. తల చూడూ... గుబురుగా ఎలా చిక్కులు పడుందో. నీకు తల అంటడానికి నా వల్ల కాదు తల్లీ... రేయ్, కరిపిగా... వెళ్ళి ఆ మంత్రసానిని పిలుచుకురా" అని చెప్పి పంపించింది.

"దాని పేరు 'బేబీ' అండీ... మన హెన్రీ అయ్యగారు పెట్టిన పేరు" అని చెప్పి వెళ్ళాడు కరిపిగాడు.

"బేబీ... ఓ బేబీ పిల్లా, ఇదిగో, ఒక పక్కన కూర్చో. మంత్రసాని వచ్చి నీ తలకు నూనె అంటుతుంది. అంతవరకూ ఆకలితో ఉంటావా రాత్రే నిన్ను పస్తు పడుకోబెట్టేశారటగా" అని అంటూ లోపలికెళ్ళి ఒక ఆకులో నాలుగు ఇడ్లీలు పెట్టుకుని వచ్చి ఆ అమ్మాయి ముందు పెట్టింది అక్కమ్మ.

ఆ అమ్మాయి కళ్ళు టపటపలాడించి చూడటాన్ని గమనించి 'ఒకవేళ పళ్ళు తోముకోవాలనుకుంటోందో ఏమో?' అనుకున్న అక్కమ్మ తాను పట్టుకొచ్చిన ఇడ్లీలను ఆకుతో సహా మూసిపెట్టి "పళ్ళు తోముకుందువుగాని లేచి ఇలా రా" అని పెరటి వైపుకు తీసుకెళ్ళి బొగ్గు పొడి ఇచ్చింది. ఆ అమ్మాయి ఆ పొడితో పళ్ళు తోముకుంటుంటే పక్కన నిలబడి ఆమె



ఎంత అదృష్టమే" అని అక్కమ్మ కూడా ఆ అమ్మాయిని చూసి నవ్వింది.

'ఈ పిల్లకు నీళ్ళు పోసి, బాగా పసుపు రాసి, తల దువ్వి, చక్కగా బట్టలు కట్టి నిలబెడితే లక్ష్మీదేవిలా ఉండదూ?' అనుకుంది.

"నీ పేరేమిటి? రా... మొదట వచ్చి స్నానం చెయ్. ఒళ్ళంతా చారలు చారలుగా

నోరు పుక్కిలించడానికి, ముఖం కడుక్కోవటా నికి దోసిలిలో నీరు పోసింది అక్కమ్మ.

'ఈ పిల్లకు ఒక రవికె ఇవ్వాలి' అని గుడ్డ తొలిగినపుడు ఆ అమ్మాయి నగ్నదేహాన్ని చూసిన అక్కమ్మ అనుకుంది. పళ్ళు తోము కుని, ముఖం కడుక్కుని, పైగుడ్డతో తుడుచు కుని ముఖం పైకెత్తినపుడు ఆమె ముఖం ప్రకాశవంతంగా కనిపించింది. తర్వాతే ఆమే తానుగా వచ్చి ఆకులను అడ్డం పెట్టుకుని ఓ పక్కగా తిరిగి కూర్చుని ఇడ్లీలు తింది.

'ఈ అమ్మాయా పిచ్చిదానిలా, అనాకారిగా తిరుగుతోంది' అని నమ్మలేనట్టు ఆమెనే చూస్తున్న అక్కమ్మ ఓ నిట్టూర్పు విడిచింది.

మంత్రసాని వచ్చేసరికి పదైపోయింది. దేవ రాజులు, కరిపిగా డూ బడికి వెళ్ళిపోయారు. ఎదురింట్లో పనిచేసే కూలీల గొంతులూ, ట్రాక్టర్లో నుండి ఇసుక జారే శబ్దమూ, చెట్టు ను రంపంతో కోస్తున్న వాళ్ళ పాటా వం టింట్లో పని చేసుకుంటున్న అక్కమ్మకు విని పించాయి.

"అక్కమ్మా... రమ్మన్నారటగా" అంది మంత్రసాని.

"బాగానే ఉందే, నేను ఎప్పుడు రమ్మ న్నాను. నువ్వెప్పుడు వస్తున్నావ్? ఎక్కడ వాడు, నీ మొగుడు చిదానందం? తెల్లారి నుండి కనిపించటం లేదు" అని దబాయిస్తూ బయటికొచ్చిన అక్కమ్మ, అరుగుమీద ఓ పక్కగా కూర్చోనున్న ఆ అమ్మాయిని చూపి స్తూ అంది.

"నూనె ఇస్తాను... ఆ పిల్లకు బాగా అంటి తలకు పోసెయ్. పాపం ఎవరు కన్నబిడ్డో? మతి స్వాధీనం తప్పి తిరుగుతోంది. మన తమ్ముడూ, ఎదురింటి తమ్ముడూ చూసి వెంటబెట్టుకుని వచ్చారు. పిల్ల లక్షణంగా బావుంది కదూ"

మంత్రసాని మొదట ఆ అమ్మాయి దగ్గ రకు వెళ్లటానికీ, మాట్లాడ్డానికీ, భయపడి కాస్త పక్కగా నిలబడింది. ఆ అమ్మాయి వాళ్లను చూసి నవ్వడంతో దగ్గరకు వెళ్లింది.

"ఏం పిల్లా... నువ్వెవరూ, ఏ ఊరూ? నూనె అంటుతాను, స్నానం చేస్తావా...?" అని మాట కలిపింది. ఆమె ఏమీ జవాబివ్వ కుండా అమాయకంగా నవ్వింది.

మంచి నూనె, శీకాయ పొడి పట్టుకొచ్చి ఇచ్చి అక్కమ్మ లోపలికి వెళ్ళి తన తెల్లచీర లోంచి ఒకదాన్ని, అప్పుడప్పుడూ తాను ధరిం చే రవికె నొకదాన్ని తీసుకువెళ్ళి స్నానాల గది తలుపు పైన వేసింది.

పెరట్లో స్నానాల గదిలో నుండి ఓ పసి పాపలా బేబి నవ్వుతున్న శబ్దం వినిపిం చింది.

"అక్కమ్మా... చూడండీ, ఈ పిల్ల బాగానే సిగ్గు పడుతోంది" అని స్నానాల గది. బయ టకు తల చాపి పితూరీ చేస్తున్నట్టు చేసి నవ్వింది మంత్రసాని.

"సరే సరే, దాని ఇష్టానికి వదిలిపెట్టి తలకు పోసి తీసుకొని రావే" అని కసిరి అక్కమ్మ లోపలికొచ్చింది.

ఆ అమ్మాయి స్నానం చేసి అక్కమ్మ ఇచ్చిన చీరను కట్టుకొని వచ్చింది. రవికె ఆమెకు సరిపోక వదులుగా ఉంది. తలలోని తడి వీపుమీద పడి రవికె వెనుక భాగం తడిసి ఒంటికి అతుక్కుపోయింది. ఆమె చీర చక్కగా కట్టుకుంది.

"నువ్వు కట్టావా? అదే కట్టుకుందా?" మంత్రసానిని అడిగింది అక్కమ్మ.

"నన్నెక్కడ లోపలికి రానిచ్చిందా పిల్ల? తలుపు గడియ పెట్టుకుని తానే తలంటు పోసుకుంది. తలకంటిన నూనె పొయ్యిందో లేదో?" అని ఆమె వెంట్రుకల్ని పట్టి చూసిన మంత్రసాని, నిన్న రాత్రి ఆ అమ్మాయి కట్టు కున్న గుడ్డను వెంట్రుకలను చుట్టి గట్టిగా పిండింది.

స్నానం చేశాక ఆ అమ్మాయి పసిడి వర్ణంతో మెరిసి పోసాగింది.

ఆ అమ్మాయి రూపు రేఖలూ, యవ్వ నమూ ఆమెను ఓ సౌందర్య రాశిలా భ్రమిం ప చేసేలా ఉంది. 'ఆ పిల్లకు ఈ తెల్లచీర

బాగా లేదు. బావున్న పూలపూల చీర మంచి దొకటి కొనివ్వాలి" అనుకుంది అక్కమ్మ.




ఒక నెలలో ఇల్లు కట్టడం పూర్తయింది. ఆ వీధికి చెందిన ఓ ముసలాయన- గుడి ధర్మ కర్త, ఆయన భార్యా, ఊరి కరణం, అక్కమ్మా, మేస్త్రీలు, ఇంకా ఆ ఊరికి చెందిన కొందరు పెద్ద మనుషులు వచ్చి ఆ ఇంటిని చూసి విశ్వనాథం ఉన్నప్పుడు ఉన్న విధంగానే ఇప్పుడూ కట్టినట్టుగా పదే పదే అనుకున్నారు. మున్సిఫ్‌గారు లేకపోవడాన్నీ, నాగమ్మ వచ్చి చూడలేని పరిస్థితినీ హెన్రీ పదేపదే గుర్తు చేసుకున్నాడు.

పూర్తి చేసిన ఇంటిని చూపించటానికి ఒక రోజు దొరస్వామి లారీలో తన పిల్లల్నీ భార్య నవనీతాన్నీ, ఆమె తల్లి ఆదిలక్ష్మమ్మను ఎక్కించుకుని వచ్చాడు. దేవరాజులు వాళ్లంద రినీ అవ్వాళ తన ఇంటికి ఆహ్వానించి విందు ఇచ్చాడు. నవనీతానికీ, అక్కమ్మకూ స్నేహం ఏర్పడింది. వాళ్ళిద్దరికీ ఆ 'బేబీ' ఎంతో నచ్చింది.

ఈ నెల రోజులుగా ఆమెను చూసినవాళ్ళు, ఆమె ఓ సాధారణమైన, అమ్మాయేనని నమ్మే విధంగా ఆమె నడుచుకుంది. అయినా ఇంకా ఎవరితోనూ మాట్లాడ్డం లేదు. ఆమె మూగది కాదని అందరికీ తెలుసు. అందరూ చెప్పే పనిని ఆమె గుర్తు పెట్టుకుని చేస్తోంది. మాట్లాడుతున్నప్పుడు మనసు పెట్టి ముఖం కేసి చూస్తోంది. బాధ్యతగా నడుచుకుంటోంది.

ఇల్లు కట్టే కూలీలకు సాయంగా హెన్రీ వాళ్ళతో నిలబడున్నప్పుడు, ప్రారంభంలో ఆ అమ్మాయి కూడా వెళ్ళి అక్కడ వేడుక చూస్తుండేది. ఓ సందర్భంలో మేస్త్రీలలో ఒక డు ఆమెను తాగటానికి చెంబుతో మంచి నీళ్ళు తెమ్మన్నాడు. ఆమె హెన్రీని చూసింది. 'ఏం చేస్తుందో చూద్దాం' అని అతడు మౌనంగా ఉండిపోయాడు. ఆమె అక్కమ్మ ఇంటికి వెళ్ళి ఓ కుండ తీసుకొచ్చి తానే బావి లోనుండి నీళ్లను చేది పట్టుకొచ్చింది. మొదట ఒక చెంబు మంచినీళ్ళు అడిగిన వాడికి ఇచ్చింది. తర్వాత అక్కడ ఎండలో చెమట్లు కక్కుకుంటూ పని చేస్తున్న ఒక్కొక్కరి దగ్గ రకు వెళ్ళి ఒక చెంబు నీళ్ళతో నిలబడేది. నిప్పులు చెరిగే ఆ ఎండలో ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగటం ఎంతో సేద దీర్చినట్టుగా అనిపించింది అందరికీ.

వాళ్లందరూ కృతజ్ఞతగా నవ్వారు. ఆ విషయం విన్న అక్కమ్మ కూడా మరుసటి రోజు ఆమెతో నీళ్ళూమజ్జిగా ఇచ్చి పంపింది.

బళ్ళో విరామం గంట కొట్టినప్పుడల్లా పిల్లలు గుంపులు గుంపులుగా అక్కడికి మంచి నీళ్లు తాగటానికి వచ్చేవాళ్ళు. అక్కమ్మ ఆ పిల్లలతో చనువుగా మాట్లాడేది. కొన్ని సందర్భాలలో ఆ పిల్లలందరికీ మంచినీళ్లు ఇవ్వడానికి విసుక్కునేది. ఇప్పుడు ఆ పనిని ఆమె బేబీకి అప్పగించేసింది.

మొదట బేబీని చూసి ఆ పిల్లలు భయప డ్డారు. తర్వాత ధైర్యంగా ఆమె దగ్గరగా వచ్చారు. ఆమెతో మాటలు కలిపారు. "నువ్వెందుకు మాట్లాడనంటున్నావ్? " అని అడిగారు. ఆమె అన్నింటికీ నవ్వేసేది. ఆ పిల్లలు చెంబు నిండుగా ఉన్న మంచినీళ్లను తల పైకెత్తి 'గుటక్ గుటక్' మంటూ శబ్దం చేస్తూ తాగటాన్ని ఆస్వాదిస్తూ నిలబడేది.

దేవరాజులు ఆమెకు ఒక పచ్చ రంగు చీరా, ఎరుపు రంగు రవికె కొనుక్కొచ్చి ఇచ్చాడు. ఇప్పుడు ఆమె చెవులకు ఇత్తడి జూకాలు పెట్టుకుంటోంది. అక్కమ్మ గాజులు కొని పెట్టింది. ఇల్లు కట్టడం ముగిసినా హెన్రీ ఇంట్లోకి కాపురానికి రాకుండా ఇంకా కొట్టం లోనే ఉంటున్నాడు. దొరస్వామి ఉదయం

పూట ఓసారి వచ్చి ఆ ఇంటిని చూసి వెళు తున్నాడు.

ఒకరోజు దొరస్వామీ, దేవరాజులూ ఆ కొట్టంలో లాంతరు దీపం ముందు పెట్టుకుని ఇంటికి అయిన ఖర్చులన్నీ లెక్కలు వేశారు. హెన్రీ వాళ్లకు తోడుగా వచ్చిన వాడిలా కూర్చున్నాడు అంతే!!

రాత్రి సమయాలలో బేబీ దేవరాజుల ఇంట్లోనే పడుకుంటోంది.

కుమారపురం నుండి ఒక అయ్యవారిని పిలుచుకుని వచ్చి మంచి దినం, నక్షత్రం చూసి హెన్రీని ఆ ఇంటిలోకి గృహ ప్రవేశం చేయించాలని దేవరాజులు అనుకున్నాడు. అలా చేయించమని అతడికి చెప్పిన వ్యక్తి అక్కమ్మ.

అందరిలోనూ ఒక్కడుగా పని చేయడం, పదిమంది ఒక్కటిగా కలిసి పని చెయ్యటం చాలా ఆనందంగా ఉంది. ఆ పని ఒక నాట్యం లాగా, ఒక డ్రామాలాగా, ఒక భజన లాగా అద్భుతంగా ఉంది

ఆ రోజు సాయంత్రం దొరస్వామి అక్కడికి వచ్చినపుడు వాళ్ళు ముగ్గురూ కొట్టంలో కూర్చొని మాట్లాడుకో సాగారు. కుప్పలు నూర్చి సంచుల్లో నింపే వడ్లను మునుపటిలాగే కుమారపురానికి తీసుకుపోకుండా కొత్తగా కట్టి ముగించిన ఆ ఇంటికి తీసుకొచ్చి తీసుకురావాలనుకుంటున్న తనకి చెప్పడానికి వచ్చాడు దొరస్వామి.

ఇంకాసేపట్లో నాయక్ వస్తాడు. ఆ లోపు ఆ విషయాన్ని మాట్లాడేయాలనుకున్నాడు దొరస్వామి.

తమ ఇంటి విషయం మాట్లాడుతున్నప్పుడు నిజానికి దేవరాజులు కూడా అక్కడ ఉండకపోవడం మేలని అనుకున్నాడు. కాని తను రావటానికి ముందే అతడు అక్కడికి వచ్చేసినందువల్ల దొరస్వామి ఏం అనలేక ఊరుకున్నాడు. నులక మంచంపై కూర్చున్న దేవరాజులు దొరస్వామిని చూసి "రండి రండి" అని లేచి గోడ పక్కగా ఆనించి ఉన్న మరో మంచాన్ని పరిచాడు.

హెన్రీ చేదబావి దగ్గర స్నానం చేస్తున్నాడు. అతణ్ణి చూస్తూ దేవరాజులు, దొరస్వామితో "హెన్రీ చాలా తగ్గిపోయాడు. కదండీ? ఇక్కడికి వచ్చినప్పుడు బావున్నాడు. ఇల్లు కట్టి ముగిసేలోపు మనకన్నా ఈ ఊరికి బాగా సొంతమై పోయాడు"అన్నాడు.

దొరస్వామికి మొదట అతడు ఏం చెబుతున్నాడో అర్థం కాలేదు. దేవరాజులు వివరించాడు.

"ఆయన చేసే పని మనం కూడా చెయ్యాలండీ. మధ్యాహ్నం ఇల్లు చూద్దామని వస్తే తలకు గుడ్డ చుట్టుకుని నిచ్చెన మీదకెక్కి సిమెంట్ పూస్తున్నాడు. నేనెవరో మేస్త్రీ అనుకుని ఆయన దగ్గరికే వెళ్ళి ఎక్కడయ్యా హెన్రీ అడిగాను" అని చెప్పి నవ్వాడు దేవరాజులు.

హెన్రీ స్నానం పూర్తిచేసి తడి గుడ్డతో వాళ్ల కెదురుగా వచ్చి నిలబడి తల తుడుచుకున్నాడు. తన గురించి దేవరాజులు దొరస్వామితో చెబుతున్న విషయాల్ని విని బట్టలు మార్చుకుంటూ అన్నాడు.

"పని చెయ్యటం ఎంత సంతోషంగా ఉందో తెలుసా? అందరిలోనూ ఒక్కడుగా పని చేయడం, పదిమంది ఒక్కటిగా కలిసి పని చెయ్యటం చాలా ఆనందంగా ఉంది. ఆ పని ఒక నాట్యంలాగా, ఒక డ్రామాలాగా, ఒక భజన లాగా అద్భుతంగా ఉంది" ఎంతో ఉత్సాహంగా చెప్పాడు.

దేవరాజులు ఆ మాటలు విని ఓ క్షణం ఆలోచించి "ఆ గ్రూప్ డాన్స్, ఆ భజన... అన్నింటికన్నా చాలామంది ఒకటిగా చేరి కష్టపడటమన్నది కాస్త గొప్పదిగానే అనిపిస్తోంది" అన్నాడు. "ఎందుకంటే In addition, it fulfills the basic needs of man"

బీడీ తాగుతున్న దొరస్వామి వాళ్ళు మాట్లాడుతున్న విషయాన్ని అర్థం చేసుకున్నాడు.

మధ్యలో కల్పించుకొని అన్నాడు. "నాట్యమూ, డ్రామా అందరూ కలిసి ధనాధనా అని దుమ కటమేగా? అందులో అంత పనితనం ఉం దా? ఇక్కడ పాటలు పాడతారు. నవ్వి స్తూ మాట్లాడేవారున్నారు. ఈ ఇల్లు కట్టే డ్రామా లో అంజయ్యే కమేడియన్... మన దొరే ఈరో...దొరా...రేపు మన మడిలో వరి కుప్ప కొడుతున్నారు. నువ్వొచ్చి చూడు. ఆ డ్రామా ఇంకా అందంగా ఉంటుంది! నిజమైన డ్యాన్స్ అదే దొరా... కుప్ప కొట్టాక ఒడ్లన్నీ తీసుకొచ్చి ఇక్కడ దింపేద్దాం. ఇంతకు ముందు కుమా రపురానికి తీసుకుని వెళ్ళేవాళ్ళం. ఇప్పుడు మనిల్లే ఉందిగా" అని తన నిర్ణయాన్ని సంద ర్భం చూసుకుని చెప్పేశాడు దొరస్వామి.

అందుకెవరూ అభ్యంతరం చెప్పలేదు. దేవ రాజులుకు గృహప్రవేశం విషయమై అక్కమ్మ చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది.

"అది సరేనండీ, కొత్తగా ఇల్లు కట్టి గృహప్ర వేశం చెయ్యొద్దా? తిథి, వారం, నక్షత్రం చూసే అలవాటు మీకు ఉంది కదూ? మనం ఎలా ఉన్నా ఇంట్లో ఆడవాళ్ళు అవన్నీ చూస్తారు" అన్నాడు దేవరాజులు.

"ఔనౌను. అవన్నీ చూడాల్సిందే. కానీ అవన్నీ కొత్తగా పునాదులేసి ఇల్లు కడితేనేగా చూస్తారు. ఇది పాడుబడ్డ ఇంటిని రిపేర్ చేయడమేగా? " అని తన మనసులో మాట అన్నాడు దొరస్వామి

అప్పుడే హోటల్ నాయక్ అక్కడికి వచ్చా డు. దొరస్వామి మాటల్ని విన్న అతడు "ఇంటిని రిపేర్ చేశామా, కొత్తగా కట్టామా అన్నది కాదు. అసలు విషయం, కొత్తగా అందులో ఉండబోతున్నారుగా అదే మనం చూడవలసింది. దేన్నైనా ప్రారంభిస్తున్నపుడు దానికొక సంప్రదాయం, మంచి అని పాటించే పద్ధతులున్నాయిగా..." అన్నాడు.

"అయితే ఏం చేద్దాం? మీరే చెప్పండి" అని దేవరాజులును చూస్తూ కన్ను గీటి 'నాయక్ ఏం చెబుతాడో చూద్దాం' అన్నట్టు అడిగాడు దొరస్వామి.

"నాకు తెలిసింది చెబుతాను. మీరు అయ్య వారిని పిలుస్తారో, అర్చన చేస్తారో... అవన్నీ మీ ఇష్టం. ఊరంతా పిలిచి విందు పెడతారో, ఒకరిద్దరిని పిలిచి తాంబూలాలిస్తారో - అది మీ సౌకర్యం. ఊళ్ళో ఉన్న నలుగురు పెద్ద మనుషుల్ని మాత్రం పిలిపించాలి. నలుగురు ముత్తైదువులు వచ్చి దీపం వెలిగించి మొక్కా లి" అన్నాడు నాయక్.

"శెభాష్! అలాగే చేద్దాం. రేపే మన పోస్టా ఫీస్ పంతులుగారిని కలిసి తిథి, వారం, నక్షత్రం చూడమందాం. ఇంక నేను బయలు దేరుతాను..." అని లేచి నిలబడ్డాడు దొర స్వామి.

"ఏం బిడ్డా... అప్పుడే బయలు దేరే శావు? " అన్నాడు నాయక్.

"రేపు మళ్ళో కుప్ప కొట్టేందుకు పనివాళ్లని చూసుకోవాలి" అని వెళ్లిపోయాడు దొర స్వామి.

సాయంత్రం చీకట్లు కమ్ముకుంటున్నాయి. వీధిలోకొచ్చి ముగ్గురు నిలబడి సూర్యాస్త మయం వెలుగులో ఆ ఇంటిని చూశారు.

## 16

హెన్రీ దేవరాజుల ఇంటి మేడ మీదకు వెళ్ళి నీరెండలో నిలబడి కొత్తగా కట్టిన ఆ ఇంటిని చూశాడు. అక్కడినుండి చూసినపుడు ఆ ఇంటి ముందు భాగమూ, వెనక పెరటి చేదబావి కనిపించాయి.

కొత్త నాటుపెంకులు పేర్చిన ఇంటి పైభాగం సాయంత్రం నీ రెండలో తళతళ మెరిసిపోతోంది. ఆ వీధిలోకెల్లా ఆ ఇల్లు ప్రత్యేకంగా, కొత్తగా దర్శనిమివ్వసాగింది. ఓ చిత్రకారుడు తాను గీసిన చిత్రాన్ని దూరంగా నిలబడి చూసి ఆస్వాదించేలా హెన్రీ అక్కడ కొచ్చి నిలబడి చూస్తున్నాడని అతడి వెనుకే వచ్చిన దేవరాజులు అనుకున్నాడు. హెన్రీ మదిలో ఆ ఇంటి అంతర్భాగాలు, అమరికలు మెదిలాయి.

దేవరాజుల ఇంటి వెనక పెరట్లో కూర్చొని, చీపురు కట్టకోసం ఎండుకొబ్బరి మట్టల ఈనె

లు వేరుచేస్తున్న బేబీ, తల పైకెత్తి వాళ్ళను చూసింది.

"హాయ్ బేబీ... వాట్ ఆర్ యు డూయిం గ్?" అని అడిగాడు హెన్రీ. ఆమె చిర్నవ్వు చిందించింది. దేవరాజులు హెన్రీతో "షి ఈజ్ వెరీ హెల్ప్ ఫుల్. ఏమేమో పనులు చేస్తోంది. చేసే పనిని తొందరగా నేర్చు కుంటోంది. చాలా స్మార్ట్!" అని పొగిడాడు.

అక్కమ్మ ఆమె సమీపానికి వచ్చి కూర్చొని వాటిని కట్టల కట్టలుగా రెండు మూడు చీపు రు కట్టలు కట్టింది. అకస్మాత్తుగా తల పైకెత్తి మేడ మీద నిలబడున్న హెన్రీని చూసింది.

"ఏం తమ్ముడూ, ఇల్లు కట్టి ముగించేంతవ రకూ ఇక్కడకు రాకూడదని ఏమైనా శప థమా?" అంది హెన్రీతో.

"నేను రాకపోతే ఏమండీ? దేవరాజులు సార్, కరిపిగాడు, బేబీ అందరూ అక్కడికొస్తు న్నారు. మీరు పంపే భోజనమూ వస్తోంది. మీరూ అక్కడికి వచ్చి చూశారు. నాకు ఎంతో సంతోషంగా ఉంది..." అన్నాడు హెన్రీ. అతడి మనసులో- ఈ అక్కమ్మ పరాయి ఇంటి గడప తొక్కదనీ, అలాంటిది తననూ తన ఇంటినీ సొంతంగా భావించినందువల్లే వచ్చిందని సంతోషించాడు.

"కాపురానికి ఎప్పుడు వెళతారు?" అని అడుగుతూ లేచి నిలబడింది అక్కమ్మ.

"మీరంతా కలిసే అన్నీ చెయ్యాలి. దేవరా జులు సారూ నేనూ ఇప్పుడు పంతులుగారిం టికి వెళుతున్నాం, మంచిరోజు చూడ్డానికి. మిస్టర్ దేవరాజులూ మీరు మీ మిసెస్‌ను ఈ ఫంక్షన్‌ను రమ్మని చెప్పండి?" అని ఇటు తిరిగి దేవరాజులుతో అన్నాడు హెన్రీ.

తర్వాత హెన్రీ, దేవరాజులు మేడమీది గది లోకి వెళ్ళి కూర్చొని కరిపిగాడు పట్టుకొచ్చిన కాఫీ తాగారు. ఇంకా పూర్తిగా చీకటి పడ లేదు. దేవరాజులూ, హెన్రీ పోస్టాఫీసు పంతులు ఇంటికి వెళ్ళడానికి మేడమీద నుండి కిందకు దిగి వచ్చినపుడు కొబ్బరి మట్టల చెత్త నంతా శుభ్రంచేసేసి, హెన్రీ ఇంటి లాంతరు దీపంలోని చిమ్నీని బూడిదతో తోముతూ కనిపించింది బేబీ.

"మన ఇంటికి కరెంటు పెట్టిస్తే ఎలా ఉంటుంది?" అనడిగాడు దేవరాజులు.

"అవసరం లేదనుకుంటున్నాను. ఎలక్ట్రిసి టీనే వద్దని నేనటం లేదు. మనకు అవసరం లేదనిపిస్తోంది" అని దేవరాజుల ఆలోచనను అర్థం చేసుకుని వివరించాడు హెన్రీ.

ఇద్దరూ మాట్లాడుతూ వీధిలోకి నడిచారు. వీధి దీపాలు వెలిగాయి.

"నాకు తెలిసి మన ఊరికి ఎలక్ట్రిసిటీ వచ్చాక ఎంతో అభివృద్ధి చెందింది. మన మడులంతా బీడు భూములండి. కరెంట్ వచ్చి పంప్ సెట్ వేయించాక సాగు భూము లుగా మారిపోయాయి. అరటి, చెరకు, వరి పంటలు ఇటు పక్కన చూడ్డానికి ఇదివరకు వీలయ్యేదా?" అని విద్యుచ్ఛక్తి గొప్పతనాన్నీ, విజ్ఞానాభివృద్ధినీ మెచ్చుకుంటూ మాట్లాడాడు దేవరాజులు. హెన్రీ చాలా ఆసక్తిగా విన్నాడు.

హెన్రీ జవాబిచ్చేలోపు దేవరాజులు మళ్ళీ మొదలెట్టాడు. "నగరాలకూ, గ్రామాలకూ చాలా తేడాలున్నాయి... అది మారాలి! గ్రామాలు నగరాలుగా మారాలి. నగరాల కన్నా విద్యుచ్ఛక్తి, రహదారులు, ట్రాన్స్‌పోర్ట్ అన్నీ గ్రామాలకేనండీ చాలా అవసరం. వ్యవ సాయ రంగం పూర్తిగా ఆధునికం కావాలి.



పారిశ్రామిక కార్మికులలాగా వీళ్లకూ యూనిఫాం, ఎనిమిది గంటల పని, నివాస యోగ్యమైన కాలనీలు, వైద్య సదుపాయాలు, పెన్షన్, ప్రావిడెంట్ ఫండ్, బీమా సౌకర్యాలు అన్నీ కల్పించాలి..."

అతడు చెప్పేది హెన్రీ ఓపికగా వింటు న్నాడు. తన అభిప్రాయాలు చెబుదామను కున్నా వాటి గురించి మాట్లాడ్డం దేవరాజుల కున్న మంచి లక్ష్యాల్ని ఖండించినట్టు అవు తుందేమోనన్న ఆలోచనతో మౌనంగా తల వంచుకుని నడవసా గాడు హెన్రీ.

"మీలాంటి వారే దానికి చొరవ చూపిం చాలి. మీరు తప్పుగా భావించకూడదు" అని "వాళ్ళనూ వాళ్ళ జీవితాలనూ నవీనంగానూ, సైంటిఫిగ్గానూ, మార్చటానికి బదులుగా మీరు రోజు రోజుకూ అనాగరికుడిలా మారిపోతు న్నారు..." అన్నాడు ఇంగ్లిషులో.

హెన్రీ నవ్వాడు.

అతడు సమాధానం చెప్పేలోపు వాళ్ళు



## గోదానం




ఇద్దరన్నదమ్ములు తమ తల్లి మరణానంతరం కర్మకాండలన్నీ పూర్తిచేస్తున్నారు. బ్రాహ్మడు 'అయ్యా.. ఈ సమయంలో గోదానం చేస్తే మీ తల్లిగారి ఆత్మ స్వర్గానికి పోతుంది' అనిచెప్పాడు.

అన్నదమ్ములిద్దరూ సరేనన్నారు.

తమ్ముడు అన్నను పక్కకు పిలిచి 'అన్నయ్యా... నిరుడు మన మందనుంచి తప్పిపోయిన నల్లమచ్చల తెల్లావును ఈ బ్రాహ్మడికి దానం చేద్దాం' అన్నాడు.

'ఒద్దొద్దు.. వీడసాధ్యుడు. తప్పిపోయిన ఆవును వెదికి పట్టుకోగలడు. నిరుడు దొమ్మ తగిలి చచ్చిన తెల్లమచ్చల నల్లావును దానంచేసేద్దాం' అన్నాడు అన్నగారు.

పోస్టాఫీసు పంతులు ఇంటి ముందుకు వచ్చేశారు. లోపలినుండి పంతులు వాళ్లను చూసి లేచి బయటికి వచ్చాడు.

"రండి... సార్! రండి - కూర్చోండి..." అని అరుగు మీద పైగుడ్డతో దుమ్ము దులిపాడు. దేవరాజులూ, హెన్రీ ఒక అరుగు మీదా, పంతులు మరో అరుగు మీదా కూర్చున్నారు.

"పాలు తాగుతారా? " ఆప్యాయంగా అడిగాడు పంతులు.

"లేదు. ఇప్పుడే కాఫీ తాగాం..." అన్నాడు దేవరాజులు.

"గొప్ప సాధనే! ఒక్క మాసంలో ఇల్లు కట్టి ముగించడం గురించి అనడం లేదు. మునుపటిలాగే ఇంటిని కట్టి ముగించారే... అదే సాధన అంటున్నాను... ఎవరికైనా ఇక్కడ ఒక గది కట్టుకుందాం అనిపిస్తుంది. తర్వాత అక్కడ చూసి, మరేదో చెయ్యాలనిపిస్తుంది. దొర పట్టుదలగా ఏదో 'మాన్యుమెంట్' ఏర్పాటు చేసేలా అందంగా మార్చేశాడు ఆ ఇంటిని. మనసు విప్పి చెబుతున్నాను. ఈ కాలంలో గుళ్ళను పునరుద్ధరిస్తున్నామంటూ సినిమా సెట్ వేసేస్తున్నారు. అదీ చూస్తున్నాంగా. మన ఊరి దేవాలయ కుంభాభిషేకం వస్తోంది. దాని బాధ్యత దొరకే అప్పగించాలి. భేష్! భేష్! నాకు మీ కార్యదీక్షా, మీ ధోరణీ అన్నీ ఎంతగానో సంతోషాన్ని కలిగించాయి. ముఖ స్తుతి చేస్తున్నాననుకోకండి. మీరేదో పని మీద వచ్చినట్టున్నారు. నేనే మాట్లాడుకుంటూ పోతున్నాను" అని నోటి నిండుగా తాంబూలం కుక్కుకుని మౌనం వహించాడు పంతులు.

"గృహ ప్రవేశం కోసం ముహూర్తం పెట్టాలి" అని ఒక్క ముక్కలో వచ్చిన విషయాన్ని చెప్పాడు దేవరాజులు.

"ఓ! భేషుగ్గా..." అని లోపలికి వెళ్ళి పంచాంగాన్ని దీపం వెలుతురులో చదివి చూశాక, అరుగుమీదకొచ్చి కూర్చొని ఈ మాసమంతా ముహూర్తాలు చాలానే ఉన్నాయి" అన్నాడు.

"ఒక వారంలోపే చెప్పండి" అన్నాడు దేవరాజులు. పంతులు వేళ్ళను ఒక్కోటిగా మడిచి లెక్కపెట్టి "వచ్చే శుక్రవారం అద్భుతంగా ఉంది. ఎన్ని గంటలకనేది చూసి చెబుతాను'' అని మళ్ళీ పంచాంగం చూడ్డానికి లేచాడు.

"వచ్చే శుక్రవారమే పెట్టుకుందాం, ఏమంటారు? " హెన్రీని చూస్తూ అడిగాడు దేవరాజులు.

"మీ ఇష్టప్రకారమే కానివ్వండి" నవ్వుతూ అన్నాడు హెన్రీ.

ఇద్దరూ పంతులు నుండి సెలవు తీసుకొని వీధిలోకి వచ్చాక మున్సిఫ్ గారింటిని చూశాడు హెన్రీ. ఆ అరుగు బోసిపోయి కని

పించింది. "గూట్లో నూనెదీపం చాలా అందంగా ఉంది" అన్నాడు మళ్ళీ.

అతడు నూనె దీపం అందాన్ని ఆస్వాదిస్తూ అన్న మాటల గురించి ఏదో చెప్పాలని భావించిన దేవరాజులు, అతడు ఏం చెప్పబోతున్నాడో అర్థం చేసుకున్న హెన్రీ ఒకే సమయంలో ఒకర్నొకరు చూసుకున్నారు. హెన్రీ చిరునవ్వు నవ్వుతూ ఇంగ్లీష్‌లో అన్నాడు.

"నేనేదో పురాతన వాదం చేసేలా మీకు అనిపించవచ్చు. మీరు చెప్పండి. అదిగో ఆ దీపం అందంగా లేదూ? వెలుతురికి అది చాలదూ? సరే, ఒకవేళ అది మీకు అందంగా అనిపించక పోవచ్చు. మీరు చేస్తున్న పనికి ఆ వెలుతురు సరిపోకపోవచ్చు. కానీ నాకు అది చాలు. నాకు అంతే చాలు. ఈ ప్రపంచం మొత్తం యంత్రాలూ, విద్యుచ్ఛక్తి వెలుతురుతో కోలాహలపడనీ. నా ఇంట్లో నాకు ఈ వెలుతురూ, ఈ ప్రశాంతతా పరుచుకోనీ. అలాగే నేను వివాహాలకో, ఆడా మగా సంబంధాలకో వ్యతిరేకిని కాను. దేనికైనా వ్యతిరేకిగా ఉండటం సరికాదు. కానీ...కానీ... నాకు వివాహం అవసరం లేదు అని నేను అనుకుంటున్నాను. నేను వివాహం చేసుకోను. నాకు అంబలి మాత్రం చాలు. అందరూ అంబలే తాగాలని నేననను. మీరు చెబుతున్నట్టు ఈ గ్రామాలూ, ఇక్కడ జీవిస్తున్న జనాలూ, నగర జీవితాలతో తేడాలు లేకుండా కలిసిపోయే రోజు రావచ్చు. రానీయండి. వాటిలో నేనెందుకు కొట్టుకుపోవాలి? " అన్నాడు.

వాళ్ళు మాట్లాడుతూ హెన్రీ ఇంటి వెనకున్న కొట్టం దగ్గర చేరుకున్నారు. అప్పుడే బేబీ హరికేన్ లాంతరు వెలిగించి ఇనుప చువ్వకు తగిలించింది.

"థ్యాంక్యూ" అని ఆమెకు కృతజ్ఞతలు తెలిపాడు హెన్రీ. "వచ్చే శుక్రవారం గృహప్రవేశం. అప్పుడు కూడా నువ్వే దీపం వెలిగించాలి" అని ఆమెతో అతడన్నప్పుడు, ఆమె అతడికోసం ప్రార్థిస్తున్నట్టు నమస్కరించి ఓ చిర్నవ్వు చిందిస్తూ వెళ్ళిపోయింది.




హెన్రీ కట్టిన కొత్త ఇల్లు పండుగ వాతావరణాన్ని సంతరించుకుంది. దొరస్వామి, దేవరాజులు అందరినీ పరుగులు తీయించి పనులు చేయిస్తున్నారు. దొరస్వామి కుటుంబ సభ్యులు అందరూ ఉదయాన్నే వచ్చేశారు. దేవరాజులు ఊరెళ్ళి కనకమాలక్ష్మిని వెంటబెట్టుకొచ్చాడు. అప్పుడు హెన్రీ ఇంట్లో లేడు. అక్కమ్మ ఆమె చేతుల్ని పట్టుకుంది. ఆమెకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

"సీమంతం వరకూ నువ్విక్కడే ఉండు. తమ్ముడు ఒంటరిగా ఉండటం నాకు చాలా కష్టంగా ఉంది. మీరిద్దరూ ఒకటిగా ఉండడం కోసం నేను ఎక్కడికైనా వెళ్ళి ఎవరింట్లోనైనా ఉండిపోతాను. ఇక్కడ చేసే సాయమే ఎవరికి చేసినా నాకు ఇంత గంజి పొయ్యకుండా పోరు. మిమ్మల్ని వేరు చేసిన పాపం నాకు వద్దు" అని చెప్పి ఆమె చేతులు పట్టుకుని లోపలికి తీసుకెళ్తున్నప్పుడు కన్నీళ్ళు పెట్టుకుంది.

చూడ్డానికి ఓ గర్విష్టిలా కనిపించే కనకమాలక్ష్మి ఆ మాటల్ని విని తట్టుకోలేక అక్కమ్మను గట్టిగా కౌగలించుకుంది. అయినా అక్కమ్మను సమాధానం పరచడం కోసమైనా ఒక్క మాట కూడా మాట్లాడలేకపోయింది.

కనకమాలక్ష్మి మేడమీద గదికి వెళ్ళింది. ఆమెకన్నా ముందు ఆమె పెద్ద ట్రంక్ పెట్టెను మోసుకుంటూ కరిపిగాడు మెట్లెక్కసాగాడు. ఆమె నైలాన్ చీరా, ప్లాస్టిక్ చెప్పులూ, సవరం పెట్టి వేసిన పెద్ద జడా ఆ గ్రామానికి తాను పరాయిదానిగా ఉండటానికే ఇష్టపడు

తున్న విషయాన్ని స్పష్టం చేస్తున్నట్టున్నాయి. దేవరాజులు ఆమెను ఇంటి గుమ్మంలోకి తీసుకొచ్చి వదిలిన తర్వాత హెన్రీని వెదుక్కుంటూ ఎదురింటికెళ్ళాడు. దొరస్వామి, హెన్రీ అంగడి వీధికి వెళ్ళినట్టు తెలుసుకున్నాక వాళ్ళ రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. దొరస్వామి భార్య నవనీత బేబీకి తల దువ్వి జడ వేసి మొగలి రేకులు పెట్టి కుట్టింది.

మరుసటి రోజుకు కావలసిన వంట సామాగ్రి, కాయగూరలు, కొట్టంలో కుమ్మరించారు. దొరస్వామి పిల్లలు వీధిలోనూ ఇంటి చుట్టుపక్కలా పరుగులు తీస్తూ ఆడుకుంటున్నారు.

మేడ మీదకు వెళ్ళిన కనకమాలక్ష్మి మేడ గది తాళం చెవి కోసం ఎదురు చూస్తూ నిలబడ్డప్పుడు అక్కడ నుండి ఎదురింటికేసి చూసింది. ఆ ఇంటి గురించి, హెన్రీ గురించి దేవరాజులు ఆమెతో పదే పదే చెప్పినప్పుడు ఆమె అయిష్టంగానే వింది. కొన్ని సందర్భాలలో ఆమెకు అసహనం కూడా కలిగింది. ఆమె పైనుండి చూసినప్పుడు దేవరాజులు బేబీని, ఆమె అలంకారాన్ని గురించి పరిహాసం చేస్తున్నాడు. ఆమె ఏమీ సమాధానం చెప్పకుండా వినోదంగా నవ్వుతూ ఉండటాన్ని బట్టి ఆమే ఆ పిచ్చిదై ఉండొచ్చని కనకమాలక్ష్మి ఊహించ గలిగింది. ఆ పిచ్చిదాని గురించి విన్న విషయాల్ని ఆమె ఇప్పుడు నమ్మలేక పోతోంది. ఒక్క చూపులోనే పిచ్చిది ఆమెకు బాగా నచ్చింది.

హెన్రీ, దొరస్వామి తమకు తెలిసిన వారందరినీ గృహ ప్రవేశానికి ఆహ్వానించటానికి వెళ్లారు.

దేవరాజులు చెప్పి పంపటం వల్ల హెన్రీని వెదుక్కుంటూ కరిపిగాడు నాయర్ హోటల్ దగ్గర వాళ్లను కలిశాడు.

"ఆయన వచ్చేశారండీ. వాళ్ల ఇంటామె కూడా వచ్చారు. మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారండి" ఆనందంగా గొంతు పెంచి హెన్రీకి చెప్పాడు కరిపిగాడు.

"నువ్వు వెళ్ళు దొరా. నేను కలవాల్సిన వాళ్లను కలిసి వస్తాను" అని హెన్రీని కరిపిగాడితో పంపాడు దొరస్వామి. బయలుదేరుతున్నప్పుడు హెన్రీ నాయక్ భార్యనూ, నాయక్‌నూ చూసి చేతులు జోడించి "మీరందరూ రేపు రావాలి" అని ఆహ్వానించాడు.

"మేము లేకుండానా?" అని నాయక్ నవ్వాడు.

దేవరాజులు హెన్రీ రాక కోసం వీధి మెట్ల వద్దే ఎదురు చూస్తూ కనిపించాడు. ఇద్దరూ ఒకరినొకరు చూసుకొని నవ్వుకున్నారు. "రండి, ఆమెను మీకు పరిచయం చెయ్యాలి" అని ఇంగ్లీష్‌లో చెప్పి హెన్రీని వెంటబెట్టుకొని తన ఇంట్లోకి తీసుకెళ్లాడు దేవరాజులు. ఎదురుపడ్డ అక్కమ్మ, "ఆమె మేడ మీద ఉంది" అని చెప్పింది.

మేడ మెట్ల మీద వాళ్లు వస్తున్న అడుగుల శబ్దం విని మంచంపై పడుకొని ఉన్న కనకమాలక్ష్మి లేచి నిలబడింది. దేవరాజులు హెన్రీని ఆమెకు పరిచయం చేశాడు. "నేను చెప్పానే మిస్టర్ హెన్రీ, మై ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్" అని ఆమెతో చెప్పి, "నా భార్య" అని హెన్రీకి పరిచయం చేశాడు.

హెన్రీ ఆమెకు చేతులు జోడించి నమస్కరించాడు. ఆమె అతడికి మర్యాద పూర్వకంగా ప్రతి నమస్కారం చేసింది.

"మీరు రేపు తప్పకుండా మా ఇంటి గృహ ప్రవేశానికి రావాలి" అని ఆమెను హెన్రీ ఆహ్వానించినపుడు దేవరాజులు లోలోన సంతోషించాడు. తాను నేర్పించిన పల్లవిని అతడు చిలక పలుకుల్లా అందరి వద్దా చెబుతున్నట్టు అనిపించింది. తర్వాత కాసేపు అక్కడే కూర్చొని హెన్రీ, దేవరాజులు మాట్లాడుకున్నారు. కనకమాలక్ష్మి కిందకు వెళ్ళిపోయింది.

"అమె ఇకపై ఇక్కడే ఉంటుంది అనుకుంటున్నాను" అని గొంతు తగ్గించి కళ్లార్పుతూ అన్నాడు దేవరాజులు.

"విష్ యు ఆల్ ద బెస్ట్" అన్నాడు హెన్రీ.

ఆ రాత్రి అక్కమ్మ కొత్త ఇంటికి వచ్చి గడిపింది. ఇంట్లో ఉన్న ఆడాళ్ళు అర్ధరాత్రి వరకూ ఏవేవో పనులు చేస్తూనే ఉన్నారు. అక్కమ్మ రెండు గిన్నెలలో బియ్యపు పిండీ, ఎర్రమట్టీ కలిపి ఇల్లంతా ముగ్గులు పెట్టింది. బేబీ ఆమెతో పాటు ఉండిపోయింది.

పాండూ, కరిపిగాడూ ఇంటి ముందు అరటి చెట్లు కట్టారు. మేళగాళ్ళు నాదస్వరం మేళతాళాలతో రాత్రే వచ్చి అరుగు మీద చేరారు.

హెన్రీ ఇంకా ఆ ఇంటికి గృహ ప్రవేశం కానందువల్ల ఇంటి వెనకున్న కొట్టంలోనే నులక మంచంపై పడుకుని నిద్ర పోయాడు. దేవరాజులు రాత్రి చాలా సేపటివరకూ అతడితో ఉన్న తర్వాత ఇంటికి వెళ్లిపోయాడు. నాయక్, దొరస్వామి, హెన్రీతో పాటు కొట్టంలో పడుకున్నారు.

తెల్లవారుతూ ఉండగా వీధి వీధంతా జనాలతో నిండిపోయారు. ఉదయం నుండే నాదస్వరం వాయించడం మొదలు పెట్టారు. డోలు వాయిద్యగాడు బ్రహ్మాండంగా వాయించసాగాడు.

హెన్రీ, దొరస్వామి కొనుక్కొచ్చిన జరీ అంచు ధోవతిని కట్టుకొని చొక్కాలేని ఒంటిపై పట్టు అంగ వస్త్రాన్ని వేసుకున్నాడు. బేబీ కూడా కొత్త చీర కట్టుకుంది. ఉదయం అందరూ ద్రౌపదమ్మ గుడికి వెళ్ళి అర్చన చేసి వచ్చారు.

ఇంటి మధ్యలో హెన్రీ పప్పా, మమ్మా ఉన్న ఫొటోను పెట్టాడు. దానికి దొరస్వామి ఒక పెద్ద గులాబి మాలను తగిలించాడు. ఇంటి వెనుక భాగాన నేలమీద సన్నటి గుంత తవ్వించి ఏర్పాటు చేసిన పెద్ద పొయ్యిపై రెండు మూడు పెద్ద పాత్రలు వరుసగా నిలబెట్టి వంట వాళ్ళు చెమటలు కార్చుకుంటూ వంటలు వండుతున్నారు. హెన్రీకి అదంతా వినోదంగానూ, ఎంతో సంతోషంగానూ అనిపించింది.

వసారాలో పెద్ద జంపఖానా, తుంగ చాపలు పరచి ఊరి పెద్ద మనుషులు కూర్చుని ఉన్నారు. హెన్రీ గంభీరంగా కూర్చుని ఉన్నాడు. ఊరి కరణం అలవాటు ప్రకారం తన లోకంలో సంచరిస్తూ తల వంచుకొని కూర్చున్నాడు. పోస్టాఫీస్ పంతులు ఒళ్ళో పసిబిడ్డతో ఆయన పక్కన ఆశీనుడయ్యాడు. మరో పక్క ఆడవాళ్ళు గుంపుగా కూర్చుని ఉన్నారు. దొరస్వామి నడుముకు అంగ వస్త్రాన్ని కట్టుకొని అతిథులకు చందనం ఇస్తూ, పన్నీరు చిలకరిస్తూ లోనికి ఆహ్వానించి మర్యాద చేస్తున్నాడు.

> బేబీ అందరినీ ఒకసారి చూసి పసిబిడ్డలా నవ్వింది. తర్వాత కాస్త పక్కకు తప్పుకొని అందరికి నమస్కరించేలా -మోకాళ్ళ మీద వంగొని భూమిపై శిరస్సు ఆనించి వెళ్ళింది

నవీనత పెద్ద దీపస్తంభాల్లో వత్తులు వెలుగుతుండగా దాన్ని బేబీ చేతికిచ్చి నట్టింట్లోకి తీసుకెళ్ళి పెట్టమంది. బేబీ దాన్ని తీసుకొచ్చి నట్టింట్లో పెట్టినపుడు ఎవరో గుంపులో నుండి, 'సాష్టాంగ పడి నమస్కరించు' అని అరవటం వినిపించింది.

దీపస్తంభాలు పెట్టి పైకి లేచిన బేబీ అక్కడ గుమిగూడి ఉన్న అందరినీ ఒకసారి చూసి పసిబిడ్డలా నవ్వింది. తర్వాత కాస్త పక్కకు తప్పుకొని- ఆ గుంపుకు నమస్కరించేలా- మోకాళ్ళ మీద వంగొని భూమిపై శిరస్సు ఆనేలా నమస్కరించి వెళ్ళింది.

నవనీత ఇంటి పొయ్యి మీద ఒక పెద్ద పాత్రలో పాలు కాస్తోంది.

ధర్మకర్త, "కుమారపురం నుండి ఎవరైనా పురోహితులను తీసుకురాకపోయారా? " అని అడిగాడు. దేవరాజులు, దొరస్వామి అందుకేదో సమాధానం చెప్పారు. "సరే! మన ఊరి పూజారి ఏమయ్యాడు? ఆయన్నైనా పిలిపించి ఏదైనా చెయ్యమనండి" అనగానే, దొర



స్వామి ఆయనను పరిహాసమాడేలా "ఇప్పుడు ఇక్కడ జరుగుతున్నది ఏమనుకుంటున్నారు" అన్నాడు.

"అది కాదయ్యా... కొత్త ఇంటికి దోషం ఉంటుందంటారు. అందుకు ఏదైనా శాంతి చెయ్యడం మన పూజారికి తెలుసు" అని ధర్మ కర్త చెప్పగానే.

"ఇదిగో అన్నీ తయారుగా ఉన్నాయండీ" అంటూ ఓ తాంబూలం తట్టతో ద్రౌపదమ్మ గుడి పూజారి అక్కడికి వచ్చాడు. ఆ తట్టలో పసుపూ, కుంకుమా పూసిన రంధ్రం చేసి ఒక తాడుకు గుచ్చిన ఒక నిమ్మకాయ ఉంది. దాన్ని హెన్రీ చేతికిచ్చి ఇంటి ద్వారబంధం పైభాగానికి కట్టమన్నాడు పూజారి. హెన్రీ అలాగే కట్టాడు.

ఉన్నట్టుండి బేబీ గుర్తొచ్చి వెనక్కు తిరిగి చూసి గుంపులో వెదికాడు హెన్రీ. ఆమె కని పించలేదు. వంట గదిలోకి వెళ్ళి చూశాడు. వెనుక వంట పనులు జరుగుతున్న చోటుకు వెళ్ళి చూశాడు. తర్వాత దేవరాజులు ఇంటికి వెళ్ళాడు. ముసలాయనను కూడా అతడింటికి తీసుకొచ్చినందువలన దేవరాజులు ఇల్లు తాళం వేసి ఉంది. ఇంటి వెనకదారి గుండా అతడు మళ్ళీ లోపలికొచ్చినపుడు కొట్టంలోని నులక మంచంపై అంతకు మునుపు ఆమె కట్టుకున్న కొత్తచీర విప్పి పారేసి ఉండటాన్ని గుర్తించాడు.

"బేబీ..." అని అరుస్తూ తెరచి ఉన్న పెరటి తలుపు గుండా అతడు బయటకు పరుగెత్తి చూసినపుడు దూరంగా పొలాల వద్ద భుజాల వరకూ పెరిగిన మొక్కజొన్న కంకుల మధ్య గట్టు మీద వెళుతున్న ఆమె జడ వీపు పైపడి ఎండలో పసిడి వన్నెతో మెరిసింది.

ఆమె పొలాల మధ్య చాలా వయ్యారంగా వెళుతోంది. హెన్రీ ఆ రోజు ఇచ్చిన తెల్లటి వస్త్రాన్ని చుట్టుకున్నట్టు అనిపిస్తోంది. ఆమెను పిలిచి ప్రయోజనం లేదని అనుకున్నాడు.

'ఈ ఇంటి తలుపులూ, పెరటి తలుపులూ ఎప్పుడూ ఆమె కోసం తెరిచే ఉంటాయి' 'ఆమె తప్పకుండా తానుగా వస్తుంది!' అనీ అనుకు న్నాడు.

అలా వెళ్ళిపోతుందని ఆమె వచ్చినరోజే అనుకున్నాడతడు. 'ఇప్పుడు ఆమె ఎందుకెళ్లి పోతోంది?' అని మదిలో కెరటంలా లేచిన ప్రశ్నకు 'అప్పుడు ఆమె ఎందుకొచ్చింది?' అన్న మరో ప్రశ్న బదులైంది.

లోపలినుండి దొరస్వామి "దొరా... దొరా..." అని హెన్రీని పిలవడం వినిపిం చింది. అతడు వెనక్కు తిరిగి చూశాడు.

ఆ ఇంట్లో మేళతాళాలతో ఓ గ్రామమే సంచరిస్తూ కనిపించింది. ✦



# ఆచ్ఛాదనల్ని తొలగించడమే రచన ప్రయోజనం



జాఁ పాల్ సార్త్ర్

"సాహిత్యం అంటే ఏమిటి? ఎవరి కోసం రాయాలి? ఎందుకు రాయాలి?" లాంటి ప్రశ్నలు ఎప్పుడో ఒకప్పుడు అందరికీ వస్తాయి. ఉద్యమాలు బలంగా ఉన్న రోజుల్లో వీటి గురించిన చర్చలు కూడా సుదీర్ఘంగా జరుగుతాయి. మన రాజకీయ, సామాజిక, తాత్విక అభిప్రాయాలు, అయిడియాలజీలు ఎలా ఉన్నా, కథకులకు వ్యక్తుల జీవితాలు, సంబంధాలు మాత్రమే ముఖ్యమన్న సత్యాన్ని విస్మరించలేం.

కథ చదవటమంటే జీవించకుండా జీవితాన్ని అనుభవించటం. కొద్ది పేజీల్లో ఎన్నో సంవత్సరాలు గడుస్తాయి, ఎందరో వ్యక్తులు తారసపడతారు, ఎన్నో సంఘటనలు జరిగిపోతాయి, ఎన్నో దేశాలు చుట్టి వస్తాం!

"ఒక రచన కళాత్మకంగా ఎంత గొప్పదైనప్పటికీ,మనిషి స్వేచ్ఛకు సహకరించనిది గొప్ప సాహిత్యం అనిపించుకోదు" అంటాడు సార్త్ర్.

మన చైతన్యస్థాయిని బట్టి జీవితాన్ని అర్థం చేసుకుని వ్యాఖ్యానిస్తాం. 'నిబద్ధత' నిజాయితీ లాంటి మాటలు ఈ సందర్భంలోనే వాడతారు.

దేనిపట్ల నిబద్ధత? సమాజంలోని దోపిడీ గురించి, తిరుగుబాట్లు గురించి రాయాలనుకోని యువరచయితలుండరు. కాని ఆ పరిస్థితుల్లో ఉన్న వ్యక్తులు, వాళ్ల జీవన పరిస్థితులు మనకు తెలుసా? తెలియని విషయాల్ని గురించి రాయటం నిజాయితీ అనిపించుకుంటుందా? మనకే సందేహాలున్నప్పుడు ఎవరి మెప్పుకోసం రాయాలి? ముసుగులు తగిలించుకుని కృతకంగా నవ్వటం ఈ లోకంలో అవసరమే. కాని ఆ కృతకత్వం రచనలో అతి సులభంగా తెలిసిపోతుంది. రాయాల్సింది సమస్యల గురించి కాదు. (అలా రాస్తే వ్యాసం అవుతుంది). సమస్యలనెదుర్కొంటున్న వ్యక్తుల గురించి. మనల్ని గురించి మనం తెలుసుకుంటే తప్ప పాత్రల ప్రవర్తనను విశ్లేషించలేం. రచన జీవితానికి అద్దం పడుతుందనుకుంటే ఆ అద్దంలో కనిపించే ప్రతిబింబాలు అందంగా ఉండవు. రచనా ప్రయోజనం ముసుగుల్ని తొలగించటమే తప్ప కప్పటం కాదు.

"పేదలు, కార్మికులు, కర్షకుల గురించి రాస్తే ప్రజాసాహిత్యమవుతుంది అంటారు

కొందరు. ఆయా వ్యక్తులు ఏమనుకుంటు న్నారో, తమ గురించి తాము రాసుకుంటే ఎలా వుంటుందో అలా రాస్తే ప్రజాసాహిత్య మవుతుంది గాని గట్టుమీద కూర్చుని, ప్రేక్షకుల్లా పరిశీలించి రాసింది ఎలా అవుతుంది? మధ్య తరగతి రచయితలు తమ అభిప్రాయాలను విలువ లను వాళ్లకు ఆపాదించి రాయటం ఆత్మద్రోహమూ, సాహిత్య ద్రోహమూ" అంటాడు చైనీస్ సాహిత్యంలో అరుణతార లూషన్. "జాన పద గీతాల వేటలో ప్రచారంలో ఉన్నవి మన మిత్రులు ఆ బాణీలో రాసిన పాటలే తప్ప నిజంగా జానప దులు పాడిన పాటలు కావు. జానపద కథలూ అంతే. మన సమాజంలో నిరక్షరా స్యులే అత్యధికం. చదవగలిగినవాళ్లలో కూడా సాహిత్యాభిలాషులెందరు? మన పాఠకులు మరీ తక్కువ. అందువల్ల సాహిత్యంలో సామాజిక పరిస్థితుల్ని మారుస్తామనుకో



జార్జ్ సిమెనా

వటం ఒక భ్రమ మాత్రమే" ఆధునిక చైనీస్ సాహిత్యం మీద లూషన్ ప్రభావం తెలిసిన వాళ్లకు ఆయన మాటలు ఆంతర్యం మరింత బాగా బోధపడుతుంది.

'రాయటమంటే సామాజిక బాధ్యత' అని అందరూ అంగీ కరిస్తారు. ఆ బాధ్యతను గుర్తె రిగిన రచయిత మొదట 'తనకు తాను జవాబుదారీ' అని గ్రహిస్తాడు.

ఇప్పటిదాకా మనం చెప్పు కున్న సీరియస్ సాహిత్యకారులే కాదు, డిటెక్టివ్ నవలల రచయి తగా ప్రసిద్ధుడైన జార్జ్ సిమెనా (Georges simenon) కూడా ఇదే సలహా ఇస్తాడు. "రచయిత తనను తాను పరిశీలించుకుం టాడు. ఆ జ్ఞానంతో ఇతర్లనూ పరిశీలిస్తాడు - ఎందుకంటే మరో మనిషీ తనలాంటి వాడే అని అతడికి తెలుసు".

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

# పరిమళ దర్పణం




"ప్రేమ ఉన్నచోట స్వేచ్ఛ ఉండాలి. అవతలి మనిషి నుంచి స్వేచ్ఛ కాదు, తననుంచే తనకు స్వేచ్ఛ అవసరం!" "పరాధీనత ప్రేమ కాదు! బాధ్యత, బరువు, ప్రేమింపబడక పోవడంలోని బాధ ఇవన్నీ ప్రేమ కాదు!" అంటారు ప్రముఖ తత్వవేత్త జిడ్డు క్రిష్ణమూర్తి, ప్రేమను గురించి విశ్లేశిస్తూ!

స్వేచ్ఛతో కూడిన ప్రేమలో స్వచ్ఛత ఉంటుంది! సమర్పణ ఉంటుంది! సంపూర్ణ నివేదన ఉంటుంది! ఈ ప్రేమలో ఎక్కడా లెక్కలు ఉండవు. నీకేం కావాలి, నేనేం తీసుకోవాలి అనే బేరాలు ఉండవు. నీకేం కావాలి, నేనెంత మిగుల్చుకోవాలి అనే స్వార్థం ఉండదు. నేను ఇచ్చేది సరే, నువ్వు తెచ్చేదేమిటన్న ఆశ ఉండదు. సంపూర్ణంగా,ఐచ్ఛికంగా, "నేను" నుంచి విడిపడి, "అహం" నుంచి విముక్తి చెందిన, స్వచ్ఛమైన ఆత్మార్పణమే "ప్రేమ"!

"ఎవర్నైనేతేనేం, తనకన్నా గొప్పగా ప్రేమించడమే ముఖ్యం!" అంటారు చలం. ఎంత గొప్ప ఉదాత్తమైన భావం! నిజం! అందులో ఎంత ఆనందం! ఏమాశించకుండా, ఒకళ్ల కోసం తపించిపోయే వ్యక్తి ప్రేమను పొందడం ఎంత అద్భుతమైన అనుభవం!

ప్రేమను నిర్వచించడం కన్నా ఆస్వాదించిన వారికే ఆ రుచి, ఆ మాధుర్యం అవగతమవుతాయి! జీవితాంతం ఆ పరిమళాలు వెన్నెంటే ఉంటాయి వసివాడకుండా!

మాతృ ప్రేమ అన్నింటికన్నా బలమైనది అంటారు. మన చిన్నతనాల్ని ఒక్కసారి తల్చుకుంటే నిజమే అనిపిస్తుంది కూడా. అమ్మ పెరట్లో- వెన్నెల్లో మిలమిల మెరిసిపోతూ, మనల్ని మరిపిస్తూ, మురిపిస్తూ, ప్రేమగా లాలిస్తూ, గోరుముద్దలు తినిపించడం ప్రతీ వ్యక్తి మనోఫలకంపైన చెరిగిపోని అందమైన మధుర స్మృతే!

ఇప్పుడూ వెన్నెల ఉంది చల్లటి గాలి, నీలాల ఆకాశం, మిలమిల మెరిసే నక్షత్రాలు అన్నీ అలాగే ఉన్నాయి కానీ మనసు లేదు, మనసు పెట్టడానికి, ప్రేమను పంచడానికి మనకి టైం లేదు. 'గోల్స్, సక్సెస్' ఈ పరుగు పందాల్లో ప్రేమ చిన్న నీటిపాయలా జాలిగా జారిపోతుంది జీవితపు వేళ్ల సందుల్లోంచి ఇసుకలాగా! సెలయేరులా స్వచ్ఛంగా ప్రవహించి, జలపాతంలా చుట్టుముట్టేసి, హోరెత్తించి, గంభీరంగా ఇముడ్చుకునే ప్రేమలోని విచ్ఛిన్న రూపాలని, ప్రేమలోని సాంద్రతని దర్శించలేకపోతున్నాం, చవిచూడలేక

పోతున్నాం.

డబ్బును ప్రపంచంగా మార్చుకుని ప్రేమని విస్మరిస్తున్నాం. 'గెలుపు' పరుగు పందెంలో మనసులో నిండుగా ఖాళీని నింపుకుంటున్నాం. డబ్బు, సక్సెస్ సౌకర్యాలనిస్తాయి. సామాన్లతో ఇంటిని నింపుతాయి. కాని మనసను ఆహ్లాదంతో నింపలేవు! ఆప్యాయతల్ని సృష్టించలేవు, అనురాగంలో ముంచెత్తలేవు. అందుకే ప్రతీ వ్యక్తి తన జీవితాన్ని ప్రేమమయం చేసుకోవాలన్న తపనలో రగిలిపోవాలి. అదే అతనిలోని శూన్యతను నింపే ఏకైక మార్గం!

జీవితాన్ని అందమైన అనుభవంలా ప్రతి సెకను గడపాలి! వెలుగునీడల జీవన పోరాటంలో ప్రేమే ఆశాదీపికగా చేసుకోవాలి! సుఖంలో, దుఃఖంలో, ఆరాటంలో, ఆవేదనలో- అన్నీ సమ్మిళితమైన జీవన రాగాలలో ప్రేమ చుక్కానిగా నడుపుకోవాలి!

ప్రేమ స్పందనలు సరిగా వినిపిస్తే, సమపాళ్లలో నిలిస్తే బతుకు సప్తవర్ణ శోభితమవుతుంది. నిత్యపరిమళమై, నవరసాలొలికిస్తూ, ఆనందపుటంచుల చేరుస్తూ, నిత్యం ప్రేమగానం ఆలాపిస్తూనే ఉంటుంది. దీన్ని అందరూ గుర్తించాల్సిన సరైన సమయమిది. ఏం కోల్పోతున్నామో మథనం చేసుకోవాల్సిన తరుణమిది.

కాని దురదృష్టవశాత్తు మానవ జీవితంలో పోస్ట్‌మార్టమ్‌లే ఎక్కువ; రిపెంటెన్సులు అంతకన్నా ఎక్కువ! ముందుగా తెలివి తక్కువగా తొందరపడి తప్పటడుగులు వేయడం, తర్వాత తీరిగ్గా పశ్చాత్తాపపడటం ప్రతీ వ్యక్తికి అనాదిగా వస్తున్న అలవాటు. కాని జీవితకాలం లేటు కాకుండా, నిండు మనసుతో క్షమాపణ కోరుకోవడం ప్రేమ వ్యక్తీకరణలోని ఒక భాగమే కాని చులకన కావటం కాదని విజ్ఞతతో ఆలోచించాలి- ముందడుగు వేయాలి!

ఎక్కడో దూరంలో మనకు ఆప్తులుంటారు, మనం ప్రాణంగా ప్రేమించే వాళ్లుంటారు. వాళ్లకేమైనా చిన్న బాధ కలిగితే, ఇక్కడ మనలో అలజడిగా ఉంటుంది. ఆందోళనగా ఉంటుంది. ఎవరు ఎంత దూరంలో ఉన్నా మనసు లోపల పొరల్లో వాళ్ల కోసం తపిస్తుంది, ప్రేమతో స్పందిస్తుంది.

ప్రేమ నిబంధనలు పెట్టదు. ఇలా ఉండాలి, ఇలా చేయాలి, ఇలా జరగాలి అంటూ శాసించదు. నిజంగా అలా శాసిస్తే అది స్వార్థపూరితమైన ప్రేమే. అందులో ఎప్పుడూ అభద్రతాభావం వెన్నంటే ఉంటుంది. మనల్ని అశాంతిపాలు చేస్తూ అందరికి దూరంగా, దిగంతాల ఆవలికి మనల్ని విసిరేస్తుంది.

నిజమైన ప్రేమలో ఐక్యత ఉంటుంది, భద్రత ఉంటుంది, నిశ్చింత ఉంటుంది. అది ఏ రూపంలోనైనా నిండు గోదారిలా స్వచ్ఛంగా పారుతుంది. భగవంతుడికి భక్తి రూపంలో, సఖుడికి సమర్పణలో, బిడ్డలకు అనురాగపు పందిరై, నెచ్చెలికి అభిమానపు తోరణమై, తల్లిదండ్రులకు గౌరవాభివందనల పూలమాలై, ఆనందపు సాగరానికి చేరుస్తుంది. గోరంత ప్రేమను మనం పంచగలిగితే కొండంత ప్రేమను, అంతులేని అభిమానాన్ని పొందుతాం. మనం పంచుకుంటూ పోతే తరగని ఏకైక ధనం "ప్రేమ"! పైగా ఇంకా వేలరెట్లుగా ఆ ప్రేమ సంపద మనల్నే వరదలా తిరిగి ముంచెత్తుతుంది.

ఇప్పటి రోజుల్లో మనం ప్రేమించేవాళ్లే ఎక్కువైపోతున్నారు గాని మనల్నెవరూ ప్రేమించడం లేదన్న భావన "న్యూక్లియర్" ఫ్యామిలీ చట్రంలో ఇరుక్కుపోయిన ప్రతీ వ్యక్తికి సహజంగా అనిపిస్తోంది. అత్త, అమ్మ, పిన్ని, బాబాయి, బావ, అక్కా, చెల్లి ఇంత మంది సంపూర్ణ ప్రేమను పోగొట్టుకుంటారు. "నేను, నా భార్య, నా పిల్లలు" అనే చిన్న చట్రంలో పడి ఇరుక్కుపోతూ ఊపిరాడక డిప్రెషన్లూ పెరుగుతున్నాయి. సమతూకం లోపించడం వల్ల అభద్రతా భావం పెరిగి, ఒకళ్ళనొకళ్లు నమ్మలేని పరిస్థితుల వలయాల్లోకి నిశ్శబ్దంగా జారిపోతున్నాం. హృదయ ద్వారాల్ని మూసేసి, ప్రేమదారులు మళ్లించి,

ఊహా నిర్మిత చిత్రాలే కాని వాస్తవ జీవన రేఖలు గుర్తించలేని గుడ్డివాళ్లమవుతున్నాం.

ఈ స్థితినుంచి ఇప్పటికయినా మారాలి. ఎదలోతుల్లో ప్రేమగానాన్ని ఎనలేని, గుర్తించ లేని పరిస్థితిని అధిగమించి తమకంటూ కొంత సమయాన్ని మిగుల్చుకొని, గాలిలో పేకమేడలు కట్టేసే జీవన విధానానికి స్వస్తి చెబుతూ, అందమైన భ్రమల నుంచి బయట పడి వాస్తవాన్ని గుర్తించాలి. మనల్ని మనం వంచించుకోవడం మాని, అందరికీ దగ్గరయ్యే ప్రేమ దారుల్ని వెతకాలి. ఎందుకంటే మనిషి ఎప్పుడూ చెడ్డవాడు కాదు. పరిస్థితుల, వాతావరణ ప్రభావం అతన్ని ప్రలోభపెట్టి వంచించి అతనిలోని ప్రేమకు సమాధి కడుతున్నాయి కాని, అతని గుండె లోతుల్లో ప్రేమ ఊట ఇంకా ఉబికి వస్తూనే ఉంది. ఎందుకంటే ప్రేమ నిత్య నూతనమైనది. ఎప్పటికీ సజీవం. అది అమరం.



"ఏదయినా విశ్వాసమనేది హృదయానిది, మనసుది కాదు. నిజమైన విశ్వాసానికి కారణం కనపడదు, ప్రేమకు మల్లెనే!" అంటారు చలం.

ఒక స్పందన! ఒక ఆనందం! ఒక స్వచ్ఛత! ఓ స్వర్గం! ఒక ఆకర్షణ! ఇలా ఎన్నెన్నో నిర్వచనాలు ప్రేమంటే! అంతే కానీ ప్రేమ = టైం + కంఫర్టు + సెక్స్ ఎంత మాత్రం కాదు. ఇది గుర్తుకు వచ్చేటప్పటికి, అనుభవంగా మారడానికి సమయం పడుతుంది. అప్పటికి పరుగుల పందెం నుంచి మనిషి విడివడి, వలయం నుంచి బయట పడతాడు! కానీ ఏం లాభం! ఆఫీసుకు వెళ్లే కొడుకు నుంచి "నాన్నా, వెళ్లొస్తాను, అమ్మా, మందులేమైనా తేవాలా?" అంటూ చిన్న చిన్న ప్రేమ పలకరింపులకు తండ్రి ఆశపడతాడు, ఆప్యాయపు మాటలకు ముఖం వాచిపోతాడు. కాని కొడుక్కి టైం ఉండొద్దూ మరి...! తామే ఆ పరుగుల వలయానికి కొడుకుని ప్రవేశపెట్టామన్న వాస్తవం తల్లితండ్రులు గుర్తించేటప్పటికి సమయం కాస్తా మించిపోతుంది. ప్రేమ పలకరింపుకై వృద్ధాప్యం తపించిపోతుంది.

'సమాజంలో అవినీతి, కుళ్లు ఉంటుంది. ప్రతీ మనిషి సమాజ స్థితిగతులను అవగాహన చేసుకుని స్వేచ్ఛగా ఆలోచిస్తూ, తనలోని ప్రేమను, మంచి తనాన్ని వికసింపజేయాలి. అందరికి పంచాలి!' అంటారు జిడ్డు క్రిష్ణమూర్తి!

ఏది ఎలా అనుకున్నా ప్రేమ ఒక అందమైన అనుభవం! ఒక ఆహ్లాదం! ఒక స్నేహపు పరిమళం! ఓ గాఢమైన అనురాగం! ఒక ధైర్యం! ఓ నిశ్చింత! ప్రేమలో "నేనున్నాను" అనే "చిన్న" మాట ఎంతో ఉద్వేగాన్ని, ఎంతో ఆనందాన్ని కలిగించి, స్ఫూర్తిని రగిలించి, అనంత సంతోష సాగరాలలో తేలించి అద్భుతాలు సృష్టించేలా చేస్తుంది. అందుకే మనలో ప్రేమలు వికసించాలి, పరిమళించాలి. లోకమంతా ప్రేమమయం చేస్తూ నిత్యం ప్రేమగానం ఆలపిస్తూ జీవితాన్ని అందమైన కావ్యంలా తీర్చిదిద్దుకోవాలి. స్వేచ్ఛగా జీవిస్తూ పదిమందికి ప్రేమను పంచుతూ ప్రేమమూర్తుల్లో ఆరని జ్యోతుల్లా ప్రేమ దీపాల్ని వెలిగించాలి. లోకమంతా ఆనందాన్ని నింపాలి!

**–కె. వాసవదత్త రమణ**

# కథ వెనుక కథ



పొత్తూరి విజయలక్ష్మి

## సగటు మహిళ జీవనచిత్రం

# అబలాయానం

**కథ వెనక కథ ఇది!**

'రచయిత్రిని అవుతానని కానీ అవ్వాలని కానీ కలలో కూడా అనుకోలేదు. అతిగారాబంగా పెరిగాను. పెద్ద చదువులేం చదవలేదు. పదిహేడేళ్లకే పెళ్లైంది. పిల్లలు పెద్దవాళ్లై స్కూలుకు వెళ్లడం, వాళ్లపనులు వాళ్లు చేసుకోవడంతో తీరిక దొరికింది. ఏదైనా చెయ్యాలన్న తపన నన్ను కలం పట్టేలా చేసింది. చెప్పానుగా హాస్యరచనలు చేయాలన్న ప్రయత్నం. ఎవరేమన్నా లెక్కచేయ

'హాస్యమంటే ప్రాణం. రాసిన వాటిలో మూడొంతులు హాస్యరచనలే. అది లేకుండా కూడా కొన్ని రాశాను. చదివినవారు రచన బావుంది.. కానీ నవ్వు రాలేదు. ఈసారి మంచి హాస్యరచన రాయండి.. అనేవారు' అంటూ నవ్వుతూ చెప్పారు పొత్తూరి విజయలక్ష్మి. ఆమె తొలి నవలే 'చతుర'లో ప్రచురితమై... ఉషాకిరణ్ బ్యానర్‌పై చిత్రంగా వచ్చి మంచి హాస్యచిత్రంగా పేరు తెచ్చుకుంది. అదే 'శ్రీవారికి ప్రేమలేఖ'.

విజయలక్ష్మి 1953లో గుంటూరు జిల్లా యాజలి అనే కుగ్రామంలో పుట్టారు. ఒక్కడే సోదరుడు. తండ్రి ఇంజినీరు. బాల్యం అపురూపంగా, అందంగా గడిచింది. వివాహానంతరం పశ్చిమ బెంగాల్ వెళ్లారు. 'ఆయన ఉద్యోగరీత్యా చాలా ఊళ్లు తిరిగాం. దాంతో నాకు ఆరుభాషలు వచ్చాయి. రకరకాల జీవితాలు చూశాను. పుస్తకాల నుంచి కాక జీవితం నుంచి నేర్చుకున్నదే ఎక్కువ. నవ్వుతూ నవ్విస్తూ ఉన్నంతలో ఆనందంగా గడపాలనేదే నా జీవితాశయం' అని చెప్పిన విజయలక్ష్మి ప్రయత్నపూర్వకంగా రచయిత్రి అయ్యారనుకోవచ్చు.

విజయలక్ష్మి దాదాపు వంద కథలు, ఇరవై నవలలు రాశారు. శ్రీవారికి ప్రేమలేఖతో పాటు మరో రెండు నవలలు సినిమాలుగా వచ్చాయి. అన్నీ ప్రేమకథలే. ప్రేమ ఎంత మధురం, ప్రేమ చిత్రం పెళ్లి విచిత్రం... మిగిలిన రెండూ. హాస్యకథల పోటీలో బహుమతులూ గెలుచుకున్నారామె. ఇటీవల ఓ టీవీ సీరియల్‌కి రచనా సహకారం అందించారు.



కుండా అలా రాసుకుంటూ పోతుండగా వచ్చిన ఆలోచన ఇది. సగటు స్త్రీల జీవితం నేపథ్యంగా ఒక నవల రాయాలని. అదే 'తర తరాల కథ'. అప్పటి చతుర సంపాదకులు చలసాని ప్రసాదరావు 'అబలాయానం'గా పేరు మార్చారు.

ముగింపు పాజిటివ్‌గా మార్చమన్నారు. మీరు మార్చమంటే మారుస్తాను కానీ ఈ నవలకు ఇదే ముగింపు అని చెప్పాను. అయినా ఆయన కోరినట్లు ఆఖరి పదిపేజీలూ మార్చి రాసి పంపాను. అవి చదివి వద్దు ముందు రాసిందే ఉంచుదాం అన్నారాయన. 'అబలా యానం' చతురలో వచ్చింది. నాకెంతో నచ్చింది...' అంటూ తన అబలాయానం గురించి చెప్పుకొచ్చారు విజయలక్ష్మి. చుట్టూ ఉన్న పరిసరాలను, వ్యక్తులను పరిశీలించాకే ఈ అంశంపై తప్పనిసరిగా రాయాలన్పించి రాశానన్నారు.




***అబలాయానం అసలు కథ ఇది!***

నిజానికిది నాలుగుతరాల మహిళల కథ. వారిలో ఎవరి జీవితమూ సుఖంగా సంతోషంగా ఉందని చెప్పలేం.. ఎవరి కష్టాలు వారివేనని ముగిస్తారు రచయిత్రి. దుర్భర దారిద్ర్యంతో బాధపడ్తున్న కుటుంబం నుంచి పద్నాలుగేళ్ల వయసులో రెండో భార్యగా సంపన్నుల ఇంట అడుగుపెడుతుంది ఒక బాలిక. అప్పటికే ఇద్దరు కొడుకులూ, ముగ్గురు కూతుళ్లే కాదు.. కోడళ్లూ, మనవలూ మనవరాళ్లూ కూడా ఉన్నారామె భర్తకు. అలా సంసార సాగరంలో ప్రవేశించింది. ఈదడమే పని. పొద్దున్న లేచిన దగ్గర్నుంచీ రాత్రి పొద్దుపోయేవరకూ ఒకటే పని. పుట్టింట్లో తిండీ ఉండేది కాదు. పనీ ఉండేది కాదు. ఇక్కడ పీకల దాకా తిండి. అస్తమానం చాకిరి. అత్తగారి అధికారం. భర్త చాటు మాటు వ్యవహారాలు. వయసుని మించిన పరిణతి వచ్చేసింది. ఇరవయ్యేళ్లకల్లా ఒక కొడుకు, ఒక కూతురికి తల్లి అయింది. భర్తృ హీన అయింది. ఆస్తుల గొడవలు అన్నీ తీరి సవతి కొడుకు అందరికన్నా పెద్దవాడు ఇంటిని సమర్థించుకు రావడం మొదలెట్టాక ఆమెను అడుగుతాడు... పుట్టింటికి వెళ్లిపోతావా పిన్నీ.. అని. వెళ్లనని అతని అండలోనే తన బిడ్డల్ని పెంచుకుంటానని చెప్తుంది. పిల్లలందరినీ బస్తీలో స్కూల్లో చేర్పించి వారికి వండిపెట్టేందుకు ఆమెను బస్తీకి పంపిస్తాడతను. పి.యు.సి పాసైన కూతురు ఈ తల్లి కళ్లకు అపురూపంగా కన్పిస్తుంది కానీ కట్టుకున్నవాడికి కోపం వస్తే దెబ్బలు తిని పడివుండే పెళ్లామే.. అత్తింటివారికి ఇంటెడు చాకిరీ చేసే మామూలు కోడలే. ఆడదాని బతుకింతేలెమ్మని కూతురికి నచ్చజెప్పి నలభై ఏళ్ల వయసులో ఉద్యోగస్థుడైన కొడుకువెంట ప్రయాణమవుతుంది. ఉద్యోగస్థురాలైన కోడలు వస్తుంది. ఇంటా బయటా కోడలు పడే అవస్థలు, అందరు పురుషుల్లాగే స్వార్థంతో ఆలోచించే కొడుకు ధోరణి ఆమెలో ఆలోచనలు రేకెత్తిస్తాయి. మనవరాలు ఆమెకు చదవడం రాయడం నేర్పుతుంది. కోడలు లైబ్రరీ నుంచి పుస్తకాలు తెచ్చిస్తుంది. ఆమె ప్రపంచం నిదానంగా విస్తృతమవుతుంది. ఈ తెలివి ఆనాడే ఉంటేనా.. అని నవ్వుకుంటుంది. మనవరాలితో స్త్రీ పురుష ఆలోచనా ధోరణుల గురించి, సమాన హక్కుల గురించి చర్చిస్తుంది. ఇంజినీరింగ్ చదివి గొప్ప ఉద్యోగం తెచ్చుకున్న మనవరాలిని ఎంత ఆరాధనాపూర్వకంగా చూస్తుందో... ప్రేమించి పెళ్లి చేసుకుని మోసపోయినందుకు అంతగానూ

సానుభూతి చూపుతుంది.

"మీ కాలంలో మొగుడంటే దేముడు. వాడికి మీరు బానిసల్లా సపర్యలు చేసేవారు. ఈరోజుల్లో మాకు మొగుడంటే ఫ్రెండ్. స్నేహంతోనే మా దాంపత్యం నడుస్తుంది..." అన్న మనవరాలి ప్రేమ వివాహాన్ని... ఆ తర్వాత జరిగే విడాకుల్ని అంగీకరించడమే కాక మునిమనవరాలి పెంపకంలో మనవరాలికి తోడుగా ఉండటానికి వెళ్తుంది.

### స్పందన ఇదీ!

ఈ కథ అంతా ప్రథమ పురుషలో సాగుతుంది. దాంతో కథానాయకురాలికి ఒక పేరంటూ ఉండదు. 'అలాంటివాళ్లు ఎందరో... వారిని దృష్టిలో పెట్టుకుని రాశాను. ఎవరికి వారు ఆ పాత్రలో తమను తాము చూసుకున్నారు. నవల చదివిన ప్రతివారూ మా అమ్మ గుర్తొచ్చింది.. అని, మా ఇంట్లో మా మేనత్త కథే ఇది.. అనీ అన్నారు. యువతరమేమో అక్షరాలా మాకథే ఆంటీ... అన్నారు. ముఖ్యంగా అత్తాకోడళ్ల పాత్రలను తీర్చిదిద్దిన వైనం అందరికీ నచ్చింది. ఎక్కడా అతిశయోక్తి లేదు. కోడల్ని కూతురిలా చూసుకుందనలేదు.. అలాగని సగటు అత్తలా ఆరళ్లు పెట్టలేదు. తరాల అంతరాల్ని చెరిపేసి కోడలి సమస్యల్ని అర్థం చేసుకుని వ్యవహరించే ఈ అత్త అభిమానుల ఆదరణ పొందింది. తరాలు మారినా.. స్త్రీ జీవితంలో మార్పు రావడం లేదు. ఒక సమస్య పరిష్కారమైందనుకుంటే మరోసమస్య కన్పిస్తుంది. అవన్నీ ఒక క్రమపద్ధతిలో ఇందులో కన్పిస్తాయి. జీవనవిధానంలో ఎన్ని మార్పులు చోటుచేసుకుంటున్నా స్త్రీమీద ఒత్తిళ్లు పెరుగుతున్నాయే కానీ తగ్గడంలేదు... అదే నేనీ నవలలో చెప్పదలచుకున్నాను.. అప్పట్లో మద్రాసులో ఎస్.యు.ఎమ్ రేడియో అని వుండేది. అందులో ధారావాహికంగా ప్రసారమైంది. ఈ నవలలో హీరోహీరోయిన్లు లేరు. మలుపులూ సస్పెన్సులూ లేవు. ఏ రసమూ లేదు. ఏమీ లేకుండా అందరికీ నచ్చిందంటే ఆనందమే కదా. అందుకే 'అబలాయానం' అంటే నాకెంతో అభిమానం. సరే.. కాకిపిల్ల కాకికి ముద్దు. మా అమ్మ చదివి ఆప్యాయంగా నా తల నిమిరింది. కన్న ప్రేమ. చదివినవారు ఎవ్వరూ నవ్వు రాలేదని కానీ ఈసారి హాస్య రచన రాయమని కానీ అనలేదు. మనసారా అభినందించారు. కాళీపట్నం రామారావుగారు అమ్మాయి మంచి కథ రాసింది... అందరూ చదవండి అని బెంగుళూరులో ఒక సభలో చెప్పారు.

మా అందరికీ ఆరాధ్య రచయిత్రి అయిన మాలతీచందూర్, ఆమె తల్లి ఈ నవల చదివి చాలా బావుంది.. ఇటువంటివి మరికొన్ని రాయాలి అని అభినందించారు. చాలా బాగా రాశావన్నారు జలంధర. ఇవన్నీ నాకు లభించిన ప్రశంసాపత్రాలే... అంటూ అబలాయానం కథ వెనక కథంతా వివరించారు పొత్తూరి విజయలక్ష్మి.

సేకరణ : పద్మశ్రీ యలమంచిలి

---

**చతుర సమీక్ష** | **అక్టోబర్ 'చతుర' నవల అనుబంధాలు**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ____________________

____________________

చిరునామా: ____________________

____________________

____________________




ఫ్లాష్‌బ్యాక్

# కొత్త మలుపు

డి.కామేశ్వరి

సంపుటి : 2 సంచిక : 9 అక్టోబర్ 1979

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1979వ సంవత్సరం అక్టోబరు నెల **'చతుర'** లో ప్రచురించిన డి. కామేశ్వరి నవల **'కొత్త మలుపు'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

నవయవ్వనంలో అడుగిడిన యువతీ యువకులు ప్రేమలో పడితే వారికి లోకమంతా మనోహరంగా, రంగులమయంగా కన్పిస్తుంది. వారి ఉత్సాహానికి ఎల్లలుండవు. అలాంటి దశలో అబ్బాయీ, అమ్మాయీ కలిసి చేసిన తప్పుకు అమ్మాయి మాత్రమే శిక్షననుభవిస్తుంది. ఎందుకీ వివక్ష? ఎన్నేళ్ళీ అన్యాయం? అబ్బాయి కూడా వాటా పంచుకోవలసిందేనంటూ ఓ నవయువతి తల్లిదండ్రుల్నీ, సమాజ నీతిసూత్రాల్నీ ధిక్కరించి పాత విలువల్ని కాలదన్ని జీవితన్యాయాన్ని ఓ కొత్త మలుపులోకి మళ్ళించేందుకు వింత సాహసానికి పూనుకుంది. సాంఘిక న్యాయాన్ని కొత్త దృక్కోణం నుండి పరిశీలించి మరీ కొత్త బాటలు వేయాల్సిన అవసరాన్ని ఈ నవలలో అద్భుతంగా చర్చించారు రచయిత్రి డి. కామేశ్వరి.

***ఇక కథాంశంలోకి వస్తే...*** బి.ఏ. చదువుతున్న రూప పరీక్షలు ముగిశాయి. ఇంట్లో ఖాళీగా ఉండటంతో ఏమీ తోచటం లేదని ఓ గంటసేపు టైపు నేర్చుకుంటానని టైపు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్తుంది. కాలేజీలో తనకు సీనియర్ అయిన సురేశ్ కన్పిస్తాడు. పలకరించుకుంటారు. ఆ పలకరింపు, పరిచయం, స్నేహం రోజురోజుకీ పెరిగి ప్రేమదాకా వెళ్తుంది. ప్రతిరోజూ టైపునుండి ఏ ట్యాంక్‌బండ్ మీదకో, పబ్లిక్‌గార్డెన్‌కో వెళ్లి సరదాగా కబుర్లతో కాలక్షేపం చేసి ఇళ్లకు చేరుకుంటూ ఉంటారు. సురేశ్ బలవంతంపై ఐదారుసార్లు హోటల్ గదిలోనూ గడుపుతారు. ఈ విషయం రూప తండ్రికి విశ్వనాథానికి తెలిసి ఇంటికి వచ్చాక కూతురిని కోప్పడతాడు, కొడతాడు. తల్లి పద్మావతి కూతురిని వెనకేసుకొచ్చి తను ఆరా తీస్తానంటుంది. కూతురిని మందలించి ఆ కుర్రాడు ఎవరో ఏమిటో అడిగి, పెళ్లి చేసుకుంటాడేమో కనుక్కోమంటుంది. మర్నాడు గర్భవతినని రూపకూ నిర్ధారణ కావటంతో ఆనాటి సాయంత్రం కంగారుగా సురేశ్‌తో "పెళ్లి ఎప్పుడు చేసుకుందాం సురేష్! నేను నెల తప్పాను. మన విషయం మా ఇంట్లో తెలిసిపోయింది..." అంటుంది.

"నాకింకా చదువే పూర్తి కాలేదు. ఉద్యోగం

లేదు. మా అన్నయ్యకే పెళ్లి కాలేదు. నేనెలా పెళ్లి చేసుకుంటాను? ఉద్యోగం వచ్చినా మరో ఐదారేళ్లవరకు పెళ్లి చేసుకోను. నా వల్లనే ఈ గర్భం వచ్చిందన్న నమ్మకమేమిటి? ఏదో సర దాగా తిరిగినంత మాత్రాన పెళ్ళాడాలా? నువ్వు మరెవర్నినైనా చేసుకుని జీవితంలో స్థిర పడు. నీకు అబార్షన్ చేయించడానికి కూడా ప్రస్తుతం నా దగ్గర డబ్బు లేదు"అంటాడు సు రేశ్. "ఇదన్యాయం"అని ఆక్రోశిస్తుంది రూప. "రూపా! ఒక సంగతి చెప్పు! నిన్ను పెళ్ళి చేసు కుంటానని ప్రామిస్ చేశానా? నీవు ఎంకరేజ్ చేయకపోతే నేనెలా నీతో ఇంత చనువు తీసు కునేవాడిని? ఆడదానికి ఇష్టం లేకుంటే మగా డు ముందుకు వెళ్ళగలడా? " అంటాడు మళ్ళీ తనే. రూప హతాశురాలవుతుంది.

"నీ కోసం ఐదేళ్లు అగుతాను. ఈలోగా ఎం.ఏ. చదువుతాను. నీకు ఉద్యోగం రాగానే పెళ్లి చేసుకుందాం" అని ఆశగా బతిమాలు తుంది.

ససేమిరా వీల్లేదంటాడు సురేశ్. "సురేశ్! ఈ గేమ్ మీ మగాళ్లకు అలవాటే. ప్రేమిం చటం, మోసగింపబడటం ఆడపిల్లల బలహీ నతే. ఇన్నాళ్ళూ తిరిగి, నన్ను వాడుకుని కూల్‌గా పెళ్లి చేసుకోను పో అంటే ఏడుస్తూ నుయ్యో గొయ్యో చూసుకోవడమో, అమ్మా నాన్న తెచ్చిన వాడిని పెళ్ళాడటమో చేసే దద్ద మ్మను కాను. ఎలా చేసుకోవో చూస్తాను. అంతా నీ ఇష్టమే కాదు. నలుగురిలో నిలబెట్టి అంతా చెబుతా..." అంటుంది రూప. "నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో" అని వెళ్లిపోతాడు సురేశ్. నిరాశగా వెనుదిరిగి ఇల్లు చేరిన కూతురి ముఖం చూడగానే తల్లికి అర్థమైపో తుంది. తండ్రి చెడామడా తిడతాడు.

మర్నాడు రూప లాయర్ సుమతిని కలు సుకుంటుంది. తనకు జరిగిన అన్యాయాన్ని ఆమెకు చెప్పుకుని, "వాడు నాకు భర్త కాకపో యినా నా బిడ్డకు తండ్రని లోకానికి తెలి యాలి. పెళ్లి కాకుండా బిడ్డని కనడంలో ఓ స్త్రీ తప్పు ఎంత ఉందో, దానికి ఆమె బాధ్యత ఎంత ఉందో పురుషుడిదీ అంతే బాధ్యత ఉన్నప్పుడు ఆ పురుషుడు తప్పించుకుని ఎందుకు వెళ్ళాలనే విషయంలో నాకు న్యాయం కావాలి. బిడ్డను కన్నతల్లికి ఆ బిడ్డ మీద ఉండే మమతానురాగాలు ఒక్కటేనని అలాంటి బిడ్డను ఆమె పెంచుకునే హక్కు



కోసం నేను ఈ లోకంతో పోరాడతాను. మా అమ్మా నాన్నలు చెప్పినట్లు అబార్షన్ చేయిం చుకుని ఈ బిడ్డను చంపుకోవాలని నాకు లే దు. కంటాను. పెంచుకుంటాను" అంటుంది.

లాయర్ సుమతి రూపను ఓదారుస్తుంది. రూప తరపున తను వాదించి న్యాయాన్ని నిలబెడ్తానని మాటిస్తుంది. మానవ ప్రయ త్నంగా రూపను సురేశ్ తల్లితండ్రుల దగ్గరికి వెళ్ళి విషయం చెప్పి పెళ్లి జరిపించమని కోర మని చెప్పి పంపిస్తుంది. సురేశ్ తండ్రి లా యర్ రామనాథం కోర్టులో సుమతికి ప్రత్యర్థి. సుమతి సలహామేరకు రూప రామనాథం ఇంటికి వెళ్లి సురేశ్‌కూ తనకూ మధ్య జరిగిన ప్రేమ వ్యవహారం వివరించి తమ పెళ్లి జరి పించమంటుంది. రామనాథం ససేమిరా అంగీ కరించడు. పైగా కొడుకును సమర్థిస్తాడు. దాంతో సుమతి సురేశ్‌కు నోటీసు పంపిస్తుం ది. కేసు కోర్టుకు వెళ్తుంది. సుమతి సమర్థ వంతంగా వాదిస్తుంది. టైపు ఇన్‌స్టిట్యూట్ యజమానినీ, అక్కడ అక్కడ వీరి ప్రేమ కలాపాలను చూసిన ఇతర సాక్షులనూ, హోటల్ సర్వర్లనూ, పార్కు వాచ్‌మెన్‌నూ పిలిపించి సాక్ష్యం చెప్పిస్తుంది. వాళ్ళంతా సురేశ్, రూపల ప్రేమ వ్యవహారం గూర్చి

సాక్ష్యం చెబుతారు. రామనాథం మొండిగా వాదిస్తాడు. "ఇద్దరూ ప్రేమ కలాపాలలో పాలు పంచుకున్నా ఆ స్త్రీని వివాహమాడడానికి మరో పురుషుడు ముందుకు రాడు. పురుషుడు మహారాజులాగా మరో పెళ్లి చేసుకుంటాడు. ఖర్మ కాలి ఆ స్త్రీ సంతానవతి అయితే ఆమె భవిష్యత్తుకి దారి పూర్తిగా మూసుకుపోతుంది. ఆ సంతానం అక్రమ సంతానంగా పరిగణింపబడి సమాజంలో స్థానం కోల్పోతుంది. అక్రమ సంతానం పొందడం తప్పని అలాంటి స్త్రీని శిక్షించినప్పుడు ఆ సంతానం పొందడానికి కారణమైన పురుషుడు ఎందుకు శిక్షార్హుడు కాదు?

దొంగతనం నేరం, హత్య శిక్షార్హం, ఫోర్జరీ నేరం, వ్యభిచారం నేరం, మరొకరి భార్యతో పొందు నేరం... ఇవన్నీ నేరాలై శిక్షార్హమైనప్పుడు ఒక స్త్రీని వివాహమాడకుండా సంతానవతిని చేయడమూ నేరమని అలాంటి అక్రమ సంతానాన్ని కలిగించిన పురుషుడిని ఎందుకు శిక్షించదు మన సమాజం? " అని వాదిస్తుంది. అంతే కాదు. ఒక పురుషుని చేత మోసగింపబడి, ఈ సమాజం కట్టుబాట్లకు లోబడి అసహాయురాలైన ఒక తల్లి తన బిడ్డను శరణాలయం పాలు చేసిన ఓ అమ్మాయిని కోర్టులో ప్రవేశపెడుతుంది. ఆ అమ్మాయి తనకూ, లాయర్ రామనాథంకూ కలిగిన సంతానమనీ, తనతో ప్రణయం సాగించిన రామనాథానికి అంతకుముందే పెళ్ళై ఇద్దరు పిల్లలున్నారనీ, ఆ విషయం తనకు తరువాత తెలిసిందనీ చెబుతుంది. ఈనాడు రూపకున్న ధైర్యం తనకు ఆనాడు లేకపోయిందనీ, ఫలితంగా తన బిడ్డ అనాథగా తిరస్కారాల మధ్య, హేళనల మధ్య జీవచ్ఛవంలా పదిహేనేళ్ళపాటు గడిపిందనీ,అలాంటి దుస్థితి రూప బిడ్డకు రాకూడదనీ వాదిస్తుంది. రామనాథం తలెత్తుకోలేకపోతాడు. చివరగా ప్రతివాది సురేశ్ చేత మోసగించబడినా రూపకు న్యాయం జరగాలనీ, ఆమెకు పుట్టిన బిడ్డకు సమాజంలో స్థానం ఉండేలా న్యాయం చేకూర్చమని కోర్టు వారిని అభ్యర్థిస్తుంది లాయర్ సుమతి.

"సురేశ్ రూపను నెలరోజుల లోపల వివాహం ఆడాలి. వివాహం చేసుకోని పక్షంలో అతడు ఆరునెలల జైలు శిక్ష అనుభవించాలి' అని జడ్జీ తీర్పు చెబుతాడు.

సురేశ్ జైలు శిక్షే ఎంచుకుంటాడు. రూపను సుమతి నెల్లూరులో డాక్టరుగా ఉన్న తన చెల్లెలు దగ్గరికి పంపిస్తుంది. అక్కడామె ఓ నర్సింగ్ హోం నిర్వహిస్తుంటుంది. కొన్నాళ్ళకు రూప మగబిడ్డను ప్రసవిస్తుంది. మరొక ఊళ్ళోని స్కూల్లో టీచరుగా చేరుతుంది రూప. కొడుకును తీసుకుని ఆ ఊరిలో స్థిరపడుతుంది.

అలా పదేళ్ళు గడిచిపోతాయి. సురేశ్ ఓ కలెక్టర్‌ను పెళ్ళాడతాడు. రూప పనిచేసే స్కూల్లోనే చదువుకుంటున్న రూప కొడుకు సుమిత్ అత్యంత తెలివైన కుర్రాడు. ఆ స్కూల్లో బహుమతులన్నీ అతడికే వస్తాయి. ఆ స్కూల్లో ఫంక్షన్‌కు ముఖ్యఅతిథిగా కలెక్టర్‌నీ, ఆమె భర్తనూ ఆహ్వానిస్తారు. అనుకోకుండా సురేశ్ దంపతుల్ని చూసిన రూప "అదిగో నీ తండ్రి ఆయనే" అని సురేశ్‌ను కొడుకుకు చూపిస్తుంది. కలెక్టర్ అనుపమ ఆశ్చర్యపోతుంది. రూప వెంటే ఆమె ఇంటికి వెళ్లి జరిగిన విషయం ఏమిటని అడుగుతుంది. జరిగిన కథంతా చెబుతుంది రూప. తమ ఇంటికి వెళ్ళాక భర్తను నిలదీస్తుంది అనుపమ. రూపకు అన్యాయం చేసినా కనీసం సుమిత్‌కైనా న్యాయం చేయమంటుంది. తండ్రిగా ప్రేమనందించి, బాధ్యతలు పంచుకుని, ఆస్తిలో వాడికి వాటా ఇమ్మంటుంది. ముందు కాదన్నా తర్వాత అంగీకరిస్తాడు సురేశ్. కొడుకును చేరదీసి రూపను క్షమాపణ వేడుకుంటాడు. రూపకు చేసిన అన్యాయమే తమకు శాపమై అవిటి కూతురి రూపంలో బాధిస్తోందని వాపోయిన అనుపమ పిల్లలిద్దర్నీ సఖ్యతగా ఉండమని హితబోధ చేస్తుంది.

ఆద్యంతం ఆలోచింపచేస్తూ సాగిన ఈ నవల 'చలన చిత్రం'గానూ రావటం విశేషం. ✦

# స్థానం

ఆఫీసు నుండి వస్తుంటే రోడ్డు పక్కన వేగుతున్న మిరపకాయ బజ్జీలు కంటబడ్డాయి. వాటిని చూడగానే ఓ పట్టు పట్టాలనిపించింది. వెంటనే జేబులోంచి డబ్బులు తీసి "పది రూపాయల బజ్జీలు కట్టు" అన్నాను.



## దూరి వెంకటరావు

బజ్జీలు కట్టేందుకు కాగితం తీశాడు బజ్జీల వాడు.

అది చూసి ఉలిక్కిపడ్డాను.

చివుక్కుమన్నది నా ప్రాణం.

అది నా కథల సంపుటిలోని కాగితం.

నా దృష్టి బుట్టలో ఉన్న చిత్తు కాగితాల మీదకు మళ్లింది. అందులో నా కథా సంకలనం కుక్కలు చించిన విస్తరిలా ఉంది. మరి నాకు బజ్జీలు తినబుద్ధి కాలేదు. 'ఇప్పుడొద్దులే' అంటూ ముందుకు సాగిపోయాను.

నేను ఇప్పుడిప్పుడే వర్ధమాన రచయితగా ఎదుగుతున్నాను. వివిధ పత్రికల్లో పాతిక, ముప్పై కథలు పడ్డాయి. నా అభ్యర్థన మేరకు ఓ పబ్లిషరు నా కథల్ని ఒక సంపుటిగా వెలువరించి ప్రతిఫలంగా ఓ అరడజను కాంప్లిమెంటరీ కాపీలు, కొద్దిగా నగదు ఇచ్చాడు.

నా కోసం రెండు పుస్తకాలు అట్టే పెట్టుకుని తతిమ్మా నాలుగు కాపీల్ని ప్రముఖులకు ఇవ్వాలని నిర్ణయించుకున్నాను. ఒక పుస్తకం మా ఆఫీసరుగారికిస్తూ "ఇది నా కథల సంపుటి. ముందుగా మీకిద్దామని తెచ్చాను" అన్నానెంతో నమ్రతగా.

"అలాగా, వెరీ గుడ్" అంటూ పుచ్చుకున్న పుస్తకాన్ని తెరవనైనా తెరవకుండా బల్లమీద పెట్టాడు.

"మీరు నా కథలు చదివి ఎలా ఉన్నాయో

చెప్పాలి సార్"

నా అభ్యర్థనకు "అలాగే లేవోయ్" అన్నాడు.

బాస్ నా రచనల్ని చదివి నన్ను అభినందిస్తాడేమోనని ఎదురు చూశాను. అయితే అలాంటిదేదీ జరగలేదు.

ఇలా ఉండగా చిన్నప్పటి నా క్లాస్‌మేట్ సత్యం ఆ పుస్తకాన్ని ఎక్కడ చూశాడో ఏమిటో తనకో కాపీ ఇమ్మన్నాడు. వాడు డిగ్రీ పూర్తి చేయకపోవడం వల్ల మంచి ఉద్యోగమేదీ రాలేదు. బతుకుతెరువు కోసం ఓ ప్రైవేటు స్కూల్లో టీచరుగా చేరాడు. అటువంటి వాడికి నా పుస్తకాన్ని ఇవ్వాలనిపించక "నా వద్ద ఉన్నవే నాలుగు. కావాలంటే షాపులో కొనుక్కో" అన్నాను.

"పుస్తకం కొని చదివే స్తోమత నాకు లేదు. నీ కథలు చదవాలన్న అభిలాషతో అడిగాను. ఉంటే ఓ పుస్తకం ఇవ్వు. చదివి మళ్లీ భద్రంగా ఇచ్చేస్తాను" అన్నాడు సత్యం.

మరి వాడి మాట కాదనలేక ఉన్న వాటిల్లోనే ఓ పుస్తకం తీసి వాడికిచ్చాను. మళ్లీ తిరిగి ఇవ్వనక్కర్లేదంటూ.

తెగ సంబరపడి పోయాడు సత్యం.

కళ్ళతోనే కృతజ్ఞతలు చెప్పాడు.

ఆ రకంగా నా చేతుల్లోంచి వెళ్లిన రెండు పుస్తకాలలో ఒక పుస్తకం ఇలా ఛిన్నాభిన్నమై బజ్జీలు కట్టుకోడానికి ఉపకరించినందుకు నాకెంతో బాధనిపించింది.

ఈ పని ఎవరు చేశారో తెలుసుకోవడం కోసం ముందుగా సత్యం ఇంటికెళ్లాను.

"అబ్బాయి స్నానం చేస్తున్నాడు" అంది వాళ్లమ్మ.

సరేనని పరిసరాలు చూస్తూ కూర్చున్నాను.

ఇల్లు చిన్నదైనా చూడముచ్చటగా ఉంది. అద్దాల అలమారాలో రకరకాల పుస్తకాలు దర్శనమిస్తున్నాయి. వాటిని చూడగానే సత్యానికి సాహిత్యాభిరుచి ఎక్కువే



అనిపించింది. మెల్లగా లేచి అలమారా వద్ద కెళ్లాను. అందులో ప్రఖ్యాత కథా రచయితల పుస్తకాలెన్నో ఉన్నాయి. అవన్నీ ఎక్కడ నుంచి సేకరించాడో తెలీదు. లైబ్రరీ బాగానే తయారుచేశాడు. ఉన్నట్లుండి వాటిలో నా కథల సంపుటి ఉండటం గమనించి ఉప్పొంగిపోయాను. ప్రముఖుల పుస్తకాల సరసన నా పుస్తకం ప్రతిష్ఠించబడి ఉండటం నాకెంతో సంతోషాన్నిచ్చింది. సత్యం ఆ పుస్తకం చదివాడో మానాడో గాని దానిని ఉన్నతమైన స్థానంలో ఉంచినందుకు వాణ్ణి లోలోపలే అభినందించాను. పుస్తకం ఎవరు రాసిందైనా దానిని గ్రహించిన చేతుల మీదనే దాని స్థానం ఆధారపడి ఉంటుందనిపించింది.

బాస్ చదువుకున్నాడు. అయితే మాత్రం సాహిత్యాభిమానం లేని మూర్ఖుడు. ఇది వాడి పనే. అటువంటి వాడికి పుస్తకం ఎందుకిచ్చానా అని బాధపడ్డాను.

ఇంతలో సత్యం వచ్చాడు. హఠాత్తుగా నేనెందుకు వచ్చానో తెలియక వాడు విషయం ఏమిటన్నట్లు నా వంక చూశాడు.

నేను లేచి ఆప్యాయంగా వాటేసుకున్నాను.

ఎందుకో అర్థం గాక వాడు మరింతగా తెల్లబోయాడు. ✦






## మానవ సంబంధాల ఆర్థిక కోణం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అన్న సూక్తిని గుర్తుకు తెచ్చిందీ నవల. నిరాశలో, నిర్వేదంలో తీసుకున్న నిర్ణయమైనప్పటికీ యామిని ఆత్మలా నటించిన అరవింద ఒక మానవతావాది కలల్ని పూర్తి చేయడానికీ, ఒక వైద్య నిపుణునిలో పునరుత్తేజాన్ని నింపి, ఆ వైద్యుని సేవల్ని సమాజానికి అందేలా చేయడంలోనూ సఫలీకృతం కాగలిగింది.

నవలలో యామిని సంపన్నవర్గానికి చెందిన ఒక మానవతా మూర్తి. తన వర్గ స్వభావానికి విరుద్ధంగా పేద, సాదలకూ తోటివారికీ సాధ్యమైనంత సహాయం చేస్తుంటుంది. విధివశాత్తూ జరిగిన ఆమె ఆకస్మిక మరణం 'డబ్బు' చుట్టూ అల్లుకున్న బంధువుల స్వార్థ స్వరూపాలను బహిర్గతం చేసింది. అనుకోకుండా యామిని తల్లిదండ్రుల్ని కలిసిన అరవింద ప్రతిపాదించిన నిర్ణయం శరశ్చంద్ర జీవితంలో వెలుగులు నింపి, యామిని ఆశల్ని ఆచరణ సాధ్యం చేసి తన స్వకుటుంబానికీ మేలు చేసుకుని పరస్పర ప్రయోజనాలను సాధించింది. నవలలో సస్పెన్స్, ప్రేమ వంటివన్నీ సమపాళ్ళలో కనిపిస్తాయి. మరణించిన తర్వాత 'ఆత్మ' ఉనికి, మెంట్రిలాక్విజమ్ వంటి ఆసక్తికరమైన అంశాలు అదనపు హంగులు. కానీ కథలో 'వంశీ' నిజాయితీని తరచి చూసేందుకు అరవింద ఏమాత్రం ప్రయత్నించకుండానే అతని వ్యక్తిత్వం గూర్చి భానురేఖతో కామెంట్ చేసిన సందర్భం అనుచితంగా అనిపించింది. ఇది మినహా నవలలోని అంశాలు, పాత్రల తీరు చదువరులను ఆమూలాగ్రం ఆకట్టుకున్నాయి.

డా॥ ఎ. విజయలక్ష్మి, మధిర.

## ఓ కంట కన్నీరు! మరోకంట పన్నీరు!! *(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'అసలు ఆత్మలనేవి ఉంటాయా? ఉంటే చనిపోయిన తర్వాత తమ కోరికలు తీరక వేరొకరి దేహంలో ప్రవేశించి చనిపోయిన వ్యక్తిలా ప్రవర్తిస్తాయా?' అన్నదొక సందేహమైతే, 'తను బాగా అభిమానించే లేదా పరిచయమున్న వ్యక్తులుగానీ, స్నేహితులు, బంధువులు, కుటుంబ సభ్యుల్లో ఎవరైనా హఠాత్తుగా చనిపోతే బాగా అప్‌సెట్ అయి ఆ చనిపోయిన వ్యక్తిలా ప్రదర్శిస్తూ మెంటల్ డిజార్డర్‌కు లోనవుతారా?' అనేది ఇంకొక సందేహం. ఈ రెండు సందేహాల మధ్య ఓ వైపు ఫ్యామిలీ సెంటిమెంట్,మరో వైపు ప్రియురాలి కోసం ప్రియుడి ఇంటరాగేషన్ కలగలిపి వీటికి తోడుగా సస్పెన్స్‌ను జోడిస్తూ, ఒకే వూపుతో ఆసాంతం చదివేలా ఉత్కంఠను, ఉత్సుకతను కలుగజేసింది కోలపల్లి ఈశ్వర్‌గారి 'అరవింద' నవల.

నవలలోని ముఖ్యపాత్ర అరవింద తన కుటుంబ పరిస్థితిని తెలుసుకుని పోషణభారాన్ని నెత్తిన వేసుకుంటుంది. పర్యవసానంగా ఎంతగానో ప్రేమించిన వ్యక్తికే దూరమవుతుంది. అనుకోని సంఘటనగా యామిని హాండ్‌బ్యాగ్, అందులో ఆమె రాసుకున్న డైరీ అరవిందకు దొరకడం, స్నేహితురాలి ద్వారా

డైరీని అరవింద చదవడం, ప్రాణంగా ప్రేమించిన వ్యక్తి పరాయిదేశం వెళ్లిపోవడం లాంటి సంఘటనలు ఆమెలో ఒక రకమైన నిరాశా నిస్పృహలు నింపుతాయి. అయితే అరవింద యామినిలా మారి పరాయి వ్యక్తికి భార్యగా ఎందుకు చలామణి అయ్యింది అన్నదే సస్పెన్స్. ఈ సస్పెన్స్‌ని చివరిదాకా చిక్కుముడిగానే ఉంచడంలో రచయిత కృతకృత్యులయ్యారు. ఒకవైపు తన కుటుంబానికి ఆలంబనగా, మరోవైపు ఆస్తికోసం బంధువులే రాబందులుగా ఇంట్లో చేరి మనశ్శాంతి లేకుండా చేస్తున్న యామిని భర్త శరశ్చంద్ర దగ్గర చేరి తనే యామినిలా అతనిని మరలా మనిషిని చేసిన అరవింద తన నూరేళ్ళ జీవితాన్నే పణంగా పెట్టడం నిజంగా హర్షణీయం. అయితే ప్రాణంగా ప్రేమించిన ప్రియుణ్ణి దూరం చేసుకోవడం ఓ కంట పన్నీరు, ఓ కంట కన్నీరులా అనిపించింది. అనుకోని సంఘటనలు, ఆసక్తికరమైన అంశాలతో నవల సుఖాంతమయింది.

–వి.వి. రమణ, గొల్లలవలస.

## అరవిరిసిన అరవిందం (మూడవ బహుమతి రూ. 50/– పొందిన నవల)

ఏ రచనకైనా ముందుగా కావలసింది చదివించే లక్షణం. కథ శైలి, శిల్పం యివన్నీ సమపాళ్ళలో ఉంటే ఆ లక్షణం తప్పకుండా ఆ రచనలో కనపడుతుంది. ఆ లక్షణం పుష్కలంగా ఉన్న రచన 'అరవింద'. అరవిరిసిన అరవిందంలా అందంగా ఆయా లక్షణాలను వెదజల్లుకుంటూ సాగిపోయింది. కథ నడిపించిన తీరు, మలచిన మలుపులు సన్నివేశయుక్తంగా సాగిపోయాయి. యామిని ఆత్మ అరవిందలో ప్రవేశించడం... అంటుంటే యిదేదో మానసిక వ్యాధిగా చివరికి నిరూపితమయ్యే కథలా వుందే అని పాఠకుడు ఊహిస్తాడు. చివరికి అతని ఊహ తప్పు అయ్యేలా... అరవిందది నాటకంగా మలచడం బాగుంది. అయితే కథ... సినిమా కథలా మారిపోయింది.

తన బాధ్యతను మరొకరితో పంచుకోలేనంటూ, తన కుటుంబ సభ్యులకోసం ప్రేమించిన వంశీనే కాదనుకొన్న కథానాయిక అరవిందకు ఆపాటి వ్యక్తిత్వం ఉండడం అవసరమే అన్పిస్తుంది. తాళి కట్టించుకొని శారీరకంగానూ దగ్గరయ్యే అవకాశాన్ని అరవింద కల్పిస్తున్నా చెక్కు చెదరని మానసికస్థితిని ప్రదర్శించిన సౌశీల్యుడు శరశ్చంద్ర. అందుకే 'అరవింద' నవలకు అసలైన కథానాయకుడయ్యాడు. ఇక వంశీ విషయానికొస్తే స్వచ్ఛమైన ప్రేమతో ప్రియురాలినే కాకుండా, ప్రియురాలి బాధ్యతల్నీ తన జీవితంలోకి ఆహ్వానించగలిగిన వ్యక్తిత్వం అతనిది. చివరికి ఆమెను పొందగలిగాడు. శరశ్చంద్రను పోలీసులకు పట్టిద్దామన్న వంశీతో 'వద్ద'న్న తులసమ్మ సాధారణ మధ్యతరగతి మాతృమూర్తిలానే ప్రవర్తించింది. అందుకామెను తప్పుపట్టలేం. తన కూతురు ఆస్తిపాస్తులు అల్లుడు తమకు దూరం అయిపోవడం భరించలేని యామిని తల్లిదండ్రులు అరవింద నాటకాన్ని సమర్థించడం సమంజసం కాదు. తాము కోల్పోయిన కూతురు వంటి మరో ఆడబిడ్డ జీవితాన్ని కష్టాల్లోకి నెడుతున్న భావన వాళ్లకి లేకపోవడం శోచనీయం.

– వి.యస్.ఎన్. మూర్తి, తణుకు.

## ఇలాంటివి జరుగుతాయా? (నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

ఫాంటసీ, ఫిక్షన్స్ వగైరాలన్నీ నవలకి ఎప్పట్నించో కథా వస్తువులు. ప్రేతాత్మ పరకాయ ప్రవేశం వంటివి కూడా ఆ కోవకే చెందుతాయి. వీటికి 'వెంట్రిలాక్విజమ్' ఒకరి దేహంలో చనిపోయిన ఇంకొకరి స్పిరిట్ మాట్లాడటం మేళవించిన నవల అరవింద.

అరవింద, వంశీలు అసలుసిసలైన ప్రేమికులు. కానీ, అరవింద కుటుంబ పరిస్థితి ఆమె ప్రేమబాటకి అడ్డు. కుటుంబం కోసం, ఆమె తన ప్రేమని పక్కన పెట్టి కుటుంబ పోషణలో లీనమవుతుంది. అయితే లీలావతిలో ఆత్మపూనడం అరవిందకి ఒక 'ఫ్లాష్ ప్లాట్'గ సమకూడుతుంది. పోగొట్టుకున్న వస్తువుని అప్పజెప్పడానికి వెళ్లినప్పుడు అవకాశాన్ని వినియోగించుకుంటుంది అరవింద. యామిని తల్లిదండ్రుల అండ ఎలాగూ ఉంది. అమలుపర్చి, తన కుటుంబాన్ని ఆదుకోవడమే కాక, తన ప్రేమను, వంశీని దక్కించుకుంది. వంశీ, భానురేఖ, శరత్చంద్ర పాత్రలు చక్కగా పోషించబడ్డాయి. ఇందులో తప్పక ఏదో ఒక 'మెలిక' ఉంది అన్న నమ్మకంతో వంశీ చివర వరకూ శోధించి సాధించాడు.

నవల ఆద్యంతం ఉత్కంఠభరితంగా నడిచింది. యామిని తల్లిదండ్రుల ప్రమేయం ఉందన్న విషయం పాఠకులు అసలు ఊహించలేరు. అరవింద నిజంగా త్యాగశీలా'? ఈ ఇరవై ఒకటవ శతాబ్దిలో ఇలాంటి సంఘటనలు జరుగుతాయి అంటే సందేహించాల్సిందే. పూర్తిగా నవలను చదివిన పాఠకులు చివరకు నిరుత్సాహపడక తప్పదు!

*—వి. లలితాంబ, పర్లాకిమిడి (ఒరిస్సా)*

## సస్పెన్స్ బాగుంది (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

ఆగస్టు చతురలో ప్రచురించిన 'ఈశ్వర్' నవల 'అరవింద' ఆసాంతం ఉత్కంఠభరితంగా చదివించింది.

ఈ కాలంలో బాధ్యత వహించాల్సిన బిడ్డలే తమ స్వార్థం చూసుకొని వెళ్ళిపోతున్నారు. కాని అరవింద లాంటి కూతురు తన వాళ్ళ కోసం తన జీవితాన్ని, ప్రేమని త్యాగం చేయాలనుకొంది. తనవాళ్ళ బాగు కోసం యామిని ఆత్మ ఆవహించినట్లు నటించింది. మధ్యతరగతి కుటుంబాల్లో ఇలాంటివి ఏదో రూపంలో జరుగుతూనే ఉంటాయి. వసంత, శ్రీదేవి, శీను తమ అక్క అలా మారిపోయినందుకు బాధపడుతు మళ్ళీ మామూలుగా అయితే బాగుండును అనుకోవటం వంటి సన్నివేశాలు మధ్యతరగతి ప్రేమనూబంధాల గురించి చెప్పకనే చెబుతున్నాయి.

వంశీ ఓసారి అరవింద ప్రవర్తన నిజమనిపించేటట్లు భ్రమపడటంతో నవలలోని 'సస్పెన్స్' బాగుందనిపించింది. అరవింద తనలో తాను కుమిలిపోతూ తన వాళ్ళ జీవితాలు బాగుపడాలని చేసిన చిన్న ప్రయత్నమే యామినిగా మారటం.

ఈ మధ్యకాలంలో వచ్చిన నవలల్లో 'అరవింద'ను నడిపిన తీరులో రచయిత ప్రతిభ కనపడుతోంది. సైకలాజికల్‌గా అన్ని కోణాల్లోంచి నవల మలచిన తీరు అభినందించదగినదిగా ఉంది.

**– అనురాధ రామకృష్ణ,** నెల్లూరు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net

# ఏడారిలో ఎన్ని శిలలు



ఇది ఏ చంద్రుడి ఉపరితలమో కాదు. మన భూగ్రహంలో భాగమే. కన్ను పొడుచుకున్నా ఒక్క పచ్చని గరిక పోచయినా కనిపించని ఎడారి నిండా మొలచుకొచ్చిన మొనదేలిన శిలలతో ఏదో సైన్స్ ఫిక్షన్ సెట్టింగ్‌లా కనిపించే ఈ ప్రాంతం ఆస్ట్రేలియాలోని సెర్వాంటిస్ పట్టణానికి దగ్గరలో ఉంది. దాదాపు నాలుగు కిలోమీటర్ల మేర ఒకటినుంచి ఐదు మీటర్ల ఎత్తులో భారీ పరిమాణంలో వేలాదిగా ఉన్న ఈ రాళ్లు 25 వేల నుంచి 35 వేల ఏళ్ల క్రితం ఏర్పడి ఉంటాయని శాస్త్రజ్ఞుల అంచనా. ఇసుకతో కప్పబడిపోయిన ఈ శిలలు గత వందేళ్లలోనే తమ ఆచ్ఛాదనను తొలగించుకున్నాయని వారు పేర్కొంటున్నారు.

